ఓం

# శివతత్త్వసారము



మల్లికార్జున పండిత
ప్రణీతము



విద్యారత్న నిడుదవోలు వేంకటరావుగారు, యమ్. ఏ.
రచించిన విపుల పీఠికా సహితము

1968

కృష్ణాపత్రికా కార్యాలయము
పోస్టుబాక్సు నెం. 253, హైదరాబాదు-1



[వెల : 5/-

# ఉ పో ద్ఘా త ము

బహుల రజసే విశ్వోత్పత్తౌ భవాయ నమో నమః
ప్రబల తపసే తత్సంహారే హరాయ నమో నమః
జనసుఖకృతే సత్త్వస్థిత్యై మృడాయ నమో నమః
ప్రమహసిపదే నిస్త్రైగుణ్యే శివాయ నమో నమః.

శివతత్త్వసారము అసాధారణ గ్రంథము. క్రీ. శ. 12 శతాబ్దిలో ఈ కావ్య ముద్భవించినది. ఆనాటి స్థితిగతులను బట్టియు, తత్పూర్వము శైవమున ప్రవర్తిల్లిన వివిధ సంప్రదాయములను బట్టియు, మల్లికార్జున పండితుడు దీనిని రచించుట సంభవించినది. తత్పూర్వము కాలాముఖ, లకులీశ, త్రిక సంప్రదాయములు ప్రవర్తిల్లినవి. పండితునకు వానియెడ నసంతృప్తి కలిగియుండును. అంతియేకాక నాటి బౌద్ధ జైనమతములు వైదిక కర్మలు, అద్వైతుల విధానములు, ఆయనకు విరుద్ధముగా తోచియుండును. కావుననే పండితుడు కొందఱను వాదములో జయించుటయు, కొందఱి సిద్ధాంతములను ఖండించుటయు తటస్థించినది.

మల్లికార్జున పండితు డసామాన్యవ్యక్తి. శ్రీశైలమల్లికార్జున దేవుని యనుగ్రహమున జన్మించనా డట. శ్రీమహేశ్వరుడే ఆయనను భూలోకమునకు బంపి నూతన శైవసిద్ధాంత ప్రతిపాదన చేయు మన్నట్లు ప్రతీతి. పండితుడు కోటిపల్లి క్షేత్రములో జన్మించి ఆరాధ్యదేవుని శిష్యుడై గురువుకడ శైవదీక్ష పొంది, శైవమత రహస్యములు గ్రహించినాడు.

పండితుడు ఆంధ్రదేశమున ఆరాధ్య సంప్రదాయ స్థాపకుడు. ఆయన వేదశాస్త్రములు పఠించినవాడు. కావుననే ఆరాధ్యులకు శ్రుతిస్మృతులందు ప్రమాణబుద్ధి కలదు. గృహ్యసంస్కారములను వారు వేదోక్తముగానే నడపుదురు. అంత్యసంస్కారములను ఆబ్దిక శ్రాద్ధమును సూత్రము ఆగమోక్తముగా జరుపుదురు. వీరు కులభేదము పాటింతురు. ఆంధ్రదేశమున ఆరాధ్యులు లింగధారణము చేయుదురు.

ఆ కాలముననే కర్ణాటదేశమున శ్రీ బసవేశ్వరు డను మహాను భావుడు వర్ధిల్లెను. బసవేశ్వర సంప్రదాయమున అబ్రాహ్మణులు లింగధారణము చేయుదురు. వారు లింగాయతులు. బసవేశ్వర శిష్యులకు వేదాదుల యెడ ప్రమాణబుద్ధి లేదు. వారికి శివభక్తియే ప్రధానము. ఆంధ్రదేశమున జంగము లిట్టివారే.

సహజముగా శివభక్తు డైన పండితుని యాచారములను నాటి స్మార్తులు ఆక్షేపించినట్లు తోచును. తేజస్వి యగు పండితుడు ఉద్దీప్తుడై వీరభావము వహించి క్రమముగా వీరమాహేశ్వరు డయ్యెను.

వైదిక మగు శివభక్తియు, పౌరాణిక మగు శివభక్తియు కలవు. వానికిని వీరమాహేశ్వరమునకును భేద మున్నది. శివారాధకులలో కొందఱు శాంతచిత్తులు, కొందఱు ఉగ్రులు కలరు. శాంతచిత్తులగు వారి సిద్ధాంతములు, సాధన ప్రణాళికలు మృదువుగా నుండును. ఉగ్రు లగువారి విధానము లుగ్రములే.

శివతత్త్వము మహోన్నతము. అతిప్రాచీన కాలమునుండియు శివమూర్తిని లింగరూపమున అనేకు లర్చించుచున్నారు. విభూతి, రుద్రాక్షలు, బిల్వపత్రములు శివభక్తులకు ప్రీతిప్రదములు. పంచాక్షరీ మంత్రము అత్యంత పవిత్రము.

ఈ గ్రంథమున శివపారమ్యము చెప్పబడినది. మంచిదే! కాని ఈకవి అద్వైతపరము లైన వేదవాక్యములకు ద్వైతపరముగా అర్థము చెప్పుట సంభవించినది. వీరు లగువారు శివుడు తప్ప అన్యదైవతము పేరు వినరు. శివమహిమకన్న వీరికి అన్య ముండరాదు. శివారాధన వలననే జనులు ముక్తు లగుదురు అని వీరి విశ్వాసము.

ఇందు శివనిందకుల సంహారము చెప్పినను, బసవపురాణమున కొందరు శివభక్తులు భవులను ( శైవులు కానివారిని ) వధించిన కథ లున్నను ఆ తరువాతి కాలమున వీరశైవు లిట్టివి సమ్మతింపలేదు. కాని శివునికై మృతినొందు వానికి ప్రేతకర్మలు చేయ నక్కరలేదు. వాని బందుగులకు సూతకము లేదు. అట్టివాని మృతికై పండుగ చేసికొనవలెను. శివనిర్మాల్యము శివదీక్షితుడు తప్ప అన్యులు భుజింపరాదు.

పండితు డిట్టివానిని ప్రతిపాదించుటకు కారణము లేమి? ఆతడు మహానుభావుడు, శివభక్తిపరాయణుడు, శివునికన్న అన్యమును పూజించినచో ముక్తి యుండదని విశ్వసించినవాడు. ఆయన జన్మను బట్టియు, శిక్షణను బట్టియు ఆయన కాలమున వర్తిల్లిన మతములను బట్టియు మనోవేదన కలిగి భక్తిభరిత హృదయుడై లోకానుగ్రహ బుద్ధితో జనసంతరణార్థము గాఢమైన ప్రణాళిక నిర్ధారించినట్లు కాన వచ్చును. ఏపని చేసినను ఆయన శివప్రీతికే చేసెను. స్వయముగా సమస్తమును శివమయముగా భావించువాడు జనులలో పరినిష్ఠితబుద్ధి ఏర్పడుటకై గట్టిచట్టము ఏర్పరచినాడు. ఈ కావ్యమున అన్యమత విరుద్ధముగా కానబడు తీవ్రవాక్కులను యథాతథముగా స్వీకరింపక, 'శివః సత్యం' అను సిద్ధాంతమునకు సర్వజనులను ఉన్ముఖులను చేయుటకై ప్రవచించినట్లు భావించుట యుక్తము. బాహ్యరూపమున వక్కాణించిన వాక్కులకన్న అంతర్గత సత్యమే అత్యంత ప్రధానమని గ్రహింప నగును.

ఈకావ్య మసమగ్రముగా నుండుట శోచనీయము. ఇది పద్య రూపమున, అందును కందపద్యముగా నడచుట పఠన పాఠనములకు యోగ్య మగు ననియు, స్మరణకు సులువనియు ఆయన తలచి యుండును. అన్యవాద, మతధిక్కరణము నేటికిని కొందరు, కొందరు తత్త్వవేత్తలు చేయుచున్న పనియే. భక్తుడగువాడు అద్వైతము నంగీకరింపలేడు. భక్తస్థితిలో నున్నవా రెల్లరును ద్వైతులే. ధర్మము కన్నను ద్వైతులకు భక్తియే ప్రధాన మగుటచే కొన్నియెడల భక్తి పక్షపాతమున విచిత్రకార్యములను ఉపపాదింప వలసి వచ్చును.అన్నిటిని సక్రమముగా గ్రహించి సమన్వయము చేసికొని పఠితలు ప్రమోదము చెందుట ప్రశస్తము. నమః పార్వతీ పతయే !

ఇతి శివమ్ !

స్వామి శ్రీ శివశంకరస్వామి
తీర్థాశ్రమము - ఒంగోలు

# పీ ఠి క

శివతత్త్వసారము ప్రాచీనాంధ్ర వాఙ్మయమునకు సంబంధించిన కృతి- ఈ నాడాంధ్ర వాఙ్మయ చరిత్రకారులు ప్రాచీనకాలమును నీక్రింది యుగములుగా విభాగించిరి-

| | | |
|---|---|---|
| 1. ప్రాఙ్నన్నయ యుగము—I | క్రీ. శ. 1 వ శతాబ్దినుండి—850 | (వచనము) |
| ,, II | క్రీ. శ. 850-1000 | (పద్యము) |
| 2. నన్నయ యుగము— | క్రీ. శ. 1000-1100 | |
| 3. శివకవి యుగము— | క్రీ. శ. 1100-1250 | |
| 4 తిక్కన యుగము— | క్రీ. శ. 1250-1350 | |

పై యుగములలో 'శివకవి' యుగమునకు జెందినది శివతత్త్వ సారము- ఆ యుగమునందలి కవులు ముగ్గురు[1]. మల్లికార్జున పండితుడు- నన్నెచోడుడు పాల్కురికిసోమనాథుడు-ఈ ముగ్గురిలో మొదటివాడైన మల్లికార్జునపండితుడే ఈ శివతత్త్వసారమును రచియించిన మహాకవి. ఆంధ్రవాఙ్మయమున, శైవ సాహిత్యము మల్లికార్జున పండితునితో ప్రారంభము- ఆ శైవవాఙ్మయము నకు శ్రీకారము చుట్టినది శివతత్త్వ సారము.

## తాళపత్ర ప్రతి

ఈ గ్రంథమున కొక్కటే తాళపత్ర ప్రతి లభించినది. అది చదువుల రామలింగయ్యగారను జంగమదేవర సంగ్రహములోనిది. ఆ తాళపత్ర ప్రతిలో నాలుగు గ్రంథములున్నవి.నూటడెబ్బదినాలుగు కమ్మలున్న యా ప్రతిలో 30వ తాటాకు మొదలు 67 వఱకు నీ శివతత్త్వసార మున్నది. 67 వ తాటాకు చివర- వ్రాయసకాని పేరును, వ్రాసిన కాలమును నిట్లు చెప్పబడినవి-

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు............

---

[1] వీరి ముగ్గురితోబాటు- సర్వేశ్వర శతక కర్తయైన యథావాక్కుల అన్న మయ్యకూడ శివకవి యుగములో క్రీ. శ. 1242 లో నున్నాడు- (చూడుడు తెలుగు కవుల చరిత్ర— శివకవి యుగము యథావాక్కుల అన్నమయ్య- పుటలు—350-379)

పింగళనామసంవత్సర కార్తిక బ॥ 13 గురు॥సర్కి......శివ సారాయ ముమ్మా అద్దాలపీరన్న స్వహస్త లిఖితం॥ ఈ పుస్తకం త్సదుపుల రామలింగయ్యగారికి శివార్పితంగా యిచ్చి శరణు చేస్తిమి "

శాలివాహన శకవర్షముల సంఖ్య యీయకపోయినను పింగళ సంవత్సరమున తిథి వారము లీయబడినవిగాన నీ గ్రంథము లిఖింపబడిన తేదీ కనుగొనుట సులభము— అది క్రీ. శ. 2-11-1797 వ తేదీకి సరిపోవు చున్నది. కాబట్టి యీ ప్రతి యిప్పటికి 169 యేండ్ల క్రిందట వ్రాయబడినదని నిశ్చయింపవచ్చును—

## వ్రాత ప్రతి

పై తాళపత్రప్రతి ననుసరించి వ్రాయబడిన కాగితపుప్రతి యొకటి మదరాసుప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్నది. [1] క్రీ. శ. 1917-18 లో మదరాసు ప్రభుత్వమువారు సేకరించిన విలువగల గ్రంథములలో నిది యొకటి యని-యా నివేదికయందు తెలుపబడినది [2].

ఈ గ్రంథముయొక్క యునికిని ప్రశస్తిని మొదట గుర్తించినవారు కీర్తిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు-

## ముద్రిత ప్రతి

ఈ గ్రంథమును మొదట గుర్తించిన కీర్తి ప్రభాకరశాస్త్రిలుగారిదైనట్లుగా, దీనిని మొదట ప్రకాశింపజేసిన కీర్తి సుగృహీతనాములగు కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారిది. ముద్రించిన యశస్సు ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారిది. లక్ష్మణరావుగారి పీఠికతో నిది క్రీ. శ. 1922 వ సంవత్సరమున నచ్చయినది [3]

## ప్రస్తుత ముద్రణము

నలభై నాల్గేండ్ల క్రిందట ముద్రితమైన యీ గ్రంథ మచ్చయిన నాటినుండి, సాహిత్య ప్రపంచమున నత్యధిక ప్రచారము గాంచినది. నన్నయ తిక్కనల నడిమికాలమున నిర్వివాదముగ బుట్టిన కావ్యము శివతత్త్వసార

---

[1] A Triennial Catalogue of Manuscripts. Vol. III. Part III. Telugu 1916–1919. No. 502. Pages 1288–1290.

[2] Introduction to the above page 2.

[3] ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రకటిత గ్రంథసంఖ్య—13

మగుటచేత, వాఙ్మయ చరిత్రకారులు, విమర్శకులు దీనిని ప్రామాణికముగ దీసికొనిరి. ఇది ప్రకటితమైన రెండేండ్లకే శతక కవుల చరిత్రకెక్కినది.[1] నన్నెచోడకవి కాల నిర్ణయ చర్చలలో ప్రాముఖ్యము వహించినది-క్రీ.శ. 1934 నుండియు, విశ్వవిద్యాలయములలో ఆంధ్ర వాఙ్మయ చరిత్రకెక్కి-విద్యార్థిలోకమునకు విద్వల్లోకమునకు సుపరిచితమైనది-

ఇట్లున్నను, నీ గ్రంథమును ఆంధ్రసాహిత్య పరిషత్తువారు పునర్ముద్రణము కావింపలేదు—క్రీ.శ. 1940 లో కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రిగారు—

## కన్నడ శివతత్త్వసారము

[2]కనుగొన్ననాటినుండియు, నీ తెలుగు గ్రంథముయొక్క విశిష్టత హెచ్చినది. ఒక్కసాహిత్య విషయముననేకాక, భాషావిషయమున నీ గ్రంథము ప్రామాణికమైనది-సుప్రసిద్ధమైన శ్రీ సూర్యరాయాంధ్ర భాషానిఘంటువున నిది గ్రహింపబడినది-

క్రీ.శ. 1927 లో పాల్కురికి సోమనాథుని బసవపురాణమును, క్రీ.శ. 1939లో పండితారాధ్య చరిత్రమును సుపరిష్కృతములై ప్రకటితములైనవి[3]. వాని మూలముగా శివతత్త్వసారమునందలి భాషావిశేషములేగాక—

---

[1] వంగూరి సుబ్బారావుగారిది—చూ. నూతనావృత్తి. ప్రస్తుత పీఠికా కర్తచే సంస్కరింపబడి పీఠికాదులచే నలంకృతమైనది-

## ప్రథమ ముద్రణము

[2] ఈ కన్నడ శివతత్త్వసారమును ప్రఖ్యాత రచయితలు, పత్రికా సంపాదకులు భాషావేత్తలునైన శ్రీ తిరుమల రామచంద్రగారెట్లు మొదట గుర్తించిరో ఆ విషయము, "శివతత్త్వసార పాఠాల మార్పుతగునా" అను భా. తి వ్యాసమున చూడనగును—(సం. 39 సం. 2 పుట 73).

[3] బసవ పురాణము-పరిష్కర్త-పీఠికాకర్త-వేటూరి ప్రభాకరశాస్త్రి.

## ద్వితీయ ముద్రణము 1952

పీఠికాకర్త-ప్రస్తుత గ్రంథపరిష్కర్త. పండితారాధ్య చరిత్ర-కీ. శే. కళాప్రపూర్ణ డాక్టరు చిలుకూరి నారాయణరావు.

గ్రంథమునందలి శైవమత సంప్రదాయవిషయములెన్నో క్రొత్తవి తెలియ వచ్చినవి - ఇవియన్నియు, శివతత్త్వసారమున చేరవలసిన యావశ్యకత కాన్పించినది—భాషాసాహిత్య చరిత్రకారులు తెలిసికొనదగిన విశేషములు బయలుపడవలసిన యావశ్యకత యంతకంటెను ప్రధానమగుటచేత నీ ముద్రణము ప్రారంభమైనది

## గ్రంథ పరిష్కరణ విధానము

పూర్వముద్రణమున నప్పటికిగల సాధన సామగ్రినిబట్టి గ్రంథపరిష్కరణము సాగించిన విధానము నిరూపితమైనది. ఒక్కప్రతియే లభించునపుడెట్లు పరిష్కరింపవలెనో, ఆ విషయమేగాక-పాఠము మార్పులవల్ల చరిత్రకెంత యుపయోగపడునో యదియు తెలుపబడినది-[1] మూలప్రతిలో నచ్చటచ్చట క్రిమిదష్టము లుండుటచేత, నా భాగము చుక్కలతో చూపబడినది— గ్రంథమున నక్షరములు కొన్ని లోపించుటచేత-అవి పూరింపబడి కుండలీకరణము చేయబడినవి—ఇట్లెంతో జాగరూకతతో పూర్వముద్రణము సాగినది-అయినను కొంత సంస్కరణ మావశ్యకమైనది.

పైనిచెప్పిన నూతన విషయములను, కన్నడ శివతత్త్వసారమును నాకళింపుచేసికొని — ప్రస్తుతముద్రణము — పరిష్కృతమై ప్రకాశితమైనది— ఆ విధానము నిట వివరించుచున్నాను.

దీనికి ముందుగా కన్నడ శివతత్త్వసారమును గూర్చిన వివరములు తెలుసుకొనవలెను—

## కన్నడ శివతత్త్వసారము

కన్నడ శివతత్త్వసారమంతయు పూర్తిగ లభింపలేదు. ఇందు 281 నుండి 472 వఱకు—191 పద్యములును, 728 నుండి 740 వఱకు 12 పద్యములును మొత్తముమీద 193 పద్యములు మాత్రమే లభించినవి. తెలుగున శివతత్త్వసారమున నన్నియు కందములే అట్లే కన్నడమున కూడ కందములే-మన యదృష్టవశమున గ్రంథకర్తృత్వమును గూర్చిన పద్యము కన్నడమున నిట్లున్నది.

కన్న. ధరయొళగె మల్లికార్జున
వరపండిత నెనిసుతిహుదటు నిన్నాజ్ఞా
భరమె సెయిర్ ప్రమశొరొళా
నిరె వెండీక్షితు వె నిమ్మ బయసు వెనీశా.

---

1. చిత్రభానసము— అచ్చు ప్రతి—చిత్తాబ్జభానుడు - అర్థములేదు. వ్రాతప్రతి—చిత్తాపహానుడు—విశేషార్థముగలది.

తెలుగు—ఒం డేమి మల్లికార్జున
పండితుడనరుండుకంటె ప్రమథులలో నె
న్నఁడొకొ నీ యాజ్ఞోన్నతి
నుండఁగఁ గాంతునని కోరుచుండుదు రుద్రా. 387 ప

పై రెండింటిని పరిశీలించినచో, తెలుగు కృతికే, కన్నడ మనువాద మనియు రెండింటికి కర్త మల్లికార్జున పండితుడేయనియు స్పష్టమగుచున్నది. కన్నడ భాషలో ప్రాస యుండునుగాని యతి యుండదు-అందుచేత యతి ప్రాస లున్న తెలుగు కృతియే ముందు రచిత మైనదని చెప్పవచ్చును—ఇక దీని మూల మున పరిష్కరించిన ఈ క్రింది విషయములను చూచినచో, కన్నడగ్రంథ విశే షము లెంతగా నుపకరించినవో తెలియగలదు.

పూర్వ ముద్రణము — పూ. ము. అను సంకేతికము. నూత్న ముద్ర ణము - నూ. ము.

## నష్టభాగ పూరణములు

1. పూ. ము. క......
గా నించుకలేని నా స్థితి కస్థితి విషయా
ధీన దురాచారికి యో
గానందము గలుగ నేర్చునయ్య మహేశా! 266 ప.

ఇందు మొదటిపాద మీక్రింది కన్నడ పద్యమునుబట్టి పూరింపబడినది.

క. జ్ఞానం వైరాగ్యమెన
ల్కెనా నొందిరద నాస్తికస్థితి విషయా
ధీన దురాచారిగ యో
గానందం దొరకలాగ్కమే సర్వేశా, 278 ప

కాబట్టి మొదటిపాద మీ క్రిందిరీతి నుండును.

నూ. ము. క. (జ్ఞానము వైరాగ్యము నన
గా) నించుకలేని నాస్తిక స్థితి విషయా
ధీన దురాచారికి యో
గానందము గలుగనేర్చునయ్య మహేశా. 267. ప. పుట 51.

---

ఈ చిత్తాపఖానుడే—షితాబ్ ఖాన్ — తెలుగువాడైన సీతాపతి-1500 ప్రాంతమున ఒరంగలు నేలినవాడు. ఈతని గూర్చి-శ్రీయుతులు-ఆదిరాజు వీర భద్రరావుగారు వ్రాసిన షితాబ్ ఖాన్ అను గ్రంథము చూడదగును.

2. పూ. ము. క. ఆలరి దక్షుని నోమున
కేలా చను దెంచితంచు నీశానదిశా
. . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . 310 ప.

లోపించిన రెండు పాదములు కన్నడానువాదము ననుసరించి పూరింపబడినవి.

క. పిళప్పు దపయాగ శై
వేలడియదె బందరెనుత మీశానదిశా
పాలకరం సురతతియం
శూల దొళిరె దిఱుదు కొందన బెన నభవా- 320 ప.

పై దానినిబట్టి తెలుగు పద్యము.

మూ. ము. క. ఆలరి దక్షుని నోమున
కేలా చనుదెంచి తనుచు నీశానది శా
పాలకులను సురనికరము
శూలముతో బొడిచి చంపఁజొచ్చిరి రుద్రా! 310 ప. పుట. 59

పై పద్యములలో ప్రాసస్థానము సమానమై యుండుట గమనింపదగినది. ఇక 170 పద్యమునకు (పుట 35) 352 పద్యమునకు (పుట 67) 49 పద్యమునకు (పుట-) కన్నడానువాదము లభ్యము కానందున యట్లే విడువబడినవి. 275, 276, 277, [illegible] పద్యములలో చుక్కలున్న పదములు ప్రస్తుత రాజకీయ ముద్రణ శాసనము ననుసరించి, లోపింపజేయబడినవి.

## అర్థ సంస్కారణము

పూ. ము. క. వెలగొనియ దీక్షితుడు దే
వలకుం దనఁ బూజచేసి వర్తించు మెయిన్
మలహరుని దీక్షితుడు దే
వలకుం దెలుగంగ జేయవలయును దీనిన్ 226 ప.

ఈ ముద్రిత పాఠమున విపరీతార్థము గలిగినది. శివదీక్ష లేనివాడు వెలగొని అనగా డబ్బు పుచ్చుకొని శివపూజ చేయును అదియును శివపూజయే కాని వాడు దేవలకుఁడు. ఇక శివదీక్ష పొందినవాడు ఆ శివపూజయే చేసినను వాడు దేవలకు డెంతమాత్రమును గాడు. అని పై పద్య తాత్పర్యము.

ఇది శివదీక్షా ప్రాధాన్యము నిరూపించు పద్యము. శివ దీక్షితుడుకూడ దేవలకుడే యను నర్థ మిచ్చుచున్నది. ఇది శైవమత దీక్షా సంప్రదాయమునకు విరుద్ధము. కన్నడపద్య మిది.

క. బెళగొండ దీక్షితం దే
వలకం శివపూజ గెయ్యి వర్తిపక తదిం
మలహారన దీక్షితం దే
వలకను మల్లెందు తిళియ వేర్కొద వెళ్ళర్

దీనినిబట్టి చివటిపాదము

మలహారుని దీక్షితుడు దే
వల కుండునుగా డెఱుంగవలయు మహేశా.

అప్పుడు తెలుగు పద్య మిట్లుండును-

క. వెలగొనియదీక్షితుఁడు దే
వలకుండన బూజచేసి వర్తించు మెయిన్
మలహారుని [1] దీక్షితుడు దే
వలకుండునుగా డెఱుంగవలయు మహేశా.

దేవలకు డనగా ఆలయపూజారి—నంబి—శివాలయముల పీరలను తంబళి యందురు- ఇతడు శివపూజయే చేయును- కాని అదివృత్తి వెలగొనిచేయునది— అతడు శివదీక్షలేనివాడు—ఇక శివదీక్షయున్న భక్తుడును శివపూజచేయును- అంతమాత్రముచేత అతని దేవలకుడని యనరాదు-అని సంస్కరణ పద్యమునకు తాత్పర్యము శైవమున శివపూజకు దీక్ష నియతముగానుండవలెను-

1. క. నిన్నెఱుగుచుఁ దన్నెఱుఁగని
యన్నఁడు శివయోగ మగ్నుడనఁబడు [మదిలో]
నిన్నును దన్ను నెఱింగెడి
యన్నఁడు శివయోగమగ్నుఁ డనబడును శివా. 269

"పూర్వపీఠికలో దీనిని గూర్చి యిట్లు గలదు. (పుట 38)

"'ఆనాఁడు' అనుటకు 'అన్నఁడు' (269) 'మలహారుఁడు' అనుటకు 'మలహు' (415) అను మాఱురూపములు కానవచ్చుచున్నవి—" కాని

---

[1] ఇచట దీక్షితుడనగా- యజ్ఞదీక్షితుడని కాదు— శివదీక్ష గైకొన్నవాడని శైవ సంప్రదాయి కార్థము-

'అన్నఁడు' అనునది 'ఆనాఁడు'- ఆ దినము అను శబ్దమునకు మాఱురూప మెంతమాత్రమునుకాదు. కన్నడభాషలో 'అన్నన్-అన్నళ్' అనగా Such a man, such a woman" అను నర్థములు కిట్టెలు నిఘంటువున నున్నవి. కన్నడమున 'అన్నన్' తెలుగున-అన్నణ్ణు- అన్నండు- అన్నఁడు అని రూపాంతరము నందినది-

ఈ యర్థము ప్రకారము పై పద్యమున కర్థమిట్లు లభించును. 'నిన్నును తన్నును,' అనగా శివుని నెఱుఁగుచు, స్వవిషయమును నెఱుంగని యట్టివాడు శివయోగ మగ్నుఁ డనబడును- నిన్నును-అనగా శివుని తన్నును-తనను, అనగా యిద్దరిని యెఱిఁగెడి నట్టివాడు శివయోగమగ్నుఁ డనబడును-

ఇచట రెండు చోట్లను-"అనబడును" అని యుండుట యెంతమాత్ర మును సరికాదు. ఈ పద్యమున శివదీక్షితులైన యోగులకు అద్వైతమత సంప్రదాయానుసారులగు యోగులకు భేదము స్పష్టముగా నిరూపితమైనది- అద్వైత యోగులు సర్వసంగపరిత్యాగులై, జగమును, తమ్మునుగూడ మఱచి, బ్రహ్మ తత్త్వము మాత్రమే యెఱుగుదురు- ఆరీతిగా తమ నిజస్థితి నెఱుగక- శివునే యెఱిగినట్టివారు శివయోగు లనబడరు. ఇక తమ్మును, శివునికూడా, యోగ మగ్నులై యున్నను నెఱిగెడివారు-శివయోగు లనబడుదురు- శివయోగమునకు కీలకమైన యీ యర్థమునే సర్వేశ్వర శతకకర్త- యిట్లు నిరూపించియున్నాడు.

వెలి వీక్షించిన నీ స్వరూపమె మహా విస్పష్టమై యాత్మలో
పల భావించిన నీ స్వరూపమె మహాప్రవ్యక్తమై దృష్టులం
దలపం జేకొనియున్న నీయచలిత ధ్యానంబునం జేసి తాఁ
గలనైనన్ శివయోగి తానె జగముం గానుండు సర్వేశ్వరా![1]

ఈ శైవ సాంప్రదాయము ననుసరించి పై శివతత్త్వసార పద్య మిట్లు సంస్కరింపబడినది.

"నిన్నెఱుఁగుచుఁ దన్నెఱుఁగని
యన్నఁడు శివయోగ మగ్నుఁడనఁ బడఁ (డెపుడున్)
నిన్నును దన్ను నెఱింగెడి
యన్నడు శివయోగమగ్నుఁ డనబడును శివా!!

మల్లికార్జున పండితుడు శివయోగమగ్నుడై యున్నను బెలిదేవ వేమనారాధ్యులు సూరసానమ్మ వచ్చినప్పుడు, వారి రాక నెఱిగి, వారిని పూజించినట్లు పండితారాధ్య చరిత్రమున గలదు.

---

[1] తన్ను జగముం గానడు అను ముద్రితపాఠము సరికాదు.

2. "కలియుగమునఁ జోరులచే
బలిమి కులస్త్రీలు పడ్డ భంగిన"...... పూ. ము.

ఇందు మొదటి పాదము కలియుగమున 'జారులచే' అన్న పాఠము కన్నడ శివతత్త్వసారమునుబట్టి మార్చబడినది.

## యతిసంస్కరణములు

1) "కర్తయని నిన్ను నెఱిఁగినఁ
గీర్తింపఁడు వెండి తన్ను కార్యాకార్యా
వర్తనల కర్త నేనని
కర్త ప్రధానంబుగాఁగ ఘనభక్తుఁడజా

పూర్వ ముద్రణమున నిందలి రెండవ పాదమున యతి భంగ మట్లే నిలిచియున్నది[1].

వ్రాత ప్రతిని పరిశీలింపగా,

కర్తింపడు వెండి తన్ను కార్యా కార్యా
కర్తనల"

అని సరియగు పాఠము లభించినది- ప్రస్తుత ముద్రణలో యతి భంగములేదు— "కర్తింపడు"— అను పాఠమే గలదు- (148 ప)

"కర్తింపడు" అనునదియే, కవ్యుద్దిష్ట పాఠమైనట్లు పండితారాధ్య చరిత్రమునం దీ క్రింది పంక్తులనుబట్టి తెలియుచున్నది.

## కర్మవాద నిరసనము

ద్వి. క్షణికమ చిత్తు నిర్గుణము కర్మంబు
గణుతింప నం దెట్లు కర్త వసించు
కర్తయు జడుఁడు తత్కర్మవశుండు
[2] కర్తింపరా దెట్లు కర్మవశుండు॥

---

[1] దీని నాధారము చేసికొని కీర్తిశేషులు వఝ్ఝలవారు, తమ వాదమునకు ననుకూలించునట్లుగా, నితర స్థలములలోగూడ యతి సరిగా నున్నను దిద్దివేసిరి. (చూ. భారతి సం॥ 30. సం॥ 2) "శివతత్త్వసారము" అను వారి వ్యాసము.

[2] 'కర్తయు' అని 1939 ముద్రణపాఠము- కర్తించు- అని ప్రాత ముద్రణము (1914)

ఇచట శివుడే కర్తయని యెఱిగిన, అట్టివాడు, కార్యాకార్యా వర్తనల నేనే కర్తనని "కర్తింపడు" అనగా పని చేయడు. అని యర్థము- ఈ సందర్భమున శ్రీనాథ మహాకవి యిట్లు చెప్పియున్నాడు.

మ. శివుడే కర్త; శివుండె భోక్త; శివుఁడే చేయున్మఖాది క్రియల్
శివుడే విశ్వము నే శివుఁడ ననుచున్ జింతించుచున్ జాహ్నవీ
సవిధశ్రీ ఫల వృక్షవాటమున భస్మస్నాన శుద్ధాంగుఁడై
"భవ! కాశీధవ! నీలకంఠ!" యనుచున్ భావించు ధన్యాత్మునిన్
కాశీఖండము 2—58

2) కుమ్మరి దరికొల్చిన చి
చ్చిమ్ముల నావంబు కడవలెల్ల దరికొనం
గ్రమ్మగతి నజాండంబుల
బ్రమ్మ భవన్నేత్ర వహ్ని ప్రళయమున శివా పూ. ము.

దీనికి రెండవ పాదమునకు వ్రాతప్రతియందీ క్రింది పాఠమున్నది.

"చి చ్చుమ్మల నావంబు కడవ లుల్ల దరికొనం
గ్రమ్మగతి"

ఇదియే సరియగు పాఠము- పద్య మిట్లుండును-

కుమ్మరి దరికొల్చిన చి
చ్చుమ్మల నావంబు కడవ లుల్లదరికొనం
గ్రమ్మగతి నజాండంబుల
బ్రమ్మ భవన్నేత్ర వహ్ని ప్రళయమున శివా 323 ప.

ప్రస్తుత ముద్రణ మిట్లేయున్నది.

కుమ్మరి దరికొల్చిన- అగ్ని-ఉమ్మలన్- ఊష్మములన్ అనగా వేడిచేత ఉల్ల,- అనగా, నాతి దూర నాతి సమీపప్రదేశమునగల కడవలన్నియు వేడియైన రీతిగా, శివుని నేత్రవహ్ని ప్రళయకాలమున వ్యాపించును-

## శబ్ద సంస్కరణలు

99 త్రిక్కక దొరకవె— ఇది త్రిక్కక దొరకొనె—అని
వ్రాతప్రతి పాఠము- అర్థస్ఫురణచే గ్రహింపబడినది
దొరకొనె పండితుడు పెక్కుసారులు వాడియున్నాడు

226 రతి పుట్టి-రతి వుట్టి- అని ప్రథమమీది గసడదవాదేశము చూపబడినది.

306 ఒండు శితమున- ఒండు సితమున- సంఖ్యావాచకముల మీద గసడదవాదేశము నిత్యముకాబట్టి 'సితమున' అని చూపబడినది.

318 తోలి సంపె- తోలి చంపె. క్త్వార్థక యికారముపై గసడ దవాదేశము రాదు-

375 విధి వేఱ కలదె.........

............................

............................

విధి పుత్రుఁడు దక్షుడైన విధ మెఱుగరొకో

ఇచట వ్రాతప్రతి పాఠము- "యఱుంగరణా" అని కలది వ్రాయసకాడట్లు వ్రాసినను దాని సరియగు రూపము-"యెఱుంగరనా" అనునది పూర్వపు వ్రాతలలో య. యె. న, ణ. వ్యత్యాసముగా నుండుననుట తాళపత్రపు వ్రాతలతో సంబంధించినవారెల్ల నెఱిగినదే- కాబట్టి 'విధమెఱుఁగరనా' సరియగు పాఠము.

"ఎఱుంగరనా" అనునది "ప్రార్థనాదులందన్నాదులను ప్రయుక్తంబగు" అను సూత్రము ననుసరించి వచ్చినది. 'విల్లివనా' అని భాస్కర రామాయణమందలి ప్రయోగము.

పై రీతిగా సాధ్యమగునంతవఱకు జాగరూకతతో ప్రాచీనాంధ్రభాషా సంప్రదాయముల ననుసరించి, పై సంస్కరణలు గావింపబడినవి- ఇక గ్రంథ విషయములు ప్రస్తావింపబడును.

## గ్రంథకర్తృత్వము

"శివతత్త్వసార"మను నీ గ్రంథమునకుఁ గర్త మల్లికార్జున పండితుడు. ఈ విషయ మీ గ్రంథమందలి యీ క్రింది పద్యమువలన స్పష్టపడుచున్నది:—

కం.ఒండేమి? మల్లికార్జున, పండితుఁడన నుండుకం టెఁ బ్రమథులలో నె
న్నండొకొ నీ యజ్ఞోన్నతి, నుండగ గాంతునని కోరుచుండుదురుద్రా
387 ప.

పాల్కురికి సోమనాథ మహాకవి రచిత 'పండితారాధ్య చరిత్ర'మునకు నాయకుఁడును ఆరాధ్య సంప్రదాయ ప్రవర్తకుడునగు మల్లికార్జున పండితారాధ్యుడే యీ గ్రంథమునకుఁ గర్తయని యీ గ్రంథమువలననే తెలియుచున్నది. పండితారాధ్య చరిత్రమునందు బండితునిచే 'శివతత్త్వసారము' రచియింపబడియెనని స్పష్టముగ యిట్లున్నది.

---

[1] దీనినిగూర్చి వ్యాకరణ విశేషములలో చూడనగును.

[1] పండితారాధ్య చరిత్ర-ఆంధ్ర గ్రంథమాలా ప్రచురణము-1939.

*"ఈ రీతి జను పూర్వపక్ష సిద్ధాంత, పక్షముల్ తత్కర్మ
భాగైక పూర్వ
పక్షేతర జ్ఞాన పక్షసిద్ధాంత, పక్ష వేదార్థోప పాదితపరమ
శైవాత్మకాచార సంసిద్ధి శుద్ధ, కేవలభక్తి సద్భావనోపేత
వీరమాహేశ్వరాచార మార్గాను, సారియై 'శివతత్త్వసార 'సత్కృతిని
గాఁ కేవల భక్తిగతి బ్రతిష్ఠించి, యావట దానునునట్లె వర్తించు
చున్నవాడని వెండియును బ్రశంసింప, మన్ననపేర్మిన
మల్లికార్జునుడు.
దీక్షా ప్రకరణము పుట 173"

ఆరాధ్యుల వారిని శివుండు జన్మమెత్తుటకుఁ బొమ్మని స్వర్గము నుండి భూమి మీఁదికిఁ బంపినపుడే యీ 'శివతత్త్వసారము' నుపదేశించెను.

శివ మహత్త్వ ప్రతిష్ఠిత వచస్సిద్ధి, శివతత్త్వసార సంచిత
కళావృద్ధి..................జనఁగెద    దీక్షా ప్ర. పుట 183

ఈ గ్రంథము నారాధ్యులవారును, వారి శిష్యులు, నితరభక్తులును సాధారణముగ నెప్పుడును బఠించుచుండినట్లు పండితారాధ్య చరిత్రమునందు పెక్కుచోటుల జెప్పబడియున్నది.

శివతత్త్వసార సంచిత మహామహిమ, శివతత్త్వసార మన్నివకృతి
బొగడు
దీక్షా ప్ర. పుట 183

శతకంబు, శివతత్త్వసార మాదిగను, గద్య పద్యంబు లాకాంక్ష
జదువుచును
వాద ప్ర పుట 518

శతకంబు శివతత్త్వసారము దీప, కళిక మహానాటకము నుదాహరణ
..................అరుదొంద జదువుచు నంకించువారు.
పర్వత ప్ర పుట 432

పై పద్యమున శివతత్త్వసార గద్యపద్య సమితి అను సమాసమున గద్య పదమునుబట్టి శివతత్త్వసారము గద్యములో అనగా వచనములో కూడ రచిత మైనట్లూహింపబడినది కాని యది సరికాదు—

ఇచ్చట. శివుని, మహిమ శివతత్త్వసారముచేతను గద్య-అనగా-అను ప్రాసాళిశోభిత రగడాదిగేయ కృతులచేతను, పద్యకృతులనగా శతకాదులచేతను, పండితుడు లోకమున వెల్లడించెనని యన్వయము—

[1] అనుభవసారము 7 వ పద్యము-వావిళ్ళ ముద్రణము 1955

సోమనాథుడే మల్లికార్జున పండితుఁడీ గ్రంథమును రచించిన సంగతి వేఱొకచో నిట్లు చెప్పియున్నాడు.

సీ. శ్రుతి 'యేక ఏవరుద్రో నద్వితీయాయ తస్థే'యనుట యథార్థంబుదలప
అవల 'నణోరణీయాన్మహతో మహీయా'నన నదియె యనూన
పదము పంచి 'యవాగ్గోచరం'బను 'నప్రాప్యమనసాసహా' యను
మాట నిజముపదియుఁ గాదనియెడు పరమేశ్వరుఁడె యెఱుంగు నెద్ది
దన్నెఱుగ దనెడు
ఎట్టులనుచు సంశయింపక శివతత్త్వ, సార గద్యపద్య సమితి శివుని
మహిమ తెల్పినట్టి మల్లికార్జున పండితయ్యగారి దలతు ననుదినంబు !

ఇట్లు పాలకురికి సోమనాథుడు శివతత్త్వసారమును బండితారాధ్యుడు రచించెనని చెప్పుటయేగాక యాకావ్యము నుండి పండితారాధ్య చరిత్రములో గొన్ని పద్యముల నుదాహరించియున్నాడు.

## (శివతత్త్వసారమునందలి పద్యములు)

కం. ఒండేమి మల్లికార్జున, పండితు డననుండుకంటె బ్రమథులలో నె
న్నండొకో నీ యాజ్ఞోన్నతి, నుండగ గాంతునని కోరుచుండుదు
రుద్రా 387 ప.

కం. దేవా సంసారాంబుధి, లో వెలువడ జేసి ప్రమథలోకం బెఱుగన్
నావాడు వీడు సుండీ, నావే నన్నుంపవే గణంబుల నడుమన్
386 ప.

## (పండితారాధ్య చరిత్రలోని ద్విపదలు)

ఊర్జిత ప్రమథాత్మయొండేమి ? మల్లికార్జున పండితుడన నిచ్చోట
నుండుటకంటె నెన్నండకో ప్రమథ, మండలిలో భవన్మహదాజ్ఞ జేసి
యుండంగ గాంతు నొకో'యని కోరు, చుండుదు' నన్నట్టులును
చగదయ్య
దేవ యీ సంసార తీవ్రదుఃఖాగ్ని, లో వెలి ప్రమథాదిలోకం బెలర్ప
నావాడు వీడు సుండీ వేఱుగాడు, నావె నన్నుంపు గణంబులనడుమ
పర్వత ప్ర. 544

ఇంతియ కాదు-ఇందలి కొన్ని ప్రకరణముల సారాంశమును వీలగునంత వఱకు నిందలి శబ్దములతోడనే సోమనాథుడు తన గ్రంథమునందు జేర్చెను. ఈ విషయము ముందు వివరముగ జర్చింపబడును.

# పండితారాధ్యుల కాలము

పండితారాధ్యుని కాలమును మన మాతని సమకాలికుల కాలమును బట్టి నిర్ణయింపవలయును. పాలకురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రములో నతని సమకాలికులయిన కొందరు రాజుల యొక్కయు గొందరు మంత్రుల యొక్కయు పేళ్ళు చెప్పబడినవి. వానిలో కళ్యాణమందలి బసవేశ్వరుడు, చందవోలు లోని వెలనాటి చోళుడు, పానుగంటి ఉదయావనీశుడు, అనువారలు ముఖ్యులు.

1) బసవేశ్వరుడు:- బసవేశ్వరుని భూమిపై నవతార మెత్తుటకు బంపినపుడే శివుడు పండితునిగూడ బంపెననియు *బండితారాధ్యులవారు గుంటూరు జిల్లాలోని యమరావతిలో నుండగా బసవేశ్వరుని దూత లాతనియొద్దకు వచ్చిరనియు దరువాత బండితుడు బసవేశ్వరుని జూచుటకు బయలుదేటి నైజాము రాజ్యమందలి పానుగంటి మీఁదుగా వనిపుర గ్రామమునకు జేరువఅకు బసవేశ్వరుడు కూడలి సంగమేశ్వరునిలో లింగైక్యము జెందెనన్న వార్త రాగా మిక్కిలి విలపించెననియు జెప్పబడియున్నది. కళ్యాణపురమున రాజ్యముచేసిన కాలచురి రాజగు బిజ్జలునకు లింగాయిత మతప్రవర్తకుడైన బసవేశ్వరుడు ముఖ్యమంత్రి. బిజ్జలరాజు క్రీ॥ 1160 లో రాజ్యమునకు వచ్చి 1167 లో బసవేశ్వరుని శిష్యులచే జంపబడియెను. బసవేశ్వరుడు 1167 లోనే లింగైక్యము జెందెను— కావున బండితారాధ్యుడు 1160-70 ప్రాంతమువాడని మనము నిశ్చయింపవచ్చును.

2) వెలనాటి చోడుడు:- పండితారాధ్యుని మరియొక సమకాలికుడు వెలనాటి చోడుడు. పండితుడు సనదవోలు (చందవోలు) గ్రామమునందు వెలనాటి చోడుని సభకుబోయి బౌద్ధులతో వాదించినట్టును, బౌద్ధగురువును, ఈతని శిష్యులు చంపఁగా రా జీతని కనులుతీయించినట్టును, అందుపై బండితుడా రాజును శపించి యమరావతికి వెడలిపోగా నారాజు నశించినట్టును, వాద ప్రకరణము మహిమా ప్రకరణము నందును జెప్పబడినది. † చందవోలిలో వెలనాటి రాజులు రాజ్యము చేయుట ప్రసిద్ధము ఆ వంశమునందు వెలనాటిచోడ

---

† చూడు పుటలు 170—261

*దీక్షా ప్రకరణము పుట 8

I మహిమా ప్రకరణమందలి పండిత ప్రలోపము పుట 301 మొదలయినవి చూడు.

I Rice; Mysore Vol. P. 392.

**నామముగల రాజులు తాత** మనుమ లిద్దరుండిరి. వీరి శాసనములనుబట్టి కాల నిర్ణయము చేయగా మొదటి వెలనాటి చోడుడు క్రీ॥ శ॥ 1115 మొదలు 1163 వఱకు రాజ్యము చేసెను. రెండవ వెలనాటి చోడుడు క్రీ॥ శ॥ 1163 మొదలు 1180 వఱకు రాజ్యమేలెను. + ఈ రెండవ వెలనాటి చోడరాజే తెనుగు దేశ మందు వెలనాటి చోడుడన్న పేరుతో విశేషముగ ఖ్యాతి గాంచెను. ఇతడు బసవేశ్వరునికి సమకాలీనుడు. కావున బండితు డీతని సభకే వెళ్ళియుండెనని మనము నిశ్చయముగ దెలిసికొనవచ్చును. I ఈ రాజునకే చోడుడనియు, రాజేంద్ర చోడడనియు, కులోత్తుంగ రాజేంద్ర చోడుఁడనియు నామాంతర ములు కలవు దీనినిబట్టి పండితుడు క్రీ. శ. 1160-1180 ప్రాంతము వాడనుట స్పష్టము.

3) ఉదయావనీశుడు:- పండితారాధ్యుని మూడవ సమకాలికుడు పానుగంటి ఉదయావనీశుఁడు. పండితుడు పానుగల్లను గ్రామమునకు వెళ్లినప్పు డచటి యుదయుఁడను రాజు రాజ్యము చేయుచుండెను. ఆతడు చోడవంశము వాడు. ఆతని మంత్రి పింగలి గోవింద ప్రధాని. పానుగల్లు నైజాము రాజ్యము నందు మహబూబ్ నగర్ జిల్లాలో నాగర్ కర్నూలు తాలూకాలో నున్నది. ఇది పూర్వము గొప్ప దుర్గము. ఈ ప్రాంతమునఁ బండితుని కాలమున నుదయ చోడుడను రాజు రాజ్యము చేసినట్లు శాసనముల వలనఁ గానవచ్చుచున్నది. ఉదయచోడుని దండనాయకులు శా.శ. 1084 (క్రీ శ. 1162) లో వేయించిన శాసన మొకటి *జడచర్ల నైజాము రాజ్యము నందు బానుగంటికి నుత్తరమునఁ బదునైదు క్రోశముల మీఁదఁ గలదు. దీనినిబట్టి పండితుడు క్రీ.శ. 1160 ప్రాంతముల నున్నట్లు విదితము.

ఇట్లు పండితుని సమకాలీనులైన యొక్క మంత్రిశేఖరని యొక్కయు, నిద్దరు రాజుల యొక్కయు గాలమును స్వతంత్రములయిన వేర్వేఱు శాసన ప్రమాణములవలన క్రీ శ. 1190—40 ప్రాంతమని నిశ్చయింపగలిగితిమి గనుక యిది నిజమైన కాలనిర్ణయమనియే యెంచవలయును.

4) బుద్ధరాజు:- 'చందవోలు కైఫీయతు' అను దానిలోఁ బండితుని కనలు దీయించిన వాఁడు కొండ పడమటి బుద్ధ రాజని చెప్పఁబడియున్నది. + ఈతడు మన వెలనాటి చోడుని బావమఱది, భార్యకు దోఁబుట్టిన

---

* Lythic Records of Hyderabad by Mr. Rama Krishna Kavi.

పండితుఁడు మొదటి వెలనాటి చోడుని కాలమున గూడ నుండిన నుండవచ్చును గాని రెండవ చోడుని కాలమున నుండిన మాట నిశ్చయము.

వాఁడు, అతనికి మంత్రిగ నుండెను: ఈతని శాసనమొకటి శా శ. 1093 (క్రీ.శ. 1171) నాటిది చందవోలులో గలదు. Iకావున నందువలనను మన మిదివఱకుఁ జేసిన కాల నిర్ణయమే సరిపోవుచున్నది.

5) బెలిదేవు వేమనారాధ్యుడు:- ఈ కవి కాల మూహించుట కింకొక మార్గము కలదు. పండితారాధ్యుని చరిత్రము వ్రాసిన పాలకురికి సోమన, పండితుని సమకాలికుఁడైన బెలిదేవి వేమనారాధ్యుల మనుమని శిష్యుడు *తాత మనుమలకు రెండు తరము లంతరము, గనుక తరమునకు 30 సంవత్సరముల ప్రకారము చూచిన సోమనాధుడు బెలిదేవ వేమ నారాధుని మనుమడును సమ కాలికులు—సోమనాధుడు పండితారాధ్యుని కుమారుని మనుమలను వారి శిష్య గణమును పేర్కొనుటచే నాతడు క్రీ శ. 1200 ప్రాంతమువాడు. ఇదియును పై చెప్పిన కాల నిర్ణయమును నిశ్చయము చేయుచున్నది[1]

* పండితుని సూత్రము సంగతిగాని గోత్రము సంగతిగాని పండితారాధ్య చరిత్రమునందు జెప్పబడలేదు. 'చతుర్మత నిర్ణయ' మన్న చిన్ని సంస్కృత పుస్తకమునందు నితనిని గుఱించి చెప్పుచు "ఖ్యాతో గౌతమ గోత్రజో గురు వరో ఋగ్వేద శాఖాన్వితః" అని చెప్పబడియున్నది. ఈ చిన్ని పొత్తము వరంగంటి శివధర్మ వర్ధనీ రామలింగేశ్వర ముద్రాక్షరశాలలో ముద్రింపబడి యున్నది. ఇది యెవరెప్పుడు వ్రాసినదినది తెలియదు. ఇది యెంతవఱకు ప్రమాణమో చింత్యము.

---

+ లోకల్ రికార్డ్స్ సం. 19, పుట 433

I Er Ind Vol. VI P. 268

*పేరెన్నబడిన శ్రీ బెలిదేవి వేమ నారాధ్యులను పరమారాధ్య దేవు। మనుమని శిష్యుండ, (దీక్షా పుట 4) పండితుడును వేమనారాధ్యుడును సమ కాలికు లనుటకు పేరెన్నబడిన శ్రీ బెలిదేవి వేమ। నారాధ్య లాదిగా నలరు జంగములు।
దవిలి పండిత విభు దర్శించువేడ్క...సను దెంచుచుఁడగ.

(దీక్షా పుట 58)

*నరసింహాచార్య రచిత కర్ణాట కవి చరిత, పుట 940, 229.

[1] చూడుడు, పండితారాధ్య చరిత్రము— భారతి—

పండితుని కాలమింకను మనము సూక్ష్మముగ నిర్ణయింపవచ్చును -దానికి బసవేశ్వర సమకాలికత్వమే యాధారము-బసవేశ్వరుని కలుసుకొనుటకు పండితుడు బయలుదేరి వెళ్లుచుండగా దారిలో బసవనలింగైక్యముజెందిన వార్తవిని, శ్రీశైలమున శివరాత్రి వ్రతము చెల్లించుటకు వెళ్ళదలచియు వృద్ధాప్యముచేత తన శిష్యుడైన దోనయ్యను, నచ్చటికిబంపి యాతడు తిరిగిరాగానే తాను లింగైక్యముజెందెను—బసవన లింగైక్యము క్రీ.శ. 1167 లోనే జరిగినట్లు నేడు నిర్ధారితమైనది [1] అప్పటికి పండితుడు వృద్ధదశలోనున్నట్లుగా, పండితారాధ్య చరిత్రవలన దెలియుచున్నది—దోనయ్య శివరాత్రి శివపూజ సేయుచుండగా శ్రీగిరి మల్లికార్జునుడు వృద్ధతాపసి వేషమునవచ్చి, దోనయ్యతో పండితారాధ్యులు క్షేమము పూర్వస్నేహితులము—అని ఆయన యోగక్షేమము విచారించెను పండితుడు వృద్ధుడుకాకపోయినచో, ఈశ్వరుడట్టి వృద్ధవేషముతో రావలసిన యగత్యములేదు-ఆతడు శ్రీశైలమునకు వెళ్ళలేకపోవుటయు నిందులకు నిదర్శనము—

ఇక నేటి విమర్శకులు తలంచినట్లుగా, పండితుని లింగైక్యమునకు బసవని లింగైక్యమునకు విశేషకాలము [2] వ్యవధిలేదు — ఈ కాలవ్యవధి యసంగతము—అప్రామాణికము-

పండితునికి బసవన లింగైక్యము సంగతి యాతడు లింగైక్యము చెందిన ఎనిమిదిదినములకే తెలిసినదని పండితారాధ్యచరిత్ర యిట్లుస్పష్టముచేయుచున్నది

పండితుడు- "కల్యాణమున కభి గమనంబుసేయ"

కల్యాణమున భక్తి గజిబిజి పుట్టి
బల్లహు బిజ్జలు భంజించిరంత
బల్లిదులే జగదేక మొల్లె బ్రహ్మయలు
నేఁగి కప్పడి సంగమేశ్వరంబునకు
దాఁగోరి బసవన దండనాయకుఁడు
నిచ్చమైనా సంగమేశు గర్భంబుఁ
జొచ్చె దేహముతోడ చోద్య మొప్పార
నిదియు దా నేటికి నెనిమిది దినము
లని నిక్కమనుచు నొక్కయ్య సెప్పఁడును. మహిమ ప్ర 199పుట

[1] ఈనాడు కర్నాటదేశమున, తెలుగు దేశమున-1967 లో బసవని యష్టమ శతాబ్ది జయంత్యుత్సవములు జరుపుచుండుటయే దీనికి ప్రమాణము.

[2] "క్రీ.శ.1190-ఆతని మరణకాలమని నిశ్చయింపవచ్చును"పూర్వపీఠిక.
"కీ.శ. 1208 తర్వాతనని-" పాల్కురికి సోమనాథు డెప్పటివాడు అను గ్రంథమునగలదు—

పండితు డీ వార్త వినిన వెంటనే బయలుదేరుటయు, నా వెనుక జరిగిన వృత్తాంతము మీద వివరింపబడినది-దీనినిబట్టి, ఏ సంవత్సరమున బసవన లింగైక్యముజెందెనో, ఆ సంవత్సరము శివరాత్రి వెనుక కొలది దినములలోనే పండితుడు లింగైక్యముజెందెను-కనుక వారిరువురి లింగైక్యమునకు కొన్ని నెలలు మాత్రమే వ్యవధియనియు, నా సంవత్సరము క్రీ.శ. 1167 కాబట్టి పండితుని లింగైక్యమూ సంవత్సరమేయని నిశ్చయింపవచ్చును. ఈ సంవత్సరమున శివరాత్రి-19-2-1167 తేదిని వచ్చినది గావున-నా సంవత్సరమే యిరువురి లింగైక్యమని నిర్ణయము.

పండితు డప్పటికే చాలా వృద్ధుడు కాబట్టి యాత డప్పటికి, డెబ్బదేండ్లకు పైబడిన వయస్సుగలవాడగును. అప్పుడాతని జనన కాలము క్రీ.శ. 1090 ప్రాంతమగును.

ఈ సందర్భమున ఇదివఱకు విమర్శకుల దృష్టికి గోచరముగాని మఱి యొక విషయము తెలుపుచున్నాను.

పండితుడు లోకములో నవతరించునప్పుడ ౹ శివు డిట్లాతనికి చెప్పెను.

"బసవ కుమారుని పజ్జను నీవు
వసుధను శివభక్తి వర్ధనార్థముగ
నరుగుము"

పండితారాధ్యు డట్లే యవతరించి, శివుని యాజ్ఞాప్రకారము, శివభక్తి పెంపొందించి-తాను బసవేశ్వరునివలె, లింగగర్భములో జొచ్చెను.

"వల్లభ నీయాజ్ఞ వచ్చిన పనులు
సెల్లఁబెట్టితి భక్తి చేవ దలిర్ప
వాసనతో బసవనయు నీ గర్భ
వాసంబుఁజొచ్చె దేవా పర్వతేంద్ర !"

అని పండితారాధ్య చరిత్రలోగలదు.

పై యుదాహృతులను బట్టి బసవనయు పండితుడును, ఒకే సంవత్సరమున జన్మించిరనియు, నొకే సంవత్సరమున లింగైక్యము జెందిరనియు నిర్వివాదముగా నిశ్చితమగుచున్నది.

పండితారాధ్యుని అష్టమ శతాబ్ది జయంత్యుత్సవములు జరుగుగాత.

# పండితుని జీవిత చరిత్ర
# కవి చరిత్రము

పండితారాధ్యులవారి చరిత్ర తెలిసికొనుటకు పాల్కురికి సోమన వ్రాసిన చరిత్రమే ప్రధానము, ప్రామాణికము నగుచున్నది ఇందప్ప నిశ్చయాత్మకమైన వేఱుసాధన మేదియు గనపడుటలేదు. అందయినను పండితుని చరిత్ర యత్యల్పముగను, వర్ణనములు స్తుతి స్తోత్రములు మహిమలు నితరభక్తుల చరిత్రలు మొదలయినవియే యెక్కుడుగను గానవచ్చుచున్నవి. ఇట్టివాని నన్నిటిని వదలి యీ కవికి సంబంధించిన చరిత్ర భాగమును మాత్రము సంగ్రహింప బ్రియత్నింతము.

గోదావరి మండల మందలి దాక్షారామమున భీమేశ్వర లింగమునకుఁ బురోహితుఁడు(పూజారి)అయిన భీమనపండితు డీతనితండ్రి; గౌరాంబ యీతని తల్లి; వీరిది ఋగ్వేదము, గౌతమ గోత్రము *

(ఎడమ ప్రక్క పుటలో)

---

* పండితారాధ్య చరిత్ర మొకటి తెనుఁగునందు, నొకటి సంస్కృతము నందు, నొకటి కన్నడమునందును గలవు. వీనిలో దెలుగుది మొదటిది. పాలకురికి సోమనాథునిచే 13 వ శతాబ్ద ప్రారంభమునందు వ్రాయబడినది. మిగిలినవి రెండును తెలుగు చరిత్రము ననుసరించి వ్రాయంబడినవి. సంస్కృతచరిత్ర గురురాజనువానిచేతను, కన్నడ చరిత్ర నీలకంఠుడను వానిచేతను 15 వ శతాబ్దమునందు రచింపబడినవి. (కర్ణాటకవిచరిత్ర 1 భా. పు. 161) కావున గాలమందును బ్రమాణము నందును పాల్కురికి సోమనాథుని తెలుగు చరిత్రయే యెక్కుడు గ్రాహ్య మనుటకు సందేహములేదు. 15 వ శతాబ్దము ప్రారంభమందున్న శ్రీనాథుడు సోమనాథుని ద్విపద కావ్యము ననుసరించి పద్యకావ్యము చేసెను. కాని యది యిపుడు కానరాదు. ఇటీవల శివపురపు రాజలింగసూరి యనునతడు, ఇందలి దీక్షా ప్రకరణమును, 'చారిత్ర దీక్షా ప్రకరణమ్' అని పేరు పెట్టి సంస్కృతములో వ్రాసెను. అది యచ్చుపడినది. గురురాజకృతమయిన సంస్కృత పండితారాధ్య చరిత్రమును కన్నడార్థముతో శ్రీయుత కటీ బసవప్ప శాస్త్రిగారు మైసురిలో బ్రకటించిరి.

శ్రీశైల మల్లికార్జునదేవు నుపాసించిన తరువాతఁ బుట్టెనందున నతనికి మల్లికార్జునుఁ డన్న పేరుపెట్టిరి. దాక్షారామము నొద్దనున్న కోటిపల్లివాఁడయిన ఆరాధ్యదేవుఁ డీతని గురువు. ఈ యారాధ్యదేవరకు ఉపాంతరయ్య గురువుగా నుండెను. ఆరాధ్యదేవర యొద్దనుండి మల్లికార్జునుడు శైవదీక్షను పొంది శైవమత రహస్యములను జక్కగా దెలిసికొని యాచరించుచుండగా నచటి బ్రాహ్మణులు వచ్చి యీతని శైవాచారముల నాక్షేపించిరి. ఈతడు వారికి విభూతి మహిమ, రుద్రాక్ష మహిమ, గురుపాదోదక మహిమ, లింగార్చన మహిమ ప్రసాద స్వీకారమహిమ బోధించి, పంపివేసెను. వీరమాహేశ్వరాచార మార్గమును దెల్పుచు "శివతత్త్వసారము" ను సత్కృతిని రచించి యందుఁ జెప్పిన ప్రకారము తాను నడచుకొనుచుండెను. ఎక్కుడు భక్తితో నద్భుతముగ శివపూజ జేయుచుండెను.

పోరండ్ల సూరసానమ్మ యను భక్తురాలును, కెలిదేవి వేమనారాధ్యుడును + మరికొందరు జంగములును బండితుని జూడవచ్చిరి. అప్పు డాతడు శివపూజ చేసికొనుచున్నను జంగములు లింగరూపులే యనిన భావముగలవాడు గనుక శివపూజ నాపి వారిని గౌరవించి జంగమపూజకూడ లింగపూజయే యని తెల్పెను. సూరసానమ్మ పండితునకు బసవేశ్వరుని చరిత్రయు నాతని మహిమయు నతనియొద్ద నుండిన కొందరు భక్తుల మహిమయు దెల్పెను.

చనదవోలు (చందవోలు) అను గ్రామమునందు వెలనాటిచోడ డను రాజు రాజ్యము చేయుచుండెను. చందవోలిపుడు గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలో నున్నది. పూర్వము వెలనాటి రాజుల రాజధాని. ధనదపురమని దానికి నామాంతరము. పండితారాధ్యుఁ డా గ్రామమునకు బోయి తన మతమును బోధింపసాగెను. అచ్చటి రాజు గురువు బౌద్ధుడు అతనిపేరు బౌద్ధపద పదాచార్యుడు. ఈతడు బ్రహ్మవంశజుడట * తాను రాజునకు గురువుగానుండగా నన్యమతస్థు డా రాజధానిలో మతబోధ జేయుట చూచి సహింపనోపక యా బౌద్ధుడు రాజుతోఁ జెప్పి యొకగొప్పసభ జేయించి మల్లికార్జున పండితారాధ్యుని నా సభకు రప్పించెను. ఆ సభకు నద్వైతులు జైనులు సాంఖ్యులు చార్వాకాది నానామతములవారు వచ్చియుండిరి. పండితుఁడు బౌద్ధమతము నితరమతములను

---

+ ఈతడే పాల్కురికి సోమనాదుని గురువునకు బితామహుడు.

* బ్రహ్మవంశజు బౌద్ధపదాచార్యు । బ్రహ్మఘ్నుఁ జంపింప బాడియే యనచు.

(మహిమా. పుట 246)

దనపాండిత్యమహిమచే ఖండించి తనమతమును స్థాపించెను. ఇంతియకాక శివుడు శ్రేష్ఠుడనుటకుఁ దన తలయిచ్చెద ననియు, మంటలో దుమికెదననియు జెప్పి, శివునికంటె నెక్కుడు దైవముకలఁడని యెవరైన జెప్పినయెడల వారితల తన కాలితోఁ దన్నెదనని ప్రతిజ్ఞ జేసి తన సిద్ధాంతమును నిలుపుకొనుటకై 'రుద్ర మహిమ' యను కృతిని రచించెను. అంత బౌద్ధుడేమియు ప్రత్యుత్తర మీయ జాలక పండితుని నిందించెను. అందరును వెడలిపోయిరి.

కాని బౌద్ధుడు పండితుని నిందించినందున నాతని శిష్యులకు మిక్కిలి కోపమువచ్చెను. 'అట్టి నిందకుని జంపనియెడల నతడుఁ ద్రోహి కాఁడు. తామే ద్రోహులమగుదు'మని వారు తలచిరి. పండితుని శిష్యులలో రేమయ్య దేవయ్య లను వారిపనికిఁ బూనుకొనిరి. సముద్రములోని + యొక లంకలో నొక బౌద్ధ ఆలయ ముండెను. అచ్చటి కా బౌద్ధుడు ప్రతిదిన మొక్కడు వెళ్ళివచ్చు చుండెను. ఆ సంగతి తెలిసినవారు గావున నొకనాఁ డుదయముననే రేమయ్య దేవయ్య లా లంకకు నెవరికిఁ దెలియకుండ బోయి దేవుని మరుగున దాఁగి యుండి బౌద్ధుడు వచ్చి బుద్ధవిగ్రహమునకుఁ జాగిలి మ్రొక్కునప్పుడు వానిని జంపి వికృతరూపునిఁ జేసి వెడలిపోయిరి. ఈ సంగతి తెలిసి రాజు మిక్కిలి కోపించి పండితయ్యను బిలిపించి యడుగగా నతఁడు 'నేనే చేయింతిని; నేనే చంపించితి' నని దోషమంతయు దనమీద మోపుకొనియెను. అంత రాజు పండితుని కనులు తీయింపగా నతఁడు రాజునకు శాపముపెట్టి యచ్చటినుండి శిష్యయుక్తముగా నమరావతికి వెడలిపోయెను.

చందవోలులో నున్నపుడే యీతడు "లింగోద్భవ దేవ గద్య" యచ్చటి దేవునిపై జెప్పెను. లింగోద్భవుని దేవాలయ మిప్పటికిని జందవోలులోనున్నది.

'చందవోలు కైఫీయతు' + అను పుస్తకమునందు నీ కథయే యిట్లున్నది. పండితారాధ్యుడు శ్రీశైలమునకు బోవుచు చందవోలుకి వెళ్ళి పాండేశ్వరస్వామి గుడిలో దిగెను. కొండ పడమటి బుద్ధరాజునకు గురువైన బౌద్ధుడు బుద్ధాం అను గ్రామమం దుండెను. వాఁడు పండితుని మహిమనుజూచి యోర్వ లేకపోయెను. పండితుని ప్రతిదిన శివపూజలోఁగావలసిన యొక పూజాపాత్రను బౌద్ధుని శిష్యుడైన బెజుఁడను వాఁడెత్తుకొని పోయెను. పండితుని శిష్యులు వానిని బట్టుకొని చంపిరి. ఈ సమాచారము వారు తమ గురువునకు దెల్ప లేదు. అంత బుద్ధరాజు పండితునివద్దకు మనుష్యులను బంపి నరహంతకున కేమి శిక్ష శాస్త్రీయమని యడుగగా కనులు తీయుటయే తగిన శిక్షయని పండితుడు

---

+ సముద్రము చందవోలునకుఁ దొమ్మిదిమైళ్ళుమీఁదనున్నది.

+ స్థానికచరిత్రలు (Local Records) సంపుటము 39, పుట 433. ఇది క్రి.శ 1811 లో వ్రాయబడినది.

చెప్పెనట. దానిపై బుద్ధరాజు పండితుని కనులు తీయించెను. పండితుఁ డాతనికి శాపమిచ్చి యిఁకమీద శైవు లెవరును చందవోలులో దీర్ఘము పుచ్చుకొనగూడ దని నియమించి వెడలిపోయెను.

అమరావతి చేరగనే పండితుడు చోడునితో భాషించిన పాపంబు పోవుటకును శివనింద విన్నపాపము పోవుటకును శివభక్తుల సహస్రనామ గణమాలిక పఠించెను. అమరేశ్వరాష్టకముఁ జెప్పెను.

పండితారాధ్యుఁ డమరావతిలో నుండగా బసవేశ్వరుఁ డతనికి భస్మము పంపెను. అచ్చటనే యాతఁడు కర్ణాటకవిత్వము చెప్ప మొదలిడెను. తరువాత పండితుడు బసవేశ్వరుని చూడవలయునని కల్యాణపురమునకు బయలుదేరెను.

త్రోవలో సారంగేశ్వరుడు దేవుడుగాగల నిడుగుడుము అనుచోట తన ముఖ్యశిష్యుఁడగు దోనయ్యగారికి నన్నయయిన వీరబాకి రాజయ్యగారిచే గౌరవింపబడి పానుగంటికి బోయెను. అచ్చట సదయుఁడను రాజునొద్దనున్న పిఁగలి గోవింద ప్రధాని పండితుని భక్తుడు కావున నాతనిని మిక్కిలి మర్యాదతో నెదుర్కొని తన యింటికి దోడ్కొని పోయెను. అచట భవకేశునామయ్య అను భక్తుడు కలఁడు. ఇతడు రాజునొద్ద స్వంత సేవకుఁడు (ఖాసా) పండితుడా గ్రామమునకు వచ్చినప్పటి నుండియు నాతని భజనలోనబడి రాజుసేవ సరిగ జేయకుండెను. అంత రాజునకు గోపమువచ్చి యాతనిని పిలిపించి కోపపడఁగా, దేహము మాత్రము మీదిగాని ఆత్మ మీదికాదు; మీ దేహమును మీరు తీసికొండని గుడి శిఖరము మీఁదికెక్కి యురిపెట్టుకొని చచ్చెను. అంత పండితుడా రాజునకు శాపముపెట్టి వెడలిపోయెను.

వనిపురములో శంకరయ్య అను భక్తుని సపర్యలఁగొని, కల్యాణమునకు బయలుదేరగా నంతకుఁ బూర్వ మెనిమిది దినముల క్రింద బసవేశ్వరుడు లింగైక్యముఁ జెందెనన్న సమాచారము త్రోవలో దెలిసి పండితుని కమితఖేదముకలిగి యతఁడు బసవని బొగడుచుఁ బ్రలాపించెను.

అంతఁ బండితుఁడు శ్రీశైలపర్వతము పైపునకుఁ బోయెను. వెల్లటూరు దగ్గరకువచ్చి తానచటనే యుండి తన ప్రియశిష్యుడైన దోనయ్యను గిరి ప్రదక్షిణముచేసి శివరాత్రిపూజకు శ్రీశైలము పైకిబోయి తన వ్రతమును బూర్తి చేయుమని చెప్పి యతనికి 'పర్వత వర్ణనము'ను నుడివెను. అతఁడు గిరి ప్రదక్షిణము చేసి వచ్చిన తరువాతఁ బండితుఁడు తానువచ్చిన పనియైనదనియు, బసవేశ్వరుడును పోయెను గనుక దానుండ నక్కఱలేదనియు నీశ్వరుని బ్రార్థన సేసి భార్యాపుత్రులతో వెల్లటూరిలోనే లింగైక్యము జెందెను.

# పండితారాధ్య సంతతి

పండితారాధ్యుడు లింగైక్యము జెందునాటికి దారపుత్రులతో నున్నట్లుగా సోమనాథు డిట్లు చెప్పియున్నాడు—

అంతలోనన పండితారాధ్యు నాత్మ
సంతతియును గులసతి సమేతముగ
లింగోదరంబున లీనమైరట్లు
సంగతంబగు శివాజ్ఞాపత్ర సరణి
శివగణ ప్రార్థనఁ జిక్కిన సకల
భువన పావనుని యపూర్వతనూజు
దళిత సంసారు కేదారయ్యఁ బుణ్య
భరితు లోకారాధ్య పట్టంబుగట్టి...

పండితుని కుమారుడు కేదారయ్య పండితారాధ్య సంప్రదాయమునకు గురుపట్టము వహించెను— ఆతని, యాత్మసంతానము, శైవ సంతానము పాల్కురికి సోమనాథు డిట్లు తెల్పెను.




వీరిలో విశ్వనాథప్పయ్యయే పాల్కురికి సోమనాథుని కవితా గురువు. వీరి వెనుక పండితారాధ్య సంతతి వర్ధిల్లినది—

క్రీ. శ. 1199 నుండి 1260 వఱకు పాలించిన కాకతి గణపతిదేవ చక్రవర్తి పండితారాధ్యులకు పదునొకొండు గ్రామముల నొసగెనని సిద్ధేశ్వరచరిత్ర చెప్పు[1]

---

1. సిద్ధేశ్వర చరిత్ర పుట.

చున్నది. కాని తెలింగాణా శాసనములో[1] గణపతిదేవ చక్రవర్తి శాసనమున, "పండితారాధ్యుల కొడుకులకు" అని స్పష్టముగా నున్నది' ఇచట పండితారాధ్యులనగా, మల్లికార్జున పండితారాధ్యులు కాక కేదార పండితారాధ్యులని తెలియవలెను- అసలు పండితారాధ్యులు క్రీ శ. 1167 లోనే లింగైక్యము నొందెనుగదా !

క్రీ. శ. 1288 శాసనములో, 'నిలువుగన్నులు దాల్చిన పండితారాధ్యుల మనుమలు శ్రీగిరయ్యంగారికి" అని కలదు- ఈ శ్రీగిరి అయ్యంగారు పై కేదార పండితుని నలువురి పుత్రులలో ఒకరి పుత్రులగుదురు. ఈ గిరయ్యంగారే ప్రసిద్ధ కవియైన శ్రీగిరి[1]- ఈతనికి ప్రోలయ వేమా రెడ్డి క్రీ. శ. 1315 లో మోగల్లు గ్రామము సమర్పించెను[3].

క్రీ. శ. 1500 ప్రాంతమున నున్న గురుదేవారాధ్య కవి తన సంస్కృత "వీరశైవాచార సంగ్రహమున"- తాను పండితారాధ్య వంశీయుడని పండితుని దగ్గఱనుండి వంశవృక్షము నిచ్చియున్నాడు[3]-

క్రీ. శ. 1575 లో పట్టమెట్ట సోమనాథ సోమయాజి తన గురువగు లింగనారాధ్యుడు పండితారాధ్య వంశీయుడగు గౌరనారాధ్యుని కుమారుడని వ్రాసియున్నాడు[4].

క్రీ. శ. 1650 ప్రాంతమున వీరనారాధ్యుడను శైవకవి తన గంగాగౌరి విలాసమున తాను పండితారాధ్య వంశ్యుడనని చెప్పుకొన్నాడు[5].

పండితారాధ్యులవారి సంతతివారే ప్రస్తుతము పండితారాధ్యులవారను ఇంటిపేరువారైనారు- నేటికిని వారు ప్రసిద్ధితో నున్నారు.

పై వివరణములో నిలువుగన్నులుదాల్చిన మల్లికార్జున పండితారాధ్యులు" అని యున్నదానికి చారిత్రాత్మకమైన కథగలదు- దాని నిట యిచ్చుచున్నాను. దీనికి "ఊర్ధ్వనేత్ర కథనము" అని పేరు,

---

1. తెలంగాణా శాసనములు.
2. ఈ తదాంధ్రవాఙ్మయ చరిత్రి కెక్కియే యున్నాడు- చూ. ఆంధ్రకవి తరంగిణి.
3. ఇది పశ్చిమ గోదావరి జిల్లా భీమవరము తాలూకాలో గలదు.
4. పూర్వముద్రిత పీఠిక.
5. అముద్రితము.

# ఊర్ధ్వనేత్ర కథనము

పండితారాధ్యుడు— వెలనాటి చోడరాజు సభలో బౌద్ధులను జయించి నప్పుడు పండితుని వాదమునకు నిలువలేక బౌద్ధులతని తూలనాడిరి. అదివిన్న పండితుని శిష్యులు సహింపలేక, పండితునితో వాదము చేసిన బౌద్ధపదాచార్యుని చంపివేసిరి. రాజుగారి కిది తెలిసి, బ్రహ్మహత్య చేసినవానికి శిక్షయేమని యడిగెను. అచ్చటివారు కన్నులు తీయుటయే శిక్షయని చెప్పిరి. దానితో, రాజు పండితుని కన్నులు తీయింప నాజ్ఞాపించెను. కాని యంతకుముందే, పండితుడు శివుని మహాత్మ్యము, శివభక్తుల మహిమ ప్రదర్శించుటకై, తానే లింగోద్భవ దేవుని యాలయ గోపురముపైకెక్కి, ప్రజలందఱు చూచుచుండగా, తన రెండు కండ్లను గోరుగుండుతో పెకల్చి, శివునికి నివేదించెను: వెంటనే, పూర్వమువలె రెండుకన్నులు వచ్చెను. తక్షణమే పండితుడు వానిని మునుపటివలె పెకల్చెను. వెంటనే శివుడు పండితునకు పెకల్చిన నాలుగు కన్నులు నిచ్చెను. అవి రెండు ముఖప్రదేశమున నుండగా, నిలువు కన్నులు—అనగా ఊర్ధ్వనేత్రములు రెండు తలపై యుదయించెను.

పండితుని యీ యద్భుత కృత్యమును సోమనాథుడు వృషాధిప శతకమున నిట్లు ప్రస్తుతించి యున్నాడు.

"పండితవాదియై శివుడ దైవముగాకని కన్నులిచ్చి తా
నిండుమనంబుతో నిలువు నిద్దపు కన్నులుదాల్చి పొల్చు మా
పండిత మల్లికార్జునుని ప్రస్తుతి సేయంగనేర్చు నిన్ను నె
వ్వండు నుతింపనేర్చు బసవా! బసవా! బసవా! వృషాధిపా.

పండితుడు, బసవనవలె, తన మత సంప్రదాయ ప్రతిష్ఠాపనకై యీ యమేయ శివభక్తి ప్రదర్శనము భావించెను. ఇది శాసనస్థమై యుండుటయే గాక, మనదేశ చరిత్ర కాధారములైన ప్రామాణి కాధారములయందు నున్నది*.

---

* మెకంజీ దొరవారి చారిత్రక లిఖితసంచయములు — చందవోలు కైఫీయతు ఈ కథాభాగము గల ఘట్టమాగ్రంథమున ననుబంధములో నున్నది.

బుద్ధిరాజు పేరయామాత్యుడను కవి తన సాత్త్విక బ్రహ్మవిద్యా విలాస సిరసనము అను గ్రంథమున నీవిషయము ప్రస్తావించి యున్నాడు.

పండితారాధ్య చరిత్రమున మహిమ ప్రకరణమున నీవృత్తాంతము గలదు.*

శివతత్త్వసార కృతికర్త
మల్లికార్జున పండితుడే
నన్నెచోడని కుమార
సంభవ కృతిభర్త
మల్లికార్జున శివయోగి.

నన్నెచోడని కుమారసంభవ కృతిభర్త మల్లికార్జున శివయోగి, కేవలము బ్రహ్మచర్యాశ్రమ వ్రత నిష్ఠతో మునీశ్వరుడై యున్నట్లుగా నీక్రింది విశేషణములు తెలుపుచున్నవి.

మునిజనముఖ మణిముకురుండు (1-58) సంగాసంగ విదూరుడు (1-61) బ్రహ్మర్షి (1-66) సంయమి (1-66) మార మద ప్రహారుడు, మునిపుంగవుడు (1-130) దర్పక దర్పహరుండు మునీంద్ర శిఖామణి (3-112) శమిత విషయుడు (3-178) అవికారుడు (6-172) హృజ్జన్మాస్త్రనిగ్రహజ్ఞుడు (8-198) జిత మారుడు (11-218).

శివతత్త్వసార కృతికర్త మల్లికార్జున పండితుడని తాను వ్యవహరించుకొన్నట్లు వలనకే తేటపడియున్నది. పేరు లిరువురివి యొకటియే యైనను. శివతత్త్వసార కృతికర్తకు పండితశబ్ద మొకటి విశేషము. నన్నెచోడకవి, ఎచ్చటను 'పండిత' శబ్దము కృతిపతికి వాడలేదు. కావున వీరిద్దఱు భిన్నులని విమర్శకులందఱు నూహించిరి. భిన్నత్వమున కిది మొదటి కారణము.

రెండవది- మీద విమర్శించినట్లుగా, నన్నెచోడని కృతిపతి - బ్రహ్మచారి - పండితుడు, గృహస్థాశ్రమము స్వీకరించి, పుత్ర పౌత్రులతో నున్నట్లు పండితారాధ్య చరిత్రమున వర్ణితమైనదికావున నిరువురు భిన్నులు.

నన్నెచోడని కుమారసంభవము, పండితారాధ్య చరిత్రమునను నీ రెండు గ్రంథములను సావధానముగా, నిశిత దృష్టితో పరిశీలించిన వారికి- పై రెండు కారణముల మూలమున, భిన్నత్వము లేకపోవుటయేగాక, వారిరువురు

** పుటలు.

నొకవ్యక్తియే యని స్పష్టపడును. నన్నెచోడడు పై విశేషములనే కాక నింకను పెక్కు విశేషణములు కృతిపతికి వాడియున్నాడు. వానినిగూడ మనము గ్రహించి పండితారాధ్య చరిత్రయందలి విశేషములతో సంప్రతించిన నీయైక్యత స్థిరపడగలదు. వాని నీక్రింద చూపుచున్నాను.

| కుమారసంభవ కృతిపతి | శివతత్త్వసార కృతికర్త |
| --- | --- |
| మల్లికార్జున శివయోగి | మల్లికార్జున పండితుడు |
| భూసురకుల తిలకుడు | బ్రాహ్మణోత్తముడు |
| శివధర్మార్థ ప్రవీణుఁడు | శైవధర్మోత్తమాచార్యుఁడు |
| శివతత్త్వవిదుడు<br>శివతత్త్వజ్ఞాన సన్మానసుడు<br>శివతత్త్వామలమతి ప్రకాశుడు | శివతత్త్వసార కృతికర్త |
| న్యాయ వైశేషికాది షట్తర్కకర్కశుండగుటం | న్యాయ వైశేషికోదాత్తశాస్త్రము పాయదర్శన పరిపాలన క్షముడు |
| బరవాది భయంకరుండు |  |
| త్రిమల విదూరుడు | స్వకృత్యావలోకనోత్సారిత శిష్యనికర మలత్రయ నిరసితేంద్రియుడు |
| పరవాదీంద్ర ఘనాఘనానిలుడు | పరవాది మేఘ దుస్తర మారుతుడు |
| శమదమ నియతాత్ముడు | శమదమోత్కృష్ట నిష్ఠాగరిష్ఠుడు |
| కవి నీరేరుహ రవి | శివకవి మల్లయ |
| ఇహాలలాటేక్షణుడు<br>మనుజాకారమహేశుఁడు | సనసరుద్రో నాత్రసంశయో యసంగ జనియించినట్టి సాక్షాద్రుద్రమూర్తి |
| మాహేశ్వరప్రకర మాన్యుడు | వీరమాహేశ్వరాచార మార్గానుసారి |

ఇక నిట్టి విశేషములేగాక వీరిరువురు నొకరేయని నిరూపించు బలవత్తర మగు నింకొక ప్రమాణమును జూపెదను.

పండితారాధ్య చరిత్ర దీక్షా ప్రకరణమున నారాధ్యదేవుని లింగార్చనా సమయమున, భూతి స్నానమునుగూర్చి చెప్పబడినవు డిట్లున్నది.

రుద్రావతారుండు ప్రత్యక్ష
రుద్రుండు మల్లికార్జున శివయోగి
యంగి భూతిస్నాన మంగీకరించె*

* దీక్షాప్రకరణము పుట 165.

ఇచట మల్లికార్జున పండితుడే భూతిస్నానము చేసిన పట్టున మల్లికార్జున శివయోగి యనియు న్నది. కావున వీరిరువురు నొకేవ్యక్తి.

## జంగమ విశేషణము

కుమారసంభవమున, మల్లికార్జున యోగికి జంగమ శబ్దము పలుమారలు ప్రయుక్తమైనది.

జంగమ మల్లికార్జునుడు (1-12) జంగమ లింగంబగు మల్లికార్జునుడు (1-15) జంగమ మల్లికార్జునుడు (1-18) (1-130) జంగమ మల్లయ (1-19) (1-26) జంగమ మల్లికార్జునదేవు (1-56) (1-58) జంగమ మల్లికార్జునుడు (3-111).

ఈ జంగమశబ్ద మిప్పటివలె జాతివాచకము కాదు. ప్రాచీన కాలమున నీ 'జంగమ' శబ్దము శివభక్తులైన బ్రాహ్మణులకు జెల్లుచుండెడిదీ. కావుననే బ్రాహ్మణుడైన మల్లికార్జున శివయోగికి జంగమ శబ్దము ప్రయుక్తమైనది.

దీనినిబట్టి, శివభక్తులైన బ్రాహ్మణులు - అనగా లింగమును ధరించిన బ్రాహ్మణులందఱును జంగమ శబ్దవాచ్యులైరి. వారికే ఆరాధ్యులని సంప్రదాయికమైన పేరు నియతమై యున్నదిగా నన్నెచోడుని కాలమున నారాధ్యులకు జంగములని వ్యవహారము వచ్చినది.

మల్లికార్జున పండితుడు, బ్రాహ్మణుడైన శివభక్తుడు, ఆరాధ్యుడు కాబట్టి తాను జంగమ లింగము లొకేప్వరూపమని శివతత్త్వసారమున నిర్ణయించియున్నాడు. ఈ సంవాదము వలన మల్లికార్జును లిద్దఱును భిన్నవ్యక్తులుగాక, ఒకరేయని సిద్ధారితమగుచున్నది.

## పండిత శబ్దము

మల్లికార్జునకు పేరు శ్రీశైల మల్లేశ్వరుని పేరే.

కాని యాతడు, ఆరాధ్యమత సంప్రదాయికమైన వీరమాహేశ్వరాచార పద్ధతిని ప్రతిష్ఠించిన తరువాత 'పండిత' అను విశేషాఖ్యచేత వ్యవహృతుడైనాడు. ఇట్లు వ్యవహృతుడగుటకు కారణమిది—

ఈ ఆరాధ్య సంప్రదాయమునకు ఆంధ్రదేశమునకు సంబంధించిన వారు ముగ్గురు వారు ముగ్గురును పండిత నామధేయులే.

1. శ్రీపతిపండితుడు.
2. శివలెంక మంచన పండితుడు.
3. మల్లికార్జున పండితుడు

పై వారిలో శ్రీపతిపండిత, శివలెంక మంచన పండితు లిరువురు— మల్లికార్జున పండితునికన్న పూర్వులు. వారి 'పండిత' * నామధేయులే కాబట్టి వారి తరువాతవాడైన మల్లికార్జున పండిత నామధారి యయ్యెను. వీరినే "పండిత త్రయము" అని వ్యవహరింతురు. వీరిలో మొదటి యిరువురును గూర్చి ప్రత్యేకముగా దెలిపెదను

ఇది మొదట స్పష్టముగా కుమార సంభవకృతిపతి మల్లికార్జున శివయోగికి నెచ్చుటను ప్రయుక్తముకాలేదు. కాబట్టి పూర్వోక్త సంవాదముల చేత, యాతనికి నామము తరువాతి దశలో, ననగా, గృహస్థాశ్రమదశలో వచ్చినదని నిర్ణయింపనగును.

## గృహస్థాశ్రమ స్వీకారము

నన్నెచోడకవి మల్లికార్జున శివయోగిని గృహస్థునిగా చెప్పలేదని, బ్రహ్మచారి యని యీవఱకే చెప్పియుంటిని. కాని యాతడే బ్రహ్మచార్యాశ్రమమువీడి ఆరాధ్య సంప్రదాయ ప్రతిష్ఠాపనకొఱకు, గృహస్థాశ్రమము స్వీకరించినట్లు పండితారాధ్య చరిత్రమువలననే నిర్ణీతమగుచున్నది.

ఆచరిత్రయందు మల్లికార్జున పండితుని బ్రహ్మచర్యాశ్రమము సంగతిగాని, బాల్యాదికమునుగూర్చిగాని లేదు. అది ఆరాధ్య సంప్రదాయమునకు ముఖ్యమైన దీక్షా విధానముతో ప్రారంభమగుచున్నది, పండితుని లింగార్చనా సమయమున— అచటి బ్రాహ్మణులు పండితుని లింగ, విభూతి, రుద్రాక్ష ధారణలనుగూర్చి ప్రశ్నింపగా, నతడు శ్రుతి స్మృతి, ఆగమ, పురాణేతిహాసములమండి ప్రమాణ

---

[1] ఈ కారణముచేతనే నన్నెచోడని కృతియందు 'పండిత' శబ్దము కానరాదు.

ములను చూపుచు వీరమాహేశ్వరాచార ప్రశస్తిని నగ్గడించెను. ఆ వెనుక, వెలనాటి చోడుని సభలో, జైన, బౌద్ధ, చార్వాకాది మతములనే గాక, సాంఖ్యాద్వైత్వాది మతములను ఖండించి, శివుడు కేవలము లయకారుడేయన్న వాదమును నిర్మూలించి, శివుడే-సృష్టి స్థితి లయకారకులైన మువ్వురికి మూల పురుషుడని శివపారమ్యమును ప్రతిష్ఠించి మాహేశ్వర సాంప్రదాయ ప్రవక్తు డయ్యెను.

ఈ కాలమునకు కొంచెము ముందుగానే పండితుడు, తన సమకాలీనుడైన బసవన శివభక్తి మహాత్మ్యము నెఱింగి యాతని చూచుటకు బయలుదేరగానే, మార్గమధ్యమున బసవలింగైక్యము చెందెనని, తాను శ్రీశైలమున లింగై క్యము చెందగోరినను, వృద్ధాప్యమువలన నచటికి వెళ్ళలేక, తన శిష్యుడైన దోనయ్యను శివరాత్రి వ్రతమును చెల్లించిరమ్మని పంపి, యాతడు వచ్చినవెనుక వెల్లటూరిలో లింగైక్యము చెందెను-అతని వెనుక నాతని పుత్రుడు కేదారయ్య అరాధ్య సంప్రదాయ గురుపీఠము నధిష్ఠించెను.

పండితారాధ్య చరిత్రలో పండితునకు సంబంధించిన కథ యింత మాత్రమే- ఇది యింతకుముందే వివరింపబడినను, వాదసమర్థనకొఱకు తిరిగి యిచట నుదాహరింపవలసి వచ్చినది.

పై కథను బట్టి- తన సంప్రదాయమును ప్రవర్తింపజేయుటకై మల్లి కార్జున శివయోగి, బ్రహ్మచర్యాశ్రమమునువీడి, గృహస్థాశ్రమమును స్వీకరించె నని స్పష్టపడుచున్నది. పలననగా, ఒక మత సంప్రదాయము ప్రవర్తింపజేయ వలెనన్న నది బ్రహ్మచారికెట్లు సాధ్యమగును. ఆత డవివాహితుడైన మత వ్యాపనమెట్లు కాగలదు?- వంశపారంపర్యముగా నొక గురుపీఠముద్నగాని, దాని వ్యాప్తియుండదు- ఈ కారణములచేత మల్లికార్జున శివయోగి గృహస్థుడై మల్లికార్జున పండితుండని- గురుపదమున నుండుటకే పండితయ్య అని వ్యవహృతుడయ్యెను-

కాని యిచ్చట నొక సందేహము కలుగవచ్చును- అసలు పండితారాధ్య చరిత్రమున, పండితుని బాల్యదశవృత్తాంతము లేదే. మఱి యీ వైయ్యతకు సమన్వయమెట్లు అను ప్రశ్నయుదయించును

ఈ ప్రశ్నకు సమాధానము సోమనాథుడే ఇచ్చియున్నాడు- పండితుని జనన బాల్యజీవితము కొన్ని పంక్తులలో నిచ్చియున్నాడు- వానినీక్రింద నుదాహరించుచున్నాను-

శివుడొక మూర్తిని సృజియించి
"బసవకుమారుని పజ్జను నీవు
వసుధకు శివభక్తి వర్ధనార్థముగ
నరుగుము......

అసమానలీల దాక్షారామమొప్పు
అప్పురంబున...... నొప్పు భీమేశ్వరోరులింగంబు
రూఢిఁదద్దేవు పురోహిత శ్రేష్ఠుఁడు
......భీమన పండితేంద్రుడు

మహినొప్పు శ్రీగిరి మల్లికార్జునిని
సన్నిధి నొక పురశ్చరణ గావింపు
చున్న వాడతనికి నదయిఁ పుమనుడు
ననురక్తి సాష్టాంగుడై యేగుదెంచి
బనియించె భీమాఖ్య సాధ్వి గౌరాంబ
మల్లికార్జునకీర్తి మహిత శ్రీశైల
మల్లికార్జునదేవు మహనీయ నామ
మగుట పండిత మల్లికార్జునుండనఁగ
నగణితప్రీతి దాక్షారామమునకు
జని యంత మఱియును సద్గురు మూర్తి
యనఘుఁడు గోటిప శ్యారాధ్య దేవ
దేవుని సత్కృపాదృగ్వి లోచన సు
ధావార్థి మధ్యగత క్రీడవలన-

శివదీక్షవడసి-

తత్పూజానుభవ భజనంబు
లొడబడ వీరవ్రతోద్యుక్తినడువ-"[1]

నక్కడికి బ్రాహ్మణులువచ్చి, పండితుని వర్తనము గూర్చి ప్రశ్నించిరి.

పై పంక్తులలో బాల్యానిక విషయమేమియు లేదు- కాని పుట్టగానే- దాక్షారామమునకు 'చని'*- అని యున్నది. పండితుడు పుట్టినది శ్రీశైలమని

[1] దీక్షా ప్రకరణము, 27–31 పుటలు

మీది పంక్తులలోనే- జనియించె- అని క్రియవలన తెలియుచున్నది- ఇక పుట్టగానే- యాతడు శ్రీశైలము ను - వీడివచ్చెనన్న యెడల- వెంటనే యాతడు- ఆరాధ్య దేవునివలన దీక్ష పొందుట యసంభవము- దీక్ష పొందునాటికేవ్వరైన యేవనులై యుండవలెనుగదా- ఇక- ఎంతో కాలము గురుముఖమున నభ్యసించినగాని యలవడని, సమస్త వేదాగమ పురాణేతిహాస పాండిత్యమును పండితుడు, పుట్టగానే శ్రీశైలమును వీడిన యెట్లు సంపాదించెను ? ఇంతకు, ఆతడు, శ్రీశైలమున కొంత కాలమున్నట్లుగా నచ్చటినుండి దాక్షారామమునకు వచ్చుట యను వాక్యమందే యున్నదని నిశ్చయింపవచ్చును.

శ్రీశైల మల్లికార్జున నామము దాల్చి; అచ్చటనే అనగా శ్రీశైలము ననే- సమస్త విద్యలోన గణించి, మహాయోగియై, ఇతర శైవ మతములనవలోకించి వీరమహేశ్వర సంప్రదాయమును సిద్ధాంతీకరించి** శిష్యగణములకు కల్పతరువై బ్రహ్మచర్యమున, పండితుడు జీవితము గడిపెను- ఆ సమయము ననే రాజకవియైన నన్నెచోడ మహాకవి యాతనికి శిష్యుడై, తన కుమార సంభవ మహాకావ్యమును నతనికి నంకితమిచ్చి, శివపారమ్యము, శివయోగము నందు విస్తరించి, మహేశ్వర సంప్రదాయమును సూచించెను- సోమనాథునకు ముందే నన్నెచోడ మహాకవి, మల్లికార్జున పండితుని బాల్య ప్రవృత్తిని బ్రహ్మచర్య నిష్ఠను పూర్తిగా వర్ణించి యున్నందువలన సోమనాథుడు దానిని పండితారాధ్య చరిత్రమున పై రీతిగ సంగ్రహించి యున్నాడు. పండితుని జీవితము ప్రథమ ద్వితీయ దశలు నన్నెచోడుడును, తృతీయ చతుర్థ దశలు సోమనాథుడును వర్ణించియున్నారు.

ఇట్లు మత సంప్రదాయిక విషయమేగాక భాషా సాహిత్య సంప్రదాయములు పరిశీలించిన నీ యైక్యత మఱియు నిశ్చితవగును- సోమనాథుని పండితారాధ్య చరిత్ర కథావస్తువునకు, శివతత్త్వ సారము, పండితుని రచనలు మూలమని యీ వఱకే తెలిపితిని- ఇక బసవపురాణ పండితారాధ్య చరిత్రలయందలి పదటాలము, సమాసములు, సంప్రదాయములు, భావానుకరణములు దీనియన్ని సూక్ష్మముగ పరిశీలించిన, నవి యన్నియు నన్నెచోడని యనుసరించినవేయని స్పష్టమగును.

---

[2] కాపాలిక, కాలాముఖ; నవనాథ సిద్ధమతములు

శివకవియగు పాల్కురికి సోమనాథుడు, శివ కవులను తప్ప భవి కవుల ననుసరింపడుగదా- గురుశిష్యుల- రచనలు- తాను వీరశైవ మతవ్యాప్తికి సృష్టించిన వాఙ్మయమున కంతకు మూలస్థంభాయమానములైనవి- ఆతని కవితా కల్పవృక్షమునకు మూలములైనవి. [1]

తెలుగున నన్నయ యొక్కడే శివకవులకు ముందుకాలమున నున్న వాడు- ఆతని భారత రచన- శివకవులనాటికే వ్యాప్తిలోనికి వచ్చినది [2] కాని శివకవులు ప్రత్యేక మత సంప్రదాయ ప్రతిష్ఠాపన వ్యాప్తికొఱకు భాషాసాహితీ, కవిత్వములను మీదుకట్టిన వారగుటచేత నన్నయను వారు స్తుతింపలేదు- నన్నెచోడడు మాత్రము తాను రచించినది కావ్యమగుటచేత- "దేశి సత్కవులు" అని సామాన్యముగ జెప్పినాడేకాని, విశేషింపలేదు[3] - సోమనాథుడే మొదట- శివకవులే హర్షింప జెప్పుదు కవిత అని శివకవి పదమును ప్రయోగించి, తెలుగు వాఙ్మయమునకీ ప్రత్యేక విశిష్టమైన సాహిత్యమునకు- మూలపురుషుడైనాడు- ఈ శివ కవిత్రయము-పండితారాధ్య- నన్నెచోడ- పాల్కురికి సోమనలు- ఆంధ్ర సాహిత్యమున తరువాత వెలసిన, తిక్కన యెఱ్ఱనలు కవిత్రయ సంప్రదాయమునకు హేతుభూతులై విలసిల్లిరి.

## పండితుని యితర కృతులు

మల్లికార్జున పండితుడు 'శివతత్త్వ సారము' గాక యితర కావ్యములును రచించినట్లు కానవచ్చుచున్నది. పండితారాధ్య చరిత్రలోని యీ క్రింది ద్విపదలవలన నీతఁడు లింగోద్భవదేవు గద్యము, రుద్రమహిమ. గణసహస్ర మాల. అమరేశ్వరాష్టకము. పర్వత వర్ణనము నను కావ్యములను రచించినట్లు మన మూహింపవచ్చును,

---

* చూడుడు- తెలుగు కవుల చరిత్ర- ఇందీ విషయము, ఉదాహరణ పూర్వకముగా నిరూపింపబడినది.

** నన్నయ- నన్నెచోడులు- భారతి- 1962 తెలుగు కవుల చరిత్ర పుట

*** ఈ కారణముచేత- తెలుగు కవి స్తుతి కుమారసంభవమున నుండ నావశ్యకత లేదు-

ఉదగ్రస్తుతి "లింగోద్భవదేవు. గద్యంబు" నా నొక్క గద్యంబు చెప్పి దేవదేవేశు నాదిమ దివ్యలింగ, దేవు లింగోద్భవదేవు నాతుణమ చోద్యతరంబుగా స్తోత్రంబు చేసి

మహిమ. ప్ర పుట 248

మానుగా "శ్రీరుద్ర మహిమ" యన్స్తుతిన్, దానందుడగు శ్రీ మహాదేవు
(మహిమ.

నామోఘముగ మల్లికార్జున పండితారాధ్యు లావ్యతానసం బ్రతిష్ఠి చె
వాద. ప్ర పుట 242

సన్నుత గణనామ సంకీర్తనంబు. చెన్నార వాయారసేయంగ దలంచి గాద్యభక్తగణ సహస్రనామములు హృద్యంబుగా బఠియించె నెట్లనిన
మహి. ప్ర పుట 261

ఆసక్తుడై యమరారామపురుస. వాసుని నమరేశు వాసవాధీశు "నమరేశ్వరాష్టకం" బంద స్తుతించి.

మహి ప్ర. పుట 269

వారక "పర్వత వర్ణన" యనంగ మీరానతిచ్చిన చారుసత్కృతిని.
పర్వ ప్ర పుట 327.

ఇవన్నియు పండితుడు తెనుగననే రచించినట్లుగా నిశ్చయముగ తెలిసికొనవలెను. ఈతడు కర్ణాటమునందును గవిత్వము జెప్పినట్లీవలకే తెలుపబడినది. శివతత్వసారమే గాక కర్ణాటభాషలో గణసహస్రమాల ఇష్టలింగస్తోత్ర. బసవగీతలను గ్రంథములను రచించినట్లు చెప్పబడియున్నది. బసవేశ్వరుడు పంపిన విభూతిని ధరించగనే యీతనికి గన్నడము వచ్చి యందు గవిత్వము చెప్పదొడగెనని పండితారాధ్య చరిత్రమున నిట్లు చెప్పబడినది:-

"పటుభక్తిం గర్ణాటభాష నర్థించి. యటమున్న బసవ దండాధీశుకడకు బుచ్చిన జంగమంబును భాక్తవరులు. వచ్చి యా బసవన్న వరమహత్త్వంబుం బ్రస్తుతించుచు సమర్పణ సేయ బసవ, హస్తగతభూతియందు నంతటను గర్ణాట భాష సాంగముగ బ్రాణేశుం గర్ణాట గీత సంగతుల బాడుచును మఱియును బసవన్న మహిమయు వినుచు దబితజీ బసవయ్య దలచి. మ్రొక్కుచును.

(మహిమ ప్ర. పుట. 294)

పైని పేర్కొనబడిన గ్రంథములుగాక యీ కవి యీ క్రింది గ్రంథములు వఠించెనని చెప్పబడియున్నది.

* కర్ణాటకవి చరితె. సం. 1. పుట 30.

"గద్గద కంఠ వికస్వర రస సముద్గత స్తవన సంయుత వాక్యుడగుచు హారలీల దేలుచు హారలీల దనర హారలీలయనుకృతి హారలీల బొగడు మహిమఁ జెప్పెడు మహిమ్న స్తవంబునను. మహిమాకరుని మహా మహిమ కీర్తించు.

మలహరణంబగు మలహణంబునను, మలహా ప్రియునిద్ర మలహారు
[ బొగడు

శ్రీమయంబైన యనామయంబునని, రామయు డగు కరుణామయు
[ బొగడు

నాయత ప్రీతి హాలాయుధంబున హాలాయుధ ప్రియుఁ ద్రిశూలాయుధు
[ బొగడు

పాంచ భౌతిక పంచ పంచేంద్రియ ప్రపంచదూరు నుతించు బంచగద్దెను.
శివతత్త్వసార మన్మిశ్రకృతి బొగడు.

మహనీయమగు రుద్రమహిమ యన్నృతుల, మహనీయమగు రుద్రమహిమ
[ గీర్తించు.

నలరుసంసార మాయాస్తవంబునను, అఘు సంసార మాయాదూరు
[ బొగడు

శంకర గీత భాష్య త్రపదావళిని, శంకరు దురిత భయంకరు జాడు నానంద గీతంబులను పదంబున, దానందు భక్త గణానందు బొగడు

బండరు బసవన్న భవ్యగీతముల, బండరు బసవన్న ప్రాణేశు బొగడు
ప్రాక్తన నూతన భవ్య గీత ప్ర, సూక్తుల వెండియు భక్తాత్ము బొగడు
దీక్షా. ప్ర. పుట 62.

పాల్కురికి సోమనాథ పండితారాధ్యులు- రచించిన గ్రంథములు, పఠియించిన గ్రంథములు విశదముగా పై రీతిని వ్రాసినవి- పూర్వముగ్రంథము ననుసరించి తరువాతి పరిష్కర్తలు విమర్శకులు, యివి యన్నియు పండితారాధ్య రచనలేయని తెల్పిరి*- నని విషయమై, పూర్తిగ చర్చించి, సోమనాథ

---

* ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము— మదరాసు.

గ్రంథ సంఖ్య, 11083

డిచ్చిన గ్రంథ సందర్భముల ఘట్టములను, నిరూపించి. పండితారాధ్యుని రచనలను. నితరుల రచనలను వేఱుపఱచి- యాతని గ్రంథములను స్పష్టముగా తెలిపిరి** సోమనాథుడే పండితుని లోకోత్తర కవితా పాండిత్య విశేషమును గూర్చి యిట్లు చెప్పియున్నాడు.

వినరింపశేషుని వేయినాలుకలు
శివకవి మల్లయ్య జిహ్వకు సరియె. దీక్షా. ప్ర. పు.

ఇక నాతని లక్ష్యాలక్ష్యకృతుల వివరము:-

## అక్షరాంక గద్య

ఈ యక్షరాంక గద్యకే 'మల్లికేశ్వర గద్య' అని నామాంతరము[3]. ఇది యింతవఱకు ముద్రితము కాలేదు. దాని నీక్రింద నిచ్చుచున్నాను,

అఖిలలోకాధార
ఆనందరసపూర
ఇనచంద్ర శిఖినేత్ర
ఈడితామలగాత్ర
ఉరులింగ నిజరూప
ఊర్జితాచల చాప
ఋక్ష్యాంక కోటీర
ౠవర్జితోదార
ఌలిత తాండవకాండ
ౡనికృతాజాండ
ఏకైక వర్యేశ
ఐక్య సౌఖ్యావేశ
ఓంకార దివ్యాంగ
ఔన్నత్య గుణసంగ

---

** పూ. ము పీఠిక-

పండితారాధ్య చరిత్ర పీఠిక, (1939)-

*** పండితారాధ్య చరిత్ర-భారతి-

ప్రమథాయ రుద్రాయ భక్తిప్రదాయ !
విమలాయ నిత్యాయ విశ్వస్తుతాయ !

వరద శైలవిహార
శరసంభవాస్ఫార
షట్త్రింశ తత్త్వగత
సకల సురమునివినుత
హరినేత్ర పదపద్మ
అశిత భూధరపద్మ
తురరహిత చారిత్ర
అక్షరాంకస్తోత్ర
శ్రీ పర్వతలింగ నమస్తే నమస్తే నమః.

పాల్కురికి సోమనాథుడు దీని ననుసరించి అక్షరాంక గద్య వ్రాయుటయే గాక, "అక్షరాంక పద్యములు" రచియించియున్నాడు- కావున "అక్షరాంక గద్యలు" శైవవాఙ్మయమున రెండని తెలియవలెను- ఇది జయభద్ర రగడ లోని యర్థభాగము.

## స్తుతిశ్లోక పంచకము

శ్రీ మల్లినాథాయ ! జితమన్మథాయ !
సోమాంక జూటాయ ! శూలాయుధాయ !
భక్తైకకృతాభూయ ! పరమేశ్వరాయ !
తస్మైనమోస్తు కుధరవల్లభాయ ! 1

శ్రీ వీరభద్రాయ ! సింహాజినాయ !
దేవాధిదేవాయ ! చేతోమయాయ !
విస్మేరదహనాక్ష ! విగతాధ్వరాయ !
తస్మైనమశ్శ్రీకుధర ఖేలనాయ ! 2

శ్రీ వృషభేంద్రాయ ! శివవాహనాయ !
శైవాగమ పురాణశాస్త్రాధిపాయ !
సస్మేర వదనాబ్జ శాంతోదయాయ !
తస్మైనమశ్శ్రీకుధర మందిరాయ 3

భస్మాంగ రాగాయ పాపాపహాయ !
తస్మైనమశ్శ్రీగిరి ధర వల్లభాయ ! 4

శ్రీ దేశి కేంద్రాయ ! శివసన్నిభాయ !
వేదితాత్మీయాయ య వీరవ్రతాయ !
సస్మృతి శ్రుతి సదాచారాధిపాయ !
తస్మైనమశ్శ్రీగిరి ధర వందితాయ ! * 5

## పర్వతాష్టకము

భక్తవత్సల విన్నపంబయ్య ! జియ్య !
భక్తమనోంబుజ భ్రాజితశయ్య ! 1
భర్గ ! పరాపర ! భవ ! నిష్కళంక !
సర్గస్థితిలయప్రచరిత గుణాంక ! 2
వరద ! మహేశ్వర ! వజ్రిసంత్రాణ !
పరమదయారస పరనేత్రకోణ ! 3
అనవరత త్రిలోకైక నమస్య !
వనజాసనాచ్యుతాద్య నిమిషోపాస్య ! 4
గణమనోరథ పరికల్పనవ్యసన !
ప్రణతజనానీక పాతకగ్రసన ! 5
శుభకర ! యవికల శ్రుత్యంతవేద్య !
అభవ సంసార మహారోగవైద్య ! 6
సర్వజ్ఞ ! విశ్వరక్షణ కృపారంభ !
పర్వత కన్యకాపరి పరిరంభ ! 7
శరణాగతౌఘ దుస్తర పాపదావ !
పురహర చిత్తగింపుము దేవదేవ–" 8

అని యిట్లు నిను పర్వతాష్టకంబందు
వినుతింప నిస్తార వితతులుసెందు–**

* మహిమ ప్రకరణము– 29 పుట.

** పర్వత ప్రకరణము– 261 పుట.

## శివశరణ పదము

పండితుని చివరిరచన- పండితుడు లింగైక్యము జెందు సమయమున, లింగ గర్భములో ప్రవేశించుచు చెప్పినది.

శివశరణ పదము

కేదార గౌళ రాగము

ఉండంగఁ గోరెద నో పర్వతేశ
ఖండేందు మౌళి నీ గర్భం బులోన
జౌర నీవె నన్ను నీపురి యగుచున్న
సిరిగిరినుండెద శివశరణు- శివశరణుపల్లవి. 1

శివ శివ శివ శివ శివ శివ యనుచు
శివదేవయనుచు నీకీ జేరఁగోరెదను
చౌర నీవె నన్ను నీపురి యగుచున్న
శిరిగిరినుండెద శివశరణు, 2

తోలితాఁకెడు పులివోలె నీ భవము
దూలంగ మది పాఱఁద్రోలి వేగంబు
చౌర నీవె నన్ను నీపురి యగుచున్న
సిరిగిరినుండెద శివశరణు- 3

అటిముటి భవంతఁ బెటికి వేటాడి
వెఱవక నన్నుఁగాన బఱ కేరుమనుచు
చౌర నీవెనన్ను నీపురియగుచున్న
శిరిగిరినుండెద శివశరణు- 4

మెడస ట్టుకొనినను విడువని జన్మ
జడమును పెద్యము కడమలా వాపి
చౌర నీవె నన్ను నీపురి యగుచున్న
సిరిగిరినుండెద శివశరణు 5

కని, తిని, విని, మూరుకొని ముట్టిచవుల
కనుకని తాఁజెడు మనసునినీ జేర్చి

చొర నీవెనన్ను నీపురి యగుచున్న
సిరిగిరి నుండెద శివశరణు. 6

గడచుచు, గుడుచుచు. గట్టుచు బిట్టు
లొడలికై యిఱుమల బడబోయెం బ్రొద్దు
చొరనీవె నన్ను నీపురి యగుచున్న
సిరిగిరినుండెద శివశరణు- 7

నెఱమంటఁ బొడగని యుఱికెడు మిడుత
తెఱఁగుని విషయాగ్ని బఱచుపాటుడిగి
చొరనీవె నన్ను నీపురి యగుచున్న
సిరిగిరినుండెద శివశరణు- 8

అరిముఱి పసులకుఁ బొరిపొరి నరుగ
వెరవుగాదిది మేలితెరవు రమ్మనుచు
చొర నీవెనన్ను నీపురి యగుచున్న
సిరిగిరినుండెద శివశరణు- 9

"అనుచు కన్నడ గౌళనంకించు పదము
యనురాగమునఁ బాడ నభవుఁడాలించి
పండితుద్భుజ్జ్వనః పరిపూర్ణుఁడై య
ఖండిత పర్వతాకార లింగంబు.

నిర్భర కారుణ్య నికట కటాక్ష
గర్భార్భకుని నాత్మగర్భస్థుఁజేసి [1]

పై పదముయొక్క పాదము 'శివశరణు' అను దానికి "శివశరణనుచు" అని చేర్చిన- అది ద్విపదతో సరిపోవును. సోమనాథు డట్లే దీనిని ద్విపదలో పొదిగించి యున్నాడు.

ఈ పదమునందలి తొమ్మిది చరణములే యుండుట గమనింపదగినది- తొమ్మిది నవసంఖ్య నవసంఖ్య ప్రణవము- ప్రణవమనగా ఓంకారము- ప్రణవ మంత్రార్థమును ప్రతిపాదించిన పండితయ్య- ఓంకారమునుండి పుట్టిన శివమయ శబ్ద ప్రపంచమున లీనమయ్యెను-

---

[1] పర్వత ప్రకరణము పుటలు 547—549

## అలభ్య కృతులు

పండితారాధ్యుని రచనలలో లభ్యమైన వానిని పైన వివరించితిని. ఇక అలభ్యములైన వాని వివరణ-

1. లింగోద్భవ దేవగద్య
2. రుద్రమహిమ (రుద్రమహిమ)
3. అమరేశ్వరాష్టకము (అమరేశ్వరాష్టకము)
4. పర్వతవర్ణన
5. శతకము-

పైవానిలో 'శతకము' నుండి యొక్క పద్యము లభించినది:

ఉ॥ లోకములన్ని నీ తనువులో నివి నీవటు యెంత కల్గుదో
నాకప పద్మసంభవ జనార్దనులాదిగ నెల్ల పెద్దలున్
నీకొలదింత యంతయని నేరక మ్రొక్క దొడంగిరన్న ని
న్నే కరణిన్ నుతింతు పరమేశ్వర శ్రీగిరి మల్లికార్జునా

ఈ పద్యమునుబట్టి శతకము - శ్రీగిరి మల్లికార్జునా అను మకుటము గలదియని నిశ్చయింపవచ్చును-

పూర్వముద్రణ పీఠికలో

"శతకంబు శివతత్త్వసారము"

అను పాఠమునందు శతకము శివతత్త్వసారముతో నన్వయింపబడి, దానికి విశేషణముగా చేయబడినది- కాని పై పద్యమునుబట్టి, శివతత్త్వసారము, శతకము వేరువేరు గ్రంథములని తెలియనగును

---

[1] ఇందలి పై పద్యము ఉదాహరింపబడినది. "బాలబోధచ్ఛందస్సు" అను నముద్రిత లక్షణ గ్రంథము కావున ప్రామాణికము.

పూర్వపీఠిక ననుసరించి సాహిత్య విమర్శకులు దీనిని శతకముగా పరిగణించిరి. కాని పై పద్యమువలన నది సరికాదని తెలియవలెను.

'శతకము' అను పదము, శివతత్త్వసారము అను దానికి విశేషణముగా చేయుటచేత నీ యనర్థకము వాటిల్లినది.

# శివతత్త్వసారము - కావ్యత్వము

నేడు మనకుపలబ్ధమైన గ్రంథములో 489 కంద పద్యములే యున్నను, కన్నడ గ్రంథమునబట్టి యిందు వేయి పద్యములుండునని విమర్శకులు నిర్ణయించిరి- ఈ గ్రంథము, తెలుగు భాషలో మొదట వెలసిన

## స్వతంత్ర కావ్యము

దీనికిముందు నిశ్చితముగా వాఙ్మయమున వెలసినది నన్నయ భారతమే- అది సంస్కృత గ్రంథమున కనువాదమని యందఱెఱింగినదే- ఈ కాలము నాటిదే కవిజనాశ్రయమను మల్లియరేచనకృత ఛందోలక్షణ గ్రంథమున్నను నది- కన్నడమున నాగవర్మ ఛందోంబుధి ననుసరించినది- ఇక దీనితో సమకాలికమని చెప్పదగిన-పావులూరి మల్లనగణితము- మహావీరాచార్యుని సంస్కృత కృతికి ననువాదమే- కాబట్టి తెలుగున తొలి స్వతంత్ర కావ్యమిదియే యని నిర్వివాదముగా తేలుచున్నది-

ఇందన్నియు కంద పద్యములేయున్నను నిది శివతత్త్వ శివమహిమా ప్రతిపాదకమును, వీరమాహేశ్వర సంప్రదాయ ప్రతిష్ఠాపకమునైన కావ్యము కాబట్టియే, యిందు కొన్ని పద్యములలో శివ సంబోధనముండుట తటస్థించినది. ఇంక నిందులో నాశ్వాసములు లేవుగాని విషయ విభాగము స్పష్టముగా నున్నది. గ్రంథాదిని

షష్ఠ్యంతములు గలవు- తెలుగు కావ్యములలో నన్నెచోడుని కన్నను మున్నుగా షష్ఠ్యంతములను ప్రవేశపెట్టి ప్రథమ కవి ప్రముఖుడు మల్లికార్జున పండితుడే.

## కందపద్య రచన

తెలుగు కవిత కందముచే, మూలకందమునైన- కంద పద్యముల తోనే సర్వత్రా యిది రచితమైనది- కావ్యము లందుకంటెను గద్యపద్య సమిశ్రకములైనను, కందముతో కావ్యమంతయు తొలుత చెప్పిన కీర్తి పండితునిదే- ఈ సందర్భమున నన్నయ భారత పద్యభాగములో నన్నిటికన్న కందములే హెచ్చు- 24 87 పద్యములలో 1319 కందములున్నవి- అనగా నర్ధాధికముగ నున్నవి- కందములు నన్నయలోనే కాక తక్కిన చోట్లను, అర్ధాధికములే-

అనగా అర్థము నిచ్చుట యందధికములే! పండితు ననుసరించియే- నన్నె చోడదు, తిక్కన కందములనే హెచ్చుగా వాడియున్నారు-

కంద పద్యములు తక్కినవానికన్న సూత్రప్రాయములై, యిమిడిక గలిగియుండును- మతము తత్త్వము, సంప్రదాయము, నీతి వీనిని బోధించు నప్పుడు సందేహముల కెడములేకుండ, మఱచుటకు వీలుగాకుండ చెప్పవల యును- ఈ పద్ధతి ననుసరించియే పండితు డారాధ్య సంప్రదాయమునకు పరమ ప్రమాణమైన దీనిని కందపద్యములతో రచించియున్నాడు- సాధారణముగ వచనములో నియతముగానుండు స్వనామాంకిత గద్యను పండితుడు కంద పద్య ములోనే చెప్పియున్నాడు.

తిక్కన, తనకుముందు వెలసిన మల్లికార్జున పండితుని కృతినిజూచి, ఉత్తర రామాయణమును నిర్వచనముగ రచియించెను- కాని తరువాతికాల మునకు, నిద్దరు కవులు రామాయణమునంతను కందపద్యములతో రచియించిరి-

1. మానూరి వెంకటరాయ కవి కందపద్య రామాయణము

2 నిమ్మగడ్డ వెంకటాద్రి కవి కందపద్య రామాయాణము- ఇందు 19 వేల కందపద్యములు గలవు-

ఇట్లు రామాయణమేకాక- ఒక క్షేత్ర మహాత్మ్యమును ఇతర వృత్తములు లేకుండ కందపద్యములతోడనే రచితమైనవి- అందాశ్వాస విభాగము కలదు. దాని పేరు శ్రీరంగమహాత్మ్యము- ప్రబంధలక్షణములు గలది[1]- దీనినిబట్టి కందపద్య కావ్యములున్నట్లు స్పష్టము-

ఇంకనీ శివతత్త్వసారమును లాక్షణికులు- తమ లక్షణ గ్రంథములందు దీనిని కావ్యముగా బరిగణించియే యుదాహరించిరి గణపతరపు వేంకటకవి (క్రీ. శ. 1670) తన యాంధ్ర ప్రయోగ రత్నాకరమునను కస్తూరి రంగ కవి (క్రీ. శ. 1740-) తన ఆనంద రంగ రాట్ఛందస్సునను- "ఆరాధ్యదేవర శివతత్త్వ సారమందు":- అని యీ క్రింది పద్య మీయబడియున్నది-

---

[1] ఇది తంజావూరి పుస్తకశాలలోనున్న యముద్రిత గ్రంథము- తక్కినవి రెండును అముద్రితములే-

ఆయత త్రిపురాంతకదే
వాయని పిలుచుటయు గటకనంతయు వినఁగాఁ
బాయక కిన్నెర బ్రహ్మయ
కోయని యోగి వెతొల్లి యుగగా ధరణా

ఈ పద్యము ప్రస్తుతము లభ్యమైన ప్రతిలోలేదు- దీనినిబట్టి యీ కావ్య లాక్షణికత్వము గ్రహింపనగును-

ప్రబంధ కవులలో- కూర్మ పురాణమును రచించిన రాజలింగ కవి, తన కృతిలో, నన్నయాది కవులను శివకవులను, వేఱు వేఱుగా బొగడియున్నాడు- అందు శివకవుల లో

"పండితారాధ్య దేశికు, పాలకుర్కి-
సోమనాథుని-శరభాంక -"

అని పండితుని పాల్కురికి సోమనాథుని పేర్కొన్నాడు-

అయ్యలకి బాలసరస్వతి తురగా వెంకటరాజకవులు- తమ నాగర ఖండ మున- కవిస్తుతిలో-

శివతత్త్వ శివదేవుఁ జిన్మయు అని పండితారాధ్యుని శివతత్త్వసార కర్తృత్వము స్ఫురింపజేయుచు నతించియున్నాడు

## అనుకరణము

శివతత్త్వసారము పండితారాధ్య చరిత్రకు మూలమని యిదివఱకె తెలుపబడినది- ఇక దాని ననుసరించినవారిలో ప్రథముడు యథావాక్కుల అన్నమయ్య- అతని సర్వేశ్వరశతకమునుండి యనుసరణలను ముందు చూపుచున్నాను-

శివతత్త్వసారము-

ఏ దేశంబుననే పురి
నే దెస వసియించియుండు నిల శివభక్తుం
డా దేశంబున నాపురి
నా దెస వసియించియుండు హరంతీర్థంబుల్- (207 ప)

## అన్నమయ్య

"ఏదేశంబున నేదిశాముఖమునందే యూరనేవాడ మీ
పాదార్ఘ్యర్చన సేయు నిశ్చలుఁడు సద్భక్తుండొకండుండు నా
యా దేశంబును నాదిశాముఖమును న్నాయూరు నావాడ గం
గాది స్నాన నదీ ప్రవాహ ఫలదంబై యుండు సర్వేశ్వరా! (119 ప)"

ఎచ్చోనీపదభక్తుఁడుండు మదిలోంబెక్కుం బ్రయత్నంబుతో
నచ్చోనీవని కంబుకుఁడుదు త్వదీయధ్యాన చిన్మాత్రులై
యచ్చో సన్మమలెల్ల నుండుదురు మంత్రాంగాతురా యుక్తులై
అచ్చో తీర్థములెల్లనుండు నిది వేదార్థంబు సర్వేశ్వరా !

వేద విదులైన కోటి మ
హీదేవోత్తములు గుడిచి యిచ్చు ఫలంబా
హ్లాద బుగ శివయోగికి
నాదట భిక్షంబు పెట్టినంతన పొందున్- 253)

సుముఖుండై శివయోగి మోదము మదిన్ శోభిల్లఁజేకొన్న బి
క్షము విప్రోత్తమ కోటి భోజన సదృక్షు బన్న సౌభాగ్య యో
గమునం దారయు నమ్మహామహుడు వేడ్కం గోరి యారోగిం
బమరం జేసిన పుణ్యమెట్లు గురిసే యన్వచ్చు సర్వేశ్వరా.

## తిక్కన

తిక్కన సోమయాజి శాంతిపర్వమున శివతత్త్వసారము నిట్లనకరించి యున్నాడు-

"దేవా సంసారంబుధి
లో వెలువడఁజేసి ప్రమథ లోకంబెలుగన్
నావాడు వీడు సుండీ
నావే నన్పుంపవే గణంబుల నడుమన్. 386 ప

తిక్కన- నిన్ను నెప్పుడుఁ దలఁచెది నన్నునీవు
వత్సలుఁడవయి వీడు నావాడనంగ
వలయు జుమ్మయ్య మఱవక వాసుదేవ
దేవ దేవ మునీశ్వర భావనీయ-

శాంతి- 4-246

# ఆంధ్ర వీరశైవ వాఙ్మయమునకు

## శివతత్త్వసారమే

## ప్రాతిపదిక

వీరశైవ వాఙ్మయము- పండిత వాఙ్మయము, బసవ వాఙ్మయము అని రెండు విధములు.

1. పండిత వాఙ్మయము- అనగా పండితారాధ్యుడు ప్రవర్తింపజేసిన సవైదిక లేక వీరమహేశ్వరచారమునకు, అభక్తులకు సంబంధించినది
2. బసవ వాఙ్మయము- అనగా బసవన ప్రవర్తింపజేసిన అవైదిక వీరశైవ లేక జంగమ సంప్రదాయమునకు, అభక్తులకు సంబంధించేనవి.

పై వానిలో మొదటి సంప్రదాయమునకు జెందినది- శివతత్త్వసారము- ఇది పండితారాధ్యకృతము- ఈ గ్రంథమునందే రెండవ సంప్రదాయమునకు జెందిన, బసవన, అతని భక్తవర్గముయొక్క కథలు సూచితములై యున్నవి- ఆంధ్ర వీరశైవ వాఙ్మయమంతయు నీరెండు సంప్రదాయముల సామూహికమే కాబట్టి, ఈ రెండింటికి సంబంధించినవానిలో శివతత్త్వసారమే మొదటిది కాబట్టి ఇదియే ఆ వాఙ్మయమునకు ప్రాతిపదికయైనది.

అది యెట్లో యీ క్రింద నిరూపించుచున్నాను-

ఇ. దుదాహరింపబడిన 58 గురు భక్తులలో పై రెండు వర్గములకు జెందిన వారీరీతిగా విభక్తమగుదురు.

| పండితారాధ్యుడు. | బసవన. |
|---|---|
| ఇందు పౌరాణిక భక్తులు సాహిత్య ప్రసిద్ధులైన భక్తులు చేరుదురు- | అంబెన్న |
| | అరియమరాజు |
| అకారాది | అలవూరి భక్తుడు |
| విష్ణువు | ఇరుదత్తుడు |
| వ్యాఘ్రపాద పుత్రుడు | ఒకయనంబి |
| శ్రీపతి పండితుడు | ఒడయపిళ్ళ |
| హలాయుధుడు | ఓహిళుడు |

ఉద్భటుడు
ఉపమన్యుడు
కాళిదాసు
గౌరీదేవి
చండీశుడు
బాణుడు, (రాక్షసపతి)
బాణుడు (కవి)
మయూరుడు
మలయరాజు
మల్హణుడు
రావణుడు

కదిరెరెమ్మయ్య
కన్నడ బ్రహ్మయ్య
కన్నప్ప
కరికాలచోడుడు
కాటకోటడు
కిన్నెర బ్రహ్మయ్య
కిన్నెరుడు
కుమారపాలఘూర్జరుడు
కుమ్మర గుండయ్య
కెంబావి భోగయ్య
కేశవరాజు
గోవిందుడు
చిఱుతొండనంబి
చేరమ చక్రవర్తి- తెలుగు జొమ్మయ
బంకయ్య బసవన- జావూరి బ్రహ్మయ్య
బెజ్జ మహాదేవి
మడివాలు మాచయ్య
మహాకాళయ్య జంబూరి
మాదర చెన్నయ్య
ముసిడి చౌడయ్య
మొఱటద వంకయ్య
వరగొండ చక్రవర్తి
వైజకవ్వ
వీరశంకరుడు
శంకరుడు
శంకరదాసి
శంకరదాసయ
శాక్యతొండడు— శివనాగమయ్య
సకలేశుమాది రాజయ్య
సురియ చౌడయ.

పై పట్టికలను చూచినచో, వీరశైవ భక్తిని నిరూపించిన శివభక్తులు పెక్కురు బసవనకు, ఆ సంప్రదాయమునకు జెందినవారేయని స్పష్టపడగలదు- ఈ భక్తుల చరిత్రతే, తెలుగున ద్విపదాది సాహిత్య ప్రక్రియలమూలమున- కావ్యప్రబంధ వాఙ్మయములోనికి ప్రవేశించినవి-

పండిత సంప్రదాయమునకు సంబంధించిన భక్తులలో పౌరాణిక భక్తులను గూర్చిన కథలు ప్రత్యేక ప్రబంధములు గా వచ్చినను, వానిని శైవవాఙ్మయమున విమర్శకులు పరిగణింపరు- ఇక- మిగిలిన చరిత్రకు దెలిసిన-ఉద్భట, కాళిదాస బాణ, మయూర, మల్హణ- మలయరాజ- హలాయుధులలో- ఉద్భటుని గూర్చి మల్హణునిగూర్చి ప్రత్యేక కావ్యములే గలవు-

ఉద్భటునిగూర్చిన కావ్యము ఉద్భటారాధ్య చరిత్రమును తెనాలి రామ లింగ కవి మూడాశ్వాసముల ప్రబంధముగా రచియించియున్నాడు.

మల్హణుని కథ- 'మల్హణ చరిత్ర' అనుపేర మూడాశ్వాసముల పద్య కావ్యముగా ఎడపాటి ఎఱ్ఱన రచియించియున్నారు-

తక్కిన వారి భక్తినిగూర్చిన కథలు- పై యిరువురితో పండితారాధ్య చరిత్రమున నున్నవి- వానిని ప్రత్యేక శీర్షిక క్రింద వివరించుచున్నాను.

పండిత సంప్రదాయమునకు జెందిన వాఙ్మయమునకంతకు పండితారాధ్య చరిత్రయే మూలము- దానికి శివతత్త్వసారమెట్లు మూలమైనదో నిరూపించు చున్నాను.

## శివతత్త్వసారము - పండితారాధ్య చరిత్ర

'శివతత్త్వసారము' నందలి పద్యములయొక్క సారాంశమును వీలయి నంతవఱకు మూలశబ్దములతోడనే సోమనాథుడు తన గ్రంథమునందు జేర్చెను. ఇపుడు మనకు దొరకిన శివతత్త్వసారమందు 489 కంద పద్యములు కలవు. వీనిలో గల కొన్ని ప్రకరణములే పండితారాధ్య చరిత్రములో గానవచ్చు చున్నవి. అట్టివి కొన్ని యీ క్రిందఁ జూపుచున్నాను:-

| శివతత్త్వసారములోని పద్యముల సంఖ్య వర్ణింపబడిన విషయము. | పండితారాధ్య చరిత్రలోని రూపాంతకిత ద్విపద భాగము. |
|---|---|
| 21-66 అద్వైత ఖండనము. | పుట 187 వాద ప్రకరణమందలి వేదాంత వాద ఖండనము. |
| 300-313 దక్షాధ్వరధ్వంసము | పుట 233 దక్షాధ్వర ప్రశంస |
| 319-350 ప్రళయ వర్ణనము | పుట 236-38 ప్రళయలీల |
| 351-383 శివగణముల వర్ణనము | పుట 238 మహాతాండవలీల |
| 384-385 తనను శివగణములలో జేర్చుమని కోరుట. | పుట 405 పర్వత ప్రకరణమందలి పండితుని చరమ ప్రార్థన. |

ఆరాధ్య చరిత్రము నింకను వెదకినయెడల నందు శివతత్త్వసారమందలి పద్యముల యర్థము గల ద్విపద లింకను దొరకగలవని పైని జూపిన పమాన భాగములలో నొక్కొకచోట సోమనాథుడు శివతత్త్వసారమందలి శబ్దములనే యుపయోగించి చక్కగ ద్విపదలుగ జెప్పెను. ఇందుకిదివఱకు రెండు పద్యములును వానికి సరియైన ద్విపదలు నిచ్చియున్నాను, ఇచ్చట నింక గొన్ని యుదాహరణము లిచ్చెదను.

కం. కలదననోపక లేదని, పలుకగ నేరకయు మూకబధిరుల క్రియ ని
మ్ములు నద్వైతులు దమలో, పల వగతురు భువన భిన్నభావమున శివా.

ఇందుకు సరియైన ద్విపదలు

కలదనంగా నోపకయును లేదనియు, బలుకనేరక మూకబధిరుల క్రియను
బరగు భువనభిన్న భావంబు జూచి, యరయంగ నద్వైతమనగ లావేది.
పుట. 189.

కం. నిర్వచనీయము లేకయ, నిర్వచనీయంబుగలదె నిర్వచనీయా
నిర్వచనీయోత్పత్తిన, సర్వాద్వైతంబు చెడదె సర్వానందా- 39

ద్వి. నెక్కొన నిర్వచనీయంబు లేక, నిక్కమ నిర్వచనీయంబుగలదె?
నిర్వచనీయ మనిర్వచనీయ, మున్వినా నద్వైత మొగిరెంటికగునె.
(పుట. 188 )

కం. భూతములు దర్భ్రతాళ్ళను, హోతల మెడలంటగట్టి యూపంబులతో
ద్రేతాగ్నుల యాగాశ్వము, భూతేశ్వర గంగలోన బోపైచె నజా.
303.

ద్వి. తడయక నచట హోతల దర్భ(త్రాళ్ళ, దొడరి యూపంబులకోడ బంధించి,

యత్యాగ్రహమున నాహవనీయ గార్హ, పత్యదక్షిణనామ పరిమితాగ్నులను నావృతంబైన యాగాశ్వంబుగాగ. పుట 235.

కం. ససముద్ర ద్వీపాచల, వసుమతి వడిమీది కెగురవైచి సనక్షత్ర సురావాసాకాశము, వెసగ్రిందికి దివుచు బ్రమథ విభుడొకడు శివా 327

ద్వి. జలనిధి ద్వీపాంతర్సహితధరిత్రి, వడిమీది కెగురంగవైచి యార్చు చును మీదిలోకములతో మించు నాకసము, రాదివుచు క్రిందికి బ్రమథేంద్రు డొకడు. పుట. 237.

కం. యమమహిష శృంగములు నిం,ద్ర మహాగజదంతములు బ్రతాపము తోడన్.

సమసు ప్తి దున్సికొని నీ, ప్రమథులు దాళములు వేసి పాడుదురు శివా. 331.

ద్వి, అలరి యమేంద్ర వాహనదంత శృంగములు తాళములు వేయు మున్నొక్క గణము. పుట. 237.

ఈ ప్రకారముగ నెన్నియో యుదాహరణము లీయవచ్చును. ప్రకరణములకు బ్రకరణములు సోమనాథుడు ద్విపదలో రూపాంతరముచేసెను. శివతత్త్వసారమున నొక్కొక్కపద్యమున జెప్పబడిన భక్తుల చరిత్రములు కొన్ని విపులముగను రసవంతముగను పండితారాధ్య చరిత్రలలో రచించెను. మిగిలినవి బసవ పురాణమునగలవు. వానిని బసవ వాఙ్మయమున జూడనగును.

పై దానినిబట్టి శివతత్త్వసారము పండితారాధ్య చరిత్రకు మూలమైనట్లు విశదమైనదిగదా! ఇక తక్కిన వానినిగూర్చి తెలిపెదను.

ఇక. పౌరాణిక భక్తులగు, గౌరీదేవి, విష్ణువు, ఉపమన్యుడు, బాణుడు (రాక్షసపతి) వ్యాఘ్రపాదపుత్రుడు, చండీశుడు, రావణుడు కాక మిగిలిన కాళిదాసాది భక్తులను గూర్చిన వివరణము-

# సంస్కృత సాహిత్యము

## శివతత్త్వసారము

ఈ గ్రంథమున "కొందఱు శివభక్తుల చరిత్రములు" అను శీర్షికలో, సంస్కృత భాషలో మహా ప్రసిద్ధులైన కవులను గూర్చి వారి రచనలను గూర్చిన ప్రశంసలున్నవి- శివభక్తులైన యా మహాకవుల జీవితములనుండి యింతవఱకు సంస్కృత వాఙ్మయ చరిత్రకెక్కని కొన్ని యంశము లీ శివతత్త్వసార మెఱుకపఱచుచున్నది, కాలక్రమమున, నా యా కవుల వివరణము—

"పరువడి మఱియు ననేకులు
ధరబాణ మయూర కాళిదాసాది మహా
పురుషులు ద్వష్టప్రత్యయ
వరములు నిను గొలిచి కనిరి వరభక్తిశివా 145, ప.

### కాళిదాసు

జగత్ప్రసిద్ధుడైన కాళిదాస మహాకవి శివభక్తుడని యందఱంగీకరించిన విషయమే- అయినను, నాతని శివభక్తి నిరూపించు ఘట్టమును గూర్చి యింతవఱకు సాహిత్య ప్రపంచ మెఱుగదు- పాల్కురికి సోమనాథు డీ విషయ మిట్లు తెలిపియున్నాడు-

"పాలిత శాబ్దికులే బాణమయూర
కాళిదాసులు తమ కవితా విశేష
ములకు మాత్సర్యముల్ ముట్టుడు"

అని వారి వారికి సంబంధించిన కథల నిచ్చియున్నాడు-

కాళిదాస మహాకవి శివునికి తన రెండు కన్నులనిచ్చి "కాళిదాస గద్య" అను గద్యకృతిని చెప్పి వానిని తిరిగి పడయుటయేగాక- ఇంకను నేత్రంబులరాశి- వడసి యంధులందఱికి, తిరిగి కన్నులువచ్చినట్లుగా నీ క్రింది పంక్తు లనుబట్టి తెలియుచున్నది.

"......చేతులు రెండు
బడయుట యెంత
కదిదేదానను చుఁ జక్కన కాళిదాసి *

---

* మహిమ ప్రకరణము- 107 పుట,

కాళిదాసునకు, కాళిదాసి'యని సోమనాథుడు వాడియున్నాడు "చెచ్చెర కాళిదాసికిని"— అని యతిస్థానమున, నీ రూపము గలదు.. (బసవ పుట.

కన్నులు రెండున క్షణమ కెలంకి
పన్నగధరు పదాబ్జముల కర్పించి
ధర కాళిదాసి గద్యంబునాఁ జెప్పి
వరభక్తి యుక్తి నీశ్వరుని గుఱించి
యిచ్చిన కన్నుల నిచ్చుట గనుట
యచ్చెరువగునే మహాదాని యనుచు
నీశుచే నఖిల లోకేశుచేఁ గాళి
దాసి నేత్రంబుల రాసులు వడసి
యెన్ని దేశంబుల నెన్ని పురముల
నెన్ని గ్రామంబుల నెన్నఁగబడిన
నన్ని దేశంబుల నన్నిపురముల
నన్ని గ్రామముల జాత్యంధు లందఱును
గనుగుఱ్ఱు లేకి రోగస్థులై యున్న
జనుల రండోయని చాటఁగఁ బనుపఁ
దప్పవోయిన కన్ను దడికన్నుఁ బొరయ
గప్పిన కన్నడ్డు కన్నుడ్డు కన్ను
గ్రుడ్డికన్నారి గన్ను గోద్రెప్పకన్ను
బ్రొడ్డుకన్నును పువ్వుపోయిన కన్ను
పాలగట్టిన కన్ను బ్రంగుడు కన్ను
గ్రాలు కన్నును నీఱుగాఱెడి కన్ను
బ్రొంద కన్నును, పొరిపొరి బ్రుస్స కన్ను
మ్రంద కన్నును పెక్కు మాదల కన్ను.

... ... ... ...

కాసయునవెడి రోగంబు కన్నులును
నాదిగాగల సమస్తాంధులు నఖి
రోదనస్థులు దన ప్రోలికేతేర
చెన్నార కాళిదాసియు శివుచేత

గొన్నయా ముయ్యేడు కన్నులలోన
దా రెండు కన్నులుద్ధతి ధరియించి
వారివారికి కన్గవలు పుచ్చి పుచ్చి
యిచ్చుచు నంధుల నెల్లను దనుప
నచ్చెర వంది లోకావళి వొగడ
గ్రక్కున దమ దను కన్నులరాక
కక్కజంబంది పూర్వాంధులు మ్రొక్క
డాసిన నసుమాత్ర తమ నేత్ర రుచులు
వాసిన యతగులు ప్రణమితులగుచు
బూని యా కన్నుల ప్రోగులు సమయ
దానంధులకు గాళిదాసి దానంబు
ఊతి నంధులకు కెల్ల గృపసేసి శివుని
నుతియించి పడసె.

ఈ కథయందు జెప్పిన కాళిదాస గద్య లభ్యముకాలేదు.

భట్టబాణుడు

ఈతని గూర్చి పై కంద పద్యమునందేగాక. ప్రత్యేకముగా వేఱొక కందమును పండితారాధ్యుడు రచించి యున్నాడు

"చేతులు రెండును దునిమి మ
హా తాత్పర్యమున మిమ్ము నర్చించి జగ
త్పూతముగ మగుడఁ బడయడె
ఖ్యాతిగ నీచేత భట్టబాణుఁడు రుద్రా, 398 ప.

సోమనాథుడీ విషయము నిట్లు చెప్పినాడు. *

" .... .... .... .... భట్ట
బాణుండు వెండియు భక్తి క్రియాధు
రీణుం డెప్పుడు దన రెండు చేతులును
గడికండలుగఁ దన కట్టల్కదునిమి

* మహిమ ప్రకరణము. పుట 106,107.

పుడమి జనుఁ బుఁ దృప్త మందిచూడ
పాఠ (బూన్చి బాణ గద్యావసానమునఁ
జిరభక్తి "శివకర శివకర" యనుచుఁ
బడసె చేతులు రెండు."

నన్నెచోడ కవి కమార సంభవములో బాణుని స్తుతించుచు పై యుదంతమును చెప్పియున్నాడు.

"కరములు దనుముడుఁ బరముని
వరదునిగాఁ గొల్చి కవితవలన నమగుడం
గరములు వడసి జగంబునఁ
బరగె మహాకవి యనంగ బాణుఁడు పేర్మిన్ (1-22)

బాణుడు తన చేతులను ఖండించుకొని, తిరిగి శివస్తుతివలన బడసిన కథ- అతని 'గద్య' చరిత్రలకెక్కలేదు- పండితారాధ్య చరిత్రమున పై పంక్తుల వలన. యాగద్య- చివర, 'శివకర శివకర' అని శ్లేషమూలముగా కరముల నొసఁగుమన్న ప్రార్థనయున్నది. ఇంతేకాక పర్వత ప్రకరణ ప్రారంభమున- తక్కిన పండిత కృత గద్యలతో బాటు బాణగద్యకూడ పఠన ప్రచారముల నున్నదని-

"అంచిత బాణగద్యాతురగద్య
పంచ గద్యాదులు-"

అన్న పంక్తులు తెలుపుచున్నవి- *

బమ్మెర పోతన నాటికీ బాణగద్య యున్నట్లుగా భాగవతావతారికనుండి తెలియుచున్నది-

"మృదుమధుర వచనవర్గ పల్లవితస్థాయినకు బాణునకు నమస్కరించి" **
ఇచట వచనవర్గమనగా గద్యకృతి యని తెలియవలెను,

* పర్వత ప్రకరణము- పుట 512.

** అవతారిక- 12 వచనము- ఈబాణ గద్య- లభ్యమగుచున్నది. తిరువనంతపుర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో నున్నది. గద్యచివర. 'శివకర' శివకర' అని యున్నది.

మ యూ రుడు

బాణుని సమకాలికుఁడు మయూరుఁడు- ఈతడు సూర్యశతకమును రచియించి యజరామర కీర్తి వహించినవాడు. సోమనాథుడిట్లు చెప్పుచున్నాడు.

"…. …. …. లోక
ముల బుధుల్ విద్వత్తములుజూడఁ దొలఁతఁ
జని మయూరుఁడు సూర్య శతకంబుజెప్ప
నినడు ప్రత్యక్షమై "యిది నీదు పూర్వ
కర్మంబు కుష్ఠరోగము శూలిదక్క
నిర్మూలముగఁ జేయనేర రట్లయ్యు
నొక్కింత నాదీప్తి నొసగెదనదియు
గ్రక్కునవెలి కుష్ఠు గప్పునట్లుగను
అనంతస్థమగు కుష్ఠుహారునిచేగాని
యింతయు జెడదట్టి లీశుమతింపు
తడయ కిరోగంబు తనకయ్యె శ్రుతులు
నొడువ మార్తాండ భానోఃకుష్ఠ "యనచు
నంతఁదద్రోగంబుహారు పాదభక్తి
మంతుఁడనై కొల్వమానె" నాపుడును
రతిమయూరుఁడు "మయూరస్తవంబనఁగ"
క్షితిధరజాపతి గీర్తనఁజేసి
ధరభానుచేబోని దనలోని కష్ఠు
హారియింప.* …. ….

ఈ మయూర స్తవము హూడ పండితుని కాలములో ప్రచారమున నుండెడిది-** ఇప్పుడిది యలభ్యము- రెండు శ్లోకములు మాత్రము లభించినవి- ఇదియును సంస్కృత వాఙ్మయ చరిత్ర కెక్కలేదు- తొలుత ముప్పదేండ్ల క్రిందట నేనే దీనిని లోకమునకు వెల్లడించితిని ***

---

* మహిమ ప్రకరణము- పుట 106.

** పర్వత ప్రకరణము పుట 512

*** Mayurastva- a forgotten work of Mayura K. V. Ranaswami Iyengar Commemoration Volume PP 24-32.

## ఉ ద్భ టు డు

శివతత్త్వసారమున

"హారలీలాస్తవరచనా
స్థిర నిరుపమభక్తిఁ దనదు దేహముతోడన్
సురుచిర విమానమున నీ
పురమున కుద్భటుఁడు బ్రీతిఁబోవడె రుద్రా. 410 ప.

అను యుద్భట ప్రశంస గలదు-

ఈతని కృతియగు "హారలీల"ను పండితారాధ్యుడు పఠించినట్లు పండితా రాధ్య చరిత్రమున దీక్షాప్రకరణము * వలన భక్తులు పఠించినట్లు పర్వత ప్రకరణమువలనఁ దెలియుచున్నది.

నన్నెచోడ మహాకవి యీతని నిట్లు స్తుతించియున్నాడు-

క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవము సాలంకా
రము గూఢవస్తుమయ కా
వ్యముగా హారలీలఁ జెప్పి హరు మెచ్చించెన్. (1–21)

ఇందు 'హారలీల'యే' గాక యుద్భటుని కృత్యంతరములు పేర్కొనబడి నవి- అవి రెండు 1 కుమారసంభవము. 2. కావ్యాలంకార సంగ్రహము. వీనిలో హారలీల కుమార సంభవము లభ్యము కాలేదు- కావ్యాలంకార సంగ్రహమున నలంకార లక్ష్యములకు, తన కుమార సంభవమునందలి శివుని వటురూపధారణలీలను నిచ్చియుండుటచేత కుమారసంభవము నీతడు రచియించి యుండుట స్పష్టము. అయితే, కాళిదాస మహాకవి రచనముందది నిలువక

* దీక్షాప్రకరణము— పుట 181.

పోవచ్చును– నన్నెచోడని కాలమునాటికది యున్నట్లు స్పష్టమే. [1] ఈతఁడు క్రీ. శ. 779-813 వఱకు కాశ్మీరమును పాలించిన జయాపీడు నాస్థానమున దినమునకు [2] లక్ష దీనారముల వేతనముతో నుండెడివాడు.

ఈతని కథను సోమనాథుడు బసవపురాణమున సప్తమాశ్వాసమున వ్రాసియున్నాడు- [3] అందది 38 పంక్తులలో నున్నది. అందుద్భటుడు వల్లకిపురమున భోజమహారాజు నాస్థానమునుండి యాతనికి శివదీక్ష నిచ్చినట్లును, తన చితాధూమముచే, నేడు వందల భూతముల శాపవిముక్తి గలిగించెనని కలదు–

ఈ సోమనాథుని యుద్భటకథనే తెనాలి రామలింగకవి పెంపుచేసి "ఉద్భటారాధ్య చరిత్రము" అను ప్రశస్త ప్రబంధము రచించెను.

కన్నడమునకూడ నీతని చరిత్ర గలదు. అందు బ్రహ్మదేవుడను కవి సమయపరీక్ష– అను గ్రంథమున- హారలీల వేయి పద్యములుగల కృతియని వ్రాసియున్నాడు-

సోమనాథుడీ యుద్భటుడు- వల్లకిపురమున భోజరాజు పాలనమున నున్నవాడని వ్రాసినదాని- కాశ్మీరమున నున్నట్లుగా వ్రాసిన విమర్శకుల వ్రాతకు సమన్వయము కుదరలేదని కొందఱు వ్రాసిరి. కాని యది సరికాదు. ఆంధ్రవీరశైవ వాఙ్మయమందెచ్చటను వేఱొక యుద్భటుడులేడు– బసవపురాణ రచనాకాలమునాటికి సోమనాథున కాతనిగూర్చి వివరములు తెలియలేదని యనుకొనుట సముచితము ఈ ఉద్భటునిగూర్చి సవిస్తరముగా ఉద్భటారాధ్య చరిత్ర పీఠికలో వ్రాయఁదలచి, యిచ్చట విరమించితిని.

---

[1] కుమార సంభవ విమర్శనము. కీ. శే. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి పుటలు 121–127. (మద్రాసు విశ్వవిద్యాలయ ప్రకటితము. 1937

[2] ఇచట దీనారములనగా బంగారు నాణెములు కావు. అవి రాగి నాణెములని తెలియవలెను. Kalhana's Rajatarangini S. B. Pandit's Edition.

[3] పుట 189;

## హాలాయుధుడు

"నిష్ఠురభక్తి హాలాయుధు
నిష్ఠకు వలచిన విధము నీదగు కర్మా
ను ష్ఠానములకు బిలిబిలి
నిష్ఠలకును శివుడు వలచునే తలపోయన్ 487 ప.

హాలాయుధుడు సంస్కృత సాహిత్యమున ప్రసిద్ధుడు శివభక్తుడు— ఈతడు రచించిన గ్రంథములు అభిధాన రత్నమాల (నిఘంటువు) కవి రహస్యము (ఛందోగ్రంథము) మృతసంజీవని (కావ్యము) హాలాయుధ స్తవము- అను శివ స్తవము- వీనిలో కడపటిది- పండితారాధ్యుని నాటికే ప్రచారము వడసినది,

"ఆయత ప్రీతి 'హాలాయుధంబున' హ
లాయుధప్రియుం ద్రిశూలాయుధు బొగడు"

మఱియు శివభక్తులు దీనిని పఠించెడువారు [1]

బసవపురాణమున నీ హాలాయుధుని కథ కలదు. అందీతడు చిఱుతొండ నంబితో సమకాలికుడుగా నిరూపితుడు [2] ఈతడును, చిఱుతొండనంబియు, చారిత్రకముగ సమకాలిక వ్యక్తులని నిరూపితమైనది.

ఈ స్తవము శివ స్తవములన్నిటికన్న పెద్దది- 67శ్లోకములున్నవి- తెలుగు సాహిత్యమున దీనికి ప్రచారమున్నది. శ్రీపర్వతపురాణమున నాగులూటి శేషనారాధ్యుడిందలి 21 వ శ్లోకము నిట్లను వదించియున్నాడు.

మూలము శ్లో॥ ఏషాంయుష్మత్ప్రతికృతి గృహాంలిపతాం పాణయోాఘే
త్వద్భక్తానాం సలిలలలితై ర్గోమయైః సంప్రలిప్తాః
తేషామీశ త్రిదశనగరీ నాయకత్వం గణానాం
తే లిప్యంతే మృగమదరసైః ఖేచరీణాం కుచేషు. 21.

---

[1] పూర్వోక్త దీక్షా, పర్వత ప్రకరణముల పుటలు.

[2] ,, ,,

[3] శివపంచ స్తది పీఠిక-ర.

తెలుగు

మలహారు గుడిగోమయమున
నలికిన మర్త్యుఁడు నలుకునట కస్తూరీ
మలయజపంకము దివిష
జ్జలజాయతలోచనా కుచద్వయవీథిన్: 4 అ

మూర్తికవి సరస భూపాలీయమున నిందలి ప్రథమ శ్లోకము నిట్లనుసరించియున్నాడు.

శ్లో॥ విఘ్నం నిఘ్నం ద్విరదవదనః ప్రీతయేవోస్తునిత్యం
వామేకుంఠత్ప్రకటిత బృంహద్దక్షిణే స్థూలదంతః
యః శ్రీకంఠం పితరము మయాశ్లిష్టవామార్థదేహం
దృష్ట్వానూనం స్వయమపి దధావర్ధనారీశ్వరత్వం-

అరుదుగ వామభాగ లలనాకలనా చలనాత్ముఁడైన యా
హరుఁగురుగాంచి తానను తదాకృతియాఁగతి నేకదంతుడై
కరికరిణీగుణంబులు మొగంబునదాల్చి జగంబు లేలునాం
తర కరుణాసనాథు గణనాథు మరుద్గణనాథు గొల్చెదన్. (1-4)

## మలహాణుడు

## (మల్హాణుఁడు)

"తన లంజయునుం జిల్కయుఁ
దనలంజియ బంధు జనులు దానును జనఁడే
జనులెల్ల జూడ మలహాణు
నిను సంస్తుతిచేసి దేవ నీపురమునకున్- 415 ప

మల్హాణుడు శైవస్తోత్రవాఙ్మయమున ప్రశస్తిగన్న శివప చ స్తవములలో మల్హాణస్తవమును రచించిన మహాకవి. పై పద్యములో "నిను సంస్తుతిచేసి" అను దానితో సంస్తుతి- యాస్తవమే యని తెలియవలెను-

సోమనాథుడీ కథను పండితారాధ్య చరిత్రమున దీక్షాప్రకరణమున 160 పంక్తులలో చెప్పియున్నాడు- గ్రంథ విస్తరభీతిచే వాని నుదాహరింపలేదు- పుష్పగంధి యను వేశ్యయు, శివభక్తుడగు మల్హాణుడును బాల్యస్నేహితులైనను,

పుష్పగంధి యౌవనవతియైనవెనుక వేశ్యతల్లి-యాతనికి, పుష్పగంధికి, సమావేశము గలుగకుండ జేసెను- కాని వారిరువురకు మనసులో గాఢ ప్రేమగలదు- ఒకనాడు మల్హణుడు విరహము భరింపజాలక, వర్షమైనను, పుష్పగంధి యింటి గది గుమ్మము చేరియుండెను. పుష్పగంధి యీ సంగతి నెఱుంగక, తాంబూలము పుక్కిలించి యుమ్మెను. అది మల్హణుపై బడెను. తక్షణమే మెఱుపు మెఱసెను- పుష్పగంధి తాను చేసిన మహాపరాధము గ్రహించి యాతనిలోనికి గొనిపోయి, క్షణికమైన యీ సౌఖ్యముకన్న, చిరసౌఖ్యము శివభక్తిచే సమకూడునని చెప్పగా, తాను కవిగాన- ఈశ్వరునిగూర్చి- ముప్పదినాల్గు స్తుతి శ్లోకములు చెప్పెను. శివుడు ప్రత్యక్షమై, మల్హణుని పుష్పగంధిని, యామె తల్లిని, పంజరములో చిలుకను- నందఋని కైలాసమునకు గొంపోయెను-*

దీనిని ప్రత్యేక ప్రబంధముగా ఎడపాటి యెఱ్ఱన యను కవి రచించి యున్నాడు- అది రెండుమాఱులు ముద్రితమైనది. **

ఈ మల్హణస్తుతిని గూర్చి సోమనాథుడే యిట్లు వ్రాసియున్నాడు

"తనరు సద్భక్తిం గాంతాకచ ప్రచయ
యనుచును ద్వ్యక్తుండై హరుమనం బలర.
ప్రస్తుతాలంకార బంధుర మధుర
విస్తారమతి మల్హణ స్తోత్రమనంగ
నప్పుడ ముప్పదియాఱు శ్లోకము సెప్పినంతట."

ఇదియును పండితారాధ్యులు పఠించినట్లు పూర్వోక్తోదాహృతులనబట్టి తెలియుచున్నది. దీనికి శివపంచస్తవియందు చక్కని వ్యాఖ్యయు భాషాంతరములు గలవు-

## మలయరాజు

అమిత దృఢభక్తి నీదయం
గొమరుగం బరిజనులతోడం గూడవె శివలో

* పుటలు 358-367.

** శృంగార గ్రంథమాల మద్రాసు-1930- శృంగార కావ్య గ్రంథమండలి బందరు-1940.

కమునకు దేహముతోడన
రమణీయముగాఁగ మలయ రాజరిగె శివా          409 పద్యము

మలయరాజు శివభక్తుఁడగుటయేగాక, "మలయరాజీయము" అను శివ స్తోత్రమును రచించిన మహాకవి- ఈ స్తోత్రమును శ్రీశైలమునకు నేగు భక్తులు, శివరాత్రి సమయములో పఠించుచుండెడివారని పండితారాధ్య చరిత్రమువలన తెలియవచ్చుచున్నది.

మలయరాజీయమున 72 ఆర్యావృత్తములున్నవి ఇది పండితారాధ్యులకు ప్రీతికరమైన శివ స్తవములలో నొకటి శివతత్త్వసారమునందే దీనిలోని యొక శ్లోకమున కనుకరణము గలదు

శ్లో॥ కులిశఁకుసుమతి దహన
స్తుహినతి వారాన్నిధిర్ధ్రువం స్థలతి
శత్రుర్మిత్రతి విషమ
వ్యమృతతి శివేతి ప్రలపతో భక్త్యా          59 శ్లో.

ఆయుధములు కుసుమములగు
నాయబ్ధులు మెట్లగు మహా మదగజముల్
వేయేల గండశిలలగు
బాయకనిను గొలుచు నచలభక్తులకు శివా          116 ప.

* ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర శతకమున దీని ననుసరించియున్నాడు.
"పవిపుష్పంబగు నగ్నిమంచగు నకూపారంబు భూమీస్థలం
బవు శత్రుండతి మిత్రుఁడౌ విషము దివ్యాహారమే నెన్నగా
నవనీ మండలిలోపలన్ శివశివేత్యా భాషణోల్లాసికిన్
శివ నీనామమె సర్వవశ్యకరమే శ్రీ కాళహస్తీశ్వరా."

---

* ఈ స్తవములు శైవసాహితీ సామ్రాట్టులు బండారుతమ్మయ్యగారు తెలిగించిరి. అందుపై శ్లోకమునకు ధూర్జటి పద్యమే నిలిపి శివకవి సంప్రదాయమువారు పాటించినారు. భక్తిరసప్లుశమగు వారి తెలుగు స్తుతి శివపంచస్తవి'లో మూలముతోగూడ ప్రకటితమైనది.

# పండిత త్రయము

పై పండిత వాఙ్మయమున మిగిలిన వారిలో శ్రీపతి పండితుడు ముఖ్యుడు- ఈపండిత త్రయమును గూర్చి యీ వఱకే కొంత తెలిపితిని- ఇందు సంగ్రహముగ దెలుపుచున్నాను- ఆ ముఖ్యవారిలో ప్రథముడు.

శ్రీపతి పండితుడు

శివతత్త్వసారమున పండితుండీతని నిట్లు ప్రశంసించియున్నాడు.

ఒక్కడ దైవము శివుండని
నిక్కముసేయుటకు ముడిచె నిప్పులు చీరన్
ప్రుక్కక శ్రీపతి పండితుం
డక్కజముగ విజయవాడ నలజమ్మి శివా. 406 ప.

సృష్టికర్త బ్రహ్మకాడని, శివుడే సృష్టికర్తయని, శివమాహాత్మ్యమును విశదీకరించుటకు, శ్రీపతి పండితుడు, బ్రాహ్మణులకు ముఖ్యమగు నగ్నిహోత్రమును కొంగున మూటగట్టెను. ఈ విషయము, శాసనబద్ధమై యున్నది- ఈతడు, శ్రీకర భాష్యమును రచించి యారాధ్య సంప్రదాయకులలో ప్రథముడయ్యెను- ఈయన కైదవ పురుషుడైన కాశీనాథయ్య- రాజరాజనరేంద్రునకు గురువు- కాబట్టి ఈయన క్రీ. శ 930 ప్రాంతముననుండెను. ఈ కాశీనాథయ్య వంశమువారే కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావుగారు [1]

శ్రీపతి పండితుడు- తెలుగున కవి- బెజవాడలోని యుద్ధమల్ల శిలాశాసన మీతని రచన.

శివలెంక మంచెన

ఈతడు పండిత త్రయమున ద్వితీయుడు- విష్ణువు స్థితికర్త కాడని విష్ణువుచే శివునికి మ్రొక్కించిన మహనీయుడు- ప్రస్తుత శివతత్త్వసారమున లేకున్నను- నీతనిని సహస్రగణమాలికలో చేర్చి- పండితారాధ్యులు స్తుతించిరి- కాబట్టి ఈతడు పండితునికన్న ముందువాడు. క్రీ శ. 1030 ప్రాంతమువాడు-

[1] శ్రీపతి పండితుండు- తెనుగు కవుల చరిత్ర.

వీరి వంశీయులే ప్రస్తుత మాంధ్రపత్రికా భారతీ సంస్థల యధ్యక్షులు శ్రీ శివ లెంక శంభుప్రసాదుగారు.

ఈ యిరు పురి వెనుక, శివుడు, కేవల లయకారుడే కాక సృష్టి, స్థితి, లయములకు మూడింటికి నధినాథుడని నిగమాగమ ప్రమాణములచే నిరూపించి, యారాధ్య సంప్రదాయ ప్రవక్తయైనాడు- పండితారాధ్యులు.

## బసవ వాఙ్మయము

బసవనను గూర్చి బసవన ప్రవర్తింపజేసిన భక్తుల చరిత్రలను గూర్చి మొదట తెలిపినవాడు పండితారాధ్యుడేయని మనము గ్రహింపవలెను- ఈనాడు సాహిత్య ప్రపంచములో, బసవ వాఙ్మయమునకు మూలపురుషుడు పాల్కురికి సోమనాథుడని యందఱెఱిగిన విషయమే- అయినను ఆ సోమనాథునికి బస వని యందు భక్తి నంకురింపజేసినవి శివతత్త్వసారమునందలి యీ క్రింది మూడు పద్యములునని తెలియవలెను

"అసమేక్షణ! శివభక్తుం
డసమశ్రేష్ఠుండనిపలికి- యన్యులతోడన్
పొసపోరై బండారువు
బసవన విషమెత్తి త్రావి బ్రదుకండె రుద్రా- 431 ప.

వసుధ నుమేశుండె దైవము
ప్రసాదము పవిత్ర మీశుభక్తులె కులజుల్
పొసపోరని బండారువు
బసవన విసమెత్తి త్రావి బ్రదుకండె రుద్రా! 432 ప.

కుసుమశరారీ! శివలిం
గ సమేతులుదక్క బొందగ దని నిర్మా
ల్య సుఖంబని బండారువు
బసవన విసమెత్తి త్రావి బ్రదుకండె రుద్రా? 433 ప.

సోమనాథుడు తన ప్రథమకృతియగు 'అనుభవసారము' రచించు నాటికి బసవనను గూర్చి యెఱుగనే యెఱుగడు. అందు పండితారాధ్యుని మూడు పద్య ముల స్తుతించినాడు బసవన ప్రశంసలేదు- ఆతడు పండితుని కృతులలో శివతత్త్వ

సారము జదివిన వెనుక, బసవనియందు భక్తి మొలకెత్తి, యావెనుక నతనికి బసవని కథ కావ్యరూపమున చిత్రించుటకు నుత్సాహము పొడమినది. పండితారాధ్య శిష్యుడను, తనకు గురువగు కరస్థలి విశ్వనాధ దేశికుని తండ్రియునగు నిపటూరి సోమనాధయ్యగారివలన బసవను గూర్చిన కథలు విని యావెనుక, బసవనగూర్చి లోకములో వాడుకలలో గేయముల నాధారముగ జేసికొని తెలుగున ద్విపదములో రచించెను. "బసవ పురాణము" అందాతడు, బసవన సమకాలికులును పూర్వులురగు పెక్కు భక్తుల చరిత్రలు చెప్పెను. ఆ వెనుక నాతడన్నియు బసవసంబంధములగు కృతులే రచించెను.

వృషాధిపశతకము - బసవా బసవా బసవా వృషాధిపా అను మకుటము
బసవలింగ శతకము - 'బసవలింగ' అను మకుటముగల సీసపద్య శతకములు (400 పద్యములు)

బసవోదాహరణము - (సంస్కృతము)
(తెలుగు)

అక్షరాంకగద్య-
అక్షరాంక పద్యములు-
పంచ ప్రకారగద్య-
అష్టోత్తర శతనామగద్య-
శరణు బసవగద్య-
బసవాష్టకము-
వృషాధిపస్తుతి-

తెలుగు భాషలోనేకాక బసవనపుట్టి మతవ్యాప్తిచేసిన కన్నడదేశమునకు బసవవాఙ్మయమును ప్రసాదించినవాడు సోమనాథుడే- అతని బసవపురాణము, కన్నడముననేగాక, తమిళమున, సంస్కృతమున గూడ పరివర్తితమైనది-

తెలుగున బసవనిగూర్చిన, బసవపురాణ, పద్యకావ్యములు యక్షగానములు, ద్విపదలు- శతకములు- వీని యన్నింటికి మూలము తెలుగు ద్విపద బసవపురాణమే-

బసవ సంప్రదాయమునకు జెందిన భక్తవర్గములో కొందఱి చరిత్రలు- ప్రశస్తప్రబంధ కృతులుగా వెలసినవి- వారిలో ముఖ్యులు-

## చిఱుతొండనంబి

శివభక్తకోటులకు- తన ఏకైకపుత్రుని, సిరియాలుడను చిఱుతవాని ఖండించి, ఈశ్వరునకు నర్పించిన చిఱుతొండనంబి, కథశైవ వాఙ్మయమున చాల ప్రచారము బడసినది-

సోమనాథుడు బసవపురాణమున 4వ యశ్వాశమున 154 ద్విపదలో చెప్పిన కథను, శ్రీనాథకవి సార్వభౌముడు. హరవిలాసమున మొదటి రెండాశ్వాసములలో 173 పద్యములలో చిన్నకావ్యముగా రచించియున్నాడు- ఆవెనుక వ్రాసిన పద్యకృతులలో గరికపాటి తమ్మయ్య శిరియాళు చరిత్ర చాల ముఖ్యమైనది ఆవెనుక ద్విపద యక్షగాన కృతులు, చాల గలవు.

## కన్నప్ప కథ

బసవ పురాణమున తృతీయాశ్వాసమున 560 ద్విపద పంక్తులలో నున్నది బసవపురాణమున భక్తుల చరిత్రలో కన్నప్ప కథయే పెద్దది-

కన్నప్ప కథను కంచిరాజు సూరయ ప్రత్యేక ప్రబంధముగా రచించెను. కాని యది యలభ్యము- ఒక పద్యము మాత్రము దొరకినది [2] ఆతడు మహా ప్రసిద్ధమైన- ధూర్జటి.

శ్రీకాళహస్తి మహాత్మ్యమున

కన్నప్ప కథ. ద్వితీయాశ్వాసమున. నద్వితీయముగ వర్ణితమైనది-

## కుమ్మరి గుండయ

ఈ భక్తుని కథ 366 ద్విపద పంక్తులలో బసవపురాణమున 4వ ఆశ్వాసము నున్నది. దీనిని అమలాపురపు సన్యాసి యను కుమ్మరి కవి మూడాశ్వాసముల ప్రబంధముగా రచించెను. *

---

[1] ఇది యముద్రితము- మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నన్నది.

[2] ప్రబంధ రత్నావళి.

## ఒడయనంబి కథ

తెలుగునందేకాక, తమిళమునందును ప్రఖ్యాతమైన శివభక్తుని కథ ఒడయనంబిది– ఈతనికే సుందరమూర్తి నయనారని పేరు– ఈతని కథను బసవపురాణమునను పండితారాధ్య చరిత్రమునను సోమనాథుడు వ్రాసియున్నాడు- పండితారాధ్య చరిత్రమున పూర్తికథ ౩౫౮ ద్విపద పంక్తులలో జెప్పి బసవపురాణమున భక్తిగర్వముతో వర్తింపజేయకూడదను శైవధర్మము దెలుపుటకు సోమనాథుడు దీని నుదహరించెను- ఈకథను మూడాశ్వాసముల తెలుఁగు ప్రబంధమును "ఒడయనంబి విలాసము"

అనుపేర అజ్జరపు పేరయలింగకవి రచించెను- దీనినే యక్షగానముగా

## గురునంబి చరిత్ర

అనుపేర రెగళ్ళ నిమ్మనాథుడు- రచించెను **

## కరికాల చోళరాజు

ఈతని భక్తివిశేషమును పండితుడు- రెండు పద్యములలో నిట్లు ప్రశంసించియున్నాడు.

స్థిరభక్తి యుక్తి దృఢమున
నరుదుగఁ దానిలిచి భక్తుఁడను దయఁగంచిం
గరికాలచోడ నృపతికి
గురియింపవె పసిడివాన గోరినభంగిన్-

మదివిను మొరుల విధులకుం
గురియించెనె మెచ్చి లోకగురుఁడీశుడు మా
కరికాలచోడ నరపతి
గురుభక్తికి పసిడివాన గురియించు క్రియన్-

కరికాలచోడని భక్తివిశేషముననే బంగరువాన కురిసిన విషయము క్రీ. శ. 1224 లో ఓపిలిసిద్ధి శాసనమున నున్నది.

---

* అముద్రితము. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార సంఖ్య.

** అముద్రితము.

తిక్కన నిర్వచనోత్తర రామాయణావతారికలో నీవిషయముకలదు, పోలిసెట్టి లింగన నవచోళ చరిత్ర ద్విపదలో కరికాలచోళని కథ కలదు *

బెజ్జ మహాదేవి

మాతృప్రేమ మొదటిసారిగా తెలుగున ప్రపంచితమైనది బెజ్జ మహాదేవి కథయే- బసవపురాణమున 92 పంక్తులలోనీ కథ యున్నది–

## సకలేశుమాది రాజయ్య

ఈతడు ఆరువందలయేండ్లు జీవించెను. ఇతని మహిమ 210 పంక్తులలో వర్ణితము-

ఇవి తృతీయాశ్వాసములో నున్నవి–

మడివాలు మాచయ్య
కిన్నెర బ్రహ్మయ్య
ముసిడి చౌడయ్య
మొఆటద వంకయ్య
మాదర చెన్నయ్య

వీరి కథలు చతుర్థాశ్వాసమున గలవు–

తెలుగు జొమ్మయ్య
కెంబావి భోగయ్య
సురియ చౌడయ్య

వీరి కథలు- పంచమాశ్వాసమున గలవు.

వైజకవ్వ
శంకరదాసి
వీరశంకరుడు
శివనాగమయ్య

వీరి కథలు- షష్ట-సప్తమాశ్వాసములందున్నవి-

* ఈ గ్రంథ మాంధ్ర గ్రంథమాలలో క్రీ. శ. 1923 లో ముద్రితమైనది.

ఓహుళుడు
కదిరె రెమ్మయ్య
కుమారపాల ఘూర్జరుడు.

వీరి కథలు, పండితారాధ్య చరిత్రలో జనసనగూర్చి చెప్పిన సందర్భములో నున్నవి.

## ఛందో విశేషములు

శివతత్త్వసారమునందున్నపద్యములు కందములే. అవి లక్షణముకైన నడక గలిగియున్నవి. నన్నయవలె, మల్లికార్జున పండితుడును నాల్గవపాదమున 'జగణము' గల కందములను వ్రాసియున్నాడు. 50. 56, 70, 93, 103, 122. 124, 145, 151, 186, 234, 236, 247. 264, 322, 340, 349, 362, 378, ఈ పదునేనిటియందు నాల్గవపాదములు జగణములో నున్నవి.

70, 110, 170, 216. 244 ఈ పద్యములలో రెండవపాదమున 'జగణము' గలదు,

### యతులు

#### వలపలగిలక యతి

ఈయతిని లాక్షణికులుగాని, ఛందశ్శాస్త్రమును గురించి పరిశ్రమచేసిన వారుగాని చెప్పని పై 'వలపలగిలక యతిని' నేను తొలుత ప్రతిపాదించితిని, * కాని విమర్శకులు దీనిని గమనించినట్లు లేదు. దీనినిగూర్చి విశేషముగా వ్రాయదగియున్నను సంగ్రహముగా తెలుపుచున్నాను.

ఒక సంయుక్తాక్షరము. మొదటి హల్లు రేఫగానుండి రెండవది మరి యొక హల్లుగా నున్నప్పుడట్టి సంయుక్తాక్షరమునకు రేఫలేని రెండవ యక్షరముతో చెల్లించుట 'వలపలగిలక యతి' యని చెప్పవచ్చును. ఇది మన లేఖన సంప్రదాయమునను సరించినదే. రేఫకు లేఖన చిహ్నము గిలక. ప్రాతవ్రాతలలో నిది నియతముగా పాటింపబడుచుండెడిది, అనగా 'ధర్మ' అను రేఫ ం

* భాషాశాస్త్ర పరిశోధన యతిప్రాస తత్త్వము. Annals of the Oriental Research of the University of Madras Vol. XV 1958-59. P. 21-25.

యుక్తాక్షరము వ్రాయవలసివచ్చినపుడు 'ధమ్మ్ర్గ' అనియే లిపి యుండెడిది- 'ధమ్మ్ర్గ' అననప్పుడు మకార ద్విత్వమే మనకు శ్రవణగోచరమగునుగాని రేఫ సంయుక్త మకారము వినిపించదు- ప్రాచీన కవులీ శ్రవణ సుభగత్వమును గ్రహించి. ద్విత్వాక్షరముననే యతి పాటించియున్నారు. నన్నయ, నన్నెచోడ కవి, పాల్కురికి సోమనాథుడునీ నియమము విధిగా పాటించియున్నారు- మల్లికార్జున పండితుడును నీ శివతత్త్వసారమునసీ నియమము పాటించి యున్నారు. నన్నయ భారత భాగమునుగూర్చి వారెవ్వరు దీనిని స్పృశించి యుండలేదు-* నన్నెచోడని కుమారసంభవమునందలి డెబ్బది స్థలములలో నీయతి నిరూపించితిని.** ఇక నీ గ్రంథమునుండి యుదాహరణములను చూపుదును-

1. పశుప । ర్వాశభవ......వచ్చునె యెందున్- 26 పద్యము
2, మదిని । ర్గుణము......కుశలంబగునే- 68 ,,
3 ని । ర్ణయరహిత......నాయక భక్తుల్ 191 ,,
4. ద । ర్మనియోజిత........మానుగ 230 ,,
5. సూ । ర్యమండలము....యాడుదురు 340 ..
6. ని । ర్మలమతి ...... మానుగ 463 ,,
7. మూ । ర్తిధ్యానము...దేవార్చరున్ 486 ,,

పైని యన్నిచోట్ల — ముందు రేఫ సంయుక్తాక్షరములుగా చూపినవి వ్వ. న్న, య్య. మ్మ త్త - అని వ్రాతలలో నుండును-

ఈ గ్రంథమున 87వ పద్యమున పూర్వముద్రణములో నిట్లున్నది.

క. భువనోత్పత్తి స్థితిలయ
వివిధ వ్యాపారముఖ్య విభుడవు బహుబం
ధవిమోక్ష దక్షుడవు స
ర్వవర ప్రదుడవు ప నీవు రాజాభరణా-

ఇది పై యతి నియమమునకు భంగము. ఈ పద్యముక్రింద పుట యడుగున 'వరప్రదుడవు' అను పాఠమీయబడియున్నది.

---

* నేనిట్టి యతుల నన్నింటిని సేకరించితిని.

** చూడుడు. వావిళ్ల ముద్రణము. 1952-వ పీఠిక,

పరిష్కర్తలు వ్రాతప్రతిలో లేని 'సర్వ' శబ్దము పద్యమునచేర్చినారు. ఈ క్రిందనిచ్చిన పాఠమే సరియైనది- పద్య మిట్లుండదగును.

క, భువనోత్పత్తి స్థితిలయ
వివిధ వ్యాపార ముఖ్యవిభుఁడవు పశుబం
ధవిమోక్ష దక్షుఁడవు (ను) వ
రవర ప్రదుఁడవును నీవు రాజాభరణా.

ప్రస్తుత ముద్రణము నిట్లేయున్నది.

96వ పద్యమున- రెండవ పాదమున యతి యిట్లున్నది.

అంచితమతి నెవ్వరు ని
ర్మించెరె గుంచిత సురలు నివృత్త్యాది కళా
పంచక-................

ఇచట - నిర్మింౘెరె - అనుదానికి - నివృత్త్యాది - అనుదాని యతి నియమభంగమైనది. 'నివృత్త్యాది'కి బదులుగా 'నిమిత్తాది' అని యున్న సరిపోవును- కాని శైవుల కళాపంచకమున 'నివృత్తి' యే యున్నది గాని 'నిమిత్తము' లేదు. దీనికి కన్నడానువాదము లభ్యము కాలేదు- కాన నట్లే యుంచితిని.

ఇతరయతులు — క్షకారయతి.

క్షకారమునకు— 'క'కారముతోడను. సకారములతోడను యతులు గలవు.

నన్నయలో ఒక్క 'క'కారముతోడనే యతి—

| | |
|---|---|
| ద్రా। క్షుమాలికా......కారద్వైతుల్ | 56 ప |
| య। క్షుదుఁడై ..........వికార | 85 ప |
| సా। క్షిక...............కీర్తన | 242 ప |
| దీ। క్షితులెల్లను..........కృతు | 229 శుద్ధపత్త్రిము చూడుడు |
| ద్ది। క్షిత.................కృతి | 229 |

ద్రాక్ష విభూతి..............సన్మతి 126 ప

క్షితి..........................శివభక్తులు 177.

ముకారయతి.

ము. విభక్తి యతియేగాని పోలిక యతిలేదు.

బోరన కర్మాను రూపమున జపలకగున్. 34 ప

పురహరుఁ గొలుచునది చిత్తమున విడిచివెసఁగ 232 ప

## అఖండయతులు

1. తార్కాణంబది యేలసేయ ర ద్వైతులజా. 47 ప.
2. సూక్తిఁ బ్రధానమ్ముగాఁ బసూత్తముల కజా. 99 ప
3. వేఁదోక్తముగ నెఱుంగవలయుఁ దుదిని మహేశా. 100 ప.

* "తస్మాద్గ్రాహ్యాం

బనియమ గలదనిరి వేదభక్తి విధిజ్ఞుల్. 115 ప.

## ప్రాస విశేషములు

### వలపలగిలక ప్రాస

పైన వివరించిన వలపలగిలక యతివలె ప్రాసను ప్రాచీన కవులు పాటించిరి. అనగా రేఫ సంయుక్తాక్షరమునకు. సంయుక్తహల్లు ద్విత్వమునకు ప్రాస పాటించుట యని తెలియవలెను. వలపలగిలక యతి విషయమున, నన్నయ, నన్నెచోడాదికవులయందు సమాన నియతిగలదని నిరూపించితిని. గాని ప్రాసవిషయమున భేదించినది- నన్నయ ప్రాసలలో వలపలగిలకవలన. యేర్పడిన ద్విత్వమునకు సహజముగా శబ్దమునందుగల ద్విత్వమునకు ప్రాస యుండదు.

---

* ఇందలి సంస్కృతాంధ్రభక్తి సంకీర్ణతనుబట్టి కీ. శ. వర్ఘులవారు- శివతత్త్వసారమున- అఖండయతులు లేవని వ్రాయుటయేగాక- పై పాఠమును- "బనియునుగలదనిరి భక్తియాగవిధిజ్ఞుల్"- అని దిద్దిరి. (భారతి- సం, 38 సం. 1 కలగూరగంప). ఆపైని నేను, కర్మకాండను విడిచిన శైవులకు 'యాగ మెక్కడినుండి వచ్చినదని విమర్శించితిని- (భారతి- సం. 38 సం. 2 పుటలు 78-85

ఉ. * తూర్పరుణంబు... తూప్పఁరుణంబు
మాఱ్పుము... మాప్పఁము
లాఱ్పగ... లాప్పఁగ
నేర్పడ... నేప్పఁడ
(ఆది 6-212)

అని నాల్గుపాదములో నొక రీతిగా నుండుస - అంతియే కాని తూప్పఁరుణంబు.

తప్పక - అని యీరీతిగా నుండదు,

ఇక శివతత్త్వసారములో నట్లుగాగ యీ ప్రాస యీ క్రింది మూడు పద్యములలో వాడబడియున్నది.

క. ఇవ్వసుమతిఁ గ.డ.,ఁ థమ్మని
వువ్వులలోఁ బుట్టినట్టి
సర్వజ్ఞభక్తి విరహితుఁ
డెవ్వఁడు నుత్కృష్ట జాతుఁడేటికి గొఱయే 196 ప.

ఇచ్చట మూడుపాదములలో 'వ్వ' యని శబ్దగత ద్విత్వమున్నది. మూడవపాదమున 'సర్వజ్ఞ' అనునది 'సవ్వఁజ్ఞ' అను పలపలగిలక లేఖనము వలన నేర్పడినది.

ఇట్లే మఱిరెండు పద్యముల యందున్నది.

క. కర్మఫల
న్నిర్మాత...పశుప్రా
తమ్ముల...క్రియ
లిమ్ముగ.,,. 317 ప.

క. నమ్మిన....
బన్మయ....లో
కమ్ముల....య
ధర్మంబుల..,.

---

* ముద్రిత భారత పాఠములలో తూర్పరుణంబు- అని యిట్లు నాలుగుపాదములయందును లఘురేఫతో ముద్రితమగుట సరికాదు.

ఈ పద్యములో 'మ్మఁ' 'మ్మఁ' 'మ్మఁ' అను వలపలగిలక నమసరించి ప్రాస సరిపోయినది.

తిక్కనయు నిట్టి ప్రాసములు ప్రయోగించియున్నాడు.

* క. ద్యూతక్రీడకుఁ గొండొక
నేతున్..... భార. విరా 1-171.

ఇచట నేస్తున్ - అనునది వలపలగిలక లేఖన సంప్రదాయమున - నేత్తున్ - నేతన్ - అని యగును -

** క. కాచికొని వచ్చి తగనా
నేచిన యట్లచట నిచట నిలిచితి. భార. మేసల 315 ప.

ఇక్కడ నేర్చిన - నేచ్చిన - నేచిన - యని రు పాంతరములు.

పై రెండిటిలో మొదటి దానిని గూర్చి - పూర్వ ముద్రణ పీఠిక (50 పుటలో) లక్ష్మణరావుగారిట్లు వ్రాసియున్నారు.

"నేతుఁన్" అని విరాటపర్వమునందు దప్పు ఛాపలో వ చ్చియెచ్చుటను గానరాదు.

కాని "నేతుఁన్" అను రూపమునకు ప్రయోగము లున్నవి.

ద్వి. సీతలంపిప్పుడు ..
నేతునే. . నిర్జరనైరి.

రంగనాథరామాయణము— పుట 344. (ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రకటితము)

క. నేతును మంత్రము లంపఁ
నేతును తద్రిపుల ప్రేవులీ రణమునకున్.

(ప్రబంధరాజ విజయ వేంకటేశ్వర విలాసము. గణపవరపు వెంకటకవి 778 వ.)

ఈ ప్రాస విశేషమునుగూర్చి తొలుత తెలిపినవారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రాసములలో హల్ సామ్యము ప్రధాన లక్షణమే యైనను,

నన్నయాదులు సరిగా హల్ సామ్యము పాటించిరనియు నన్నెచోడాది శివకవులు "కతిపయహల్ సామ్యము"న్న యెడల నది సరిపోవుననియు, కన్నడ కవిరాజ మార్గమున- 'శాంత ప్రాసము'ను పేర దీనికి లక్షణమున్నదనియు నాలక్షణము నిట్లు చూపిరి.

పత్తిప్రమాద ఫలక
సత్యుగ్రహా
మత్త రత్నాకర
పుత్రికె.

మఱియు దీనిని గూర్చి దీర్ఘ విచారణ చేసి- శివకవులీ కన్నడ లక్షణము ననుసరించి యిట్టి ప్రాసము వాడిరని వ్రాసిరి. *

కాని శివకవులిట్టి శాంతప్రాసముగాని కతిపయహల్ సామ్యమున్న వాటిని గాని వాడలేదనియు వారు వాడినవి, ఆయా హల్లులు ఉచ్చారణలో తేలిపోవుటచే, ప్రాస సరిపోవుననియు- నీక్రింది యుదాహరణలు చూపితిని. తద్భవములయందు యకార రకారములెట్లు తద్భవములలో సమ్మేళము జెందునో అందు పూర్తిగా నిరూపించితిని.

యకారము, రకారము పరస్పరము మాఱుశబ్ద తత్త్వములుగలవి- కావున ప్రాస మైత్రి సరియే.

మర్త్యలోకమునకు
కర్తయున్నాడె
ఇచ్చట నుదర్యన్
కఱ్ఱ-అని యున్న సరిపోవునుగదా.

ఇట్లే కవిత్రయము ననసరించిన నాచన సోమనాథుని యందునగలదు.

* నాతో మార్కొనరేరు
నీ త్రైలోక్యమునందు.

---

* బసవ పురాణ ప్రథమ ముద్రణ పీఠిక. పుట 90.91.

** పూర్వోక్త వ్యాసము- భాషాపరిశోధన యతిప్రాసతత్త్వము,

* దీని నప్పకవియే యుదాహరించియున్నాడు,

శివతత్త్వసారమున నిట్టిది గలదు

క. ఆకాశము వొడలె ....
భూకంపంబైన ....
వ్యాకులమైన. ..శి
వైక్యుడు నినువిడిచి.... 161

పైనిచెప్పిన రీతిని నిచ్చట—య—తేలబలుకునదిగావున ప్రాస సరిపోయినది.

## వ్యాకరణ విశేషములు

1. రేఫ సంయుక్త గురులఘు నిర్ణయము—

నవీన వైయాకరణులు— రేఫ సంయుక్తపరమగు నక్షరము కొన్నిచోట్ల లఘువుగా నుచ్చరింపఁబడుననియు— ప్ర, హ్ర— ఈ రెండింటిని గురువులుగాను, లఘువులుగాను ఉచ్చరింపబడుననియు, తక్కినవాని నట్లు లఘువులుగా నుచ్చరింపకూడదని చెప్పుదురు.

ఉదా॥ "ఉదయ ప్రభావమున — ఇచ్చట 'ప్ర' గురువు".
ముని ప్రవరు — ఇచట 'ప్ర' లఘువు లేనియెడల గణభంగము.
ఈ హ్రదమున — ఇచట 'హ్ర' గురువు
దఘ్న హ్రదమున — ఇచట 'హ్ర' లఘువు. లేనియెడల గణ భంగము

శివతత్త్వసారమున నిందుల కపవాదముగ నీక్రింది ప్రయోగమున్నవి.

"క్రియలుడిగి....
.... .... ....
.... .... పా
పయుతాత్ముం డాతఁ డుభయభ్రష్టుఁడు రుద్రా. 247 ప.

ఇచట "ఉభయభ్రష్టుఁడు" అనుచోట 'భ్ర' తేలిపలకనియెడల గణభంగ మగును—

2 ఉదంత తద్ధర్మార్థక సంధి—దీని క దాహరణముగా వ్యాకరణము లలో "వెడలగ్నిదీప్తులు" అను హింసవింశతి ప్రయోగము చూపబడినది. కాని ప్రాచీనకాలమునందే యిట్టి సంధిగలదు.

నరకంబుల బొందనాథ నాథ మహేశా. 147 ప.

అని యిందుగలదు. "బొందునవాథ" అని యుండవలెను. కాని సంధి వశమునట్లు రాలేదు—

పాల్కురికి సోమనాథుడును నిట్టివి ప్రయోగించెను.

కొల్చు నురగసంఘములు అనుటకు కొల్చురగసంఘములు బస ప్ర. 3ఆ,

పదమూడవునేటి— పదమూడవేటి 4ఆ.

ఒప్పారునివటూరి— ఒప్పారివటూరి పండి. 5ఆ.

ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము—పుట 63.

3. అను కరణసంధిని తెలుగు విభక్తి సంకీర్ణత—

సంస్కృత వాక్యములను తెలుగు భాషలో చెప్పునప్పుడా వాక్యాంత పదము సంస్కృతవిభక్తితో నుండవలెను గాని తెలుగు విభక్తితో నుండరాదు.

ఉ. దాసోహమ్—అనె—దాసోహమ్మనె— దాసోహమనె - ఈ వాక్యమున దాసోహమ్మనె—అనెడుసంధి— దాసోహమే + అనె పదములకలయికచే 'దాసోహమ్మనె' అయినది. అప్పుడు సంస్కృత విభక్తియే నిలిచినది. ఈ గ్రంథమున దీనికపవాదముగా.

కొనునది భిక్షునిచేతన
ధనమతని—కి—ని—చ్చునదియు "తస్మై దేయం"
బనియును "తస్మాద్గ్రాహ్యాం"
బనియును గలదనిరి వేదభక్తి విధిజ్ఞుల్ 105 ప.

ఇచట చివరపాదమున 'తస్మాద్గ్రాహ్యామ్' అను సంస్కృత వాక్యమునకు పై రీతిని అనియు చేర్చినప్పుడు— "తస్మాద్గ్రాహ్యామ్మనియు" అని యుండవలెను.

అట్లున్న యతి చెడును. "మ్మనియును గలవనిరి వేదభక్తి విధిజ్ఞుల్" కాబట్టి తెలుగు విభక్తిరూపమగు 'ఁబు' వచ్చి- 'గ్రాహ్యంబనియును' అయినది. అప్పుడు బ-భలకు యతి సరిపడినది. దీని ననుసరించి సోమనాథుడును "యథా శివమయో విష్ణుఁడన్నామాట" యని ప్రయోగించియున్నాడు.

శివాద్రోహుడు నరకగామియగును మహేశా !

ఇచట- శివ + ఆద్రోహుడు అని పదచ్ఛేదము, ఇచట శివ అనునది సంబోధన-కనుక యిచ్చట సంబోధనాంత సంధి ఇది యిప్పటి వ్యాకరణముల ననుసరించి సరికాదు,

4. ప్రథమావిభక్తి ప్రత్యయలోపము.

1) "జనుఁలెల్లఁజూడ మలహాణు
నీను సంస్తుతిచేసి" 415 ప.

ఇచట "మలహాణుడు" లో 'డు' లోపము.

2) శివ నిందారతివిని
తను విడిచిన గౌరీసతి. 474 ప.

ఇచట 'తనువు' లో 'వు' లోపము.

3) పరమాణుల యంతరంబు. 42 ప.

ఇచట 'పరమాణువుల'లో
'వు' లోపము.

5) ఈ క్రింది తత్సమరూపములు కానబడుచున్నవి,

మనిషి (104) తాత్పర్యుడు (167) పాషండి (261) బహురూపులు (341) ఉల్కాశబ్దమాకారాంత స్త్రీలింగము- ఉల్క, ఉల్కయనియే యుండవలెను. కాని యిందు ఉల్కము (332).

'ముద్రికలు' 336) అను శబ్దమిందు, ముద్రియలుగా ప్రయుక్తమైనది. నన్నెచోడడిట్లే- విటికలు. అను శబ్దమును విటియలుగా యతిస్థానమున వాడియున్నాడు. మల్లిక, మల్లియ శబ్దమిట్టిదే.

6) విశేషణములను విశేష్యములుగా వాడుట.

తొంటి శ్రేష్ఠము (135)

సంపన్నాభ్యంత (251) 'సంపత్త్యభ్యంతర' అని యుండవలెను.

7) పిండకూడు 197) దర్భశ్రాళ్ళు (303) రావీధి (441) అను మిశ్రసమాసములు గలవు.

8) అవిలేవగుటనే. (41) అను క్రియారూపవిశేషము కన్పట్టును. ఇది నన్నయ- నమ్మనేరనయ్యెద- వంటిది.

9) శిథిలద్విత్వము- తెలుగు వ్యాకరణములలో దీని ప్రస్తావన లేదు. కన్నడ వ్యాకరణములలో నున్నది-

ఒండు సితమున. (296) ఒండు చిత్తమున- వేఱొక చిత్తమున- వేఱొక మనస్సుతో- అని యర్థము.

ఇచ్చట చిత్తము- అను దానిలో 'త్త' శిథిలద్విత్వము- అనగా ద్విత్వాక్షరము తేల్చి పలుకవలయును.

10) ఒండు సితమున- అనుచో సంఖ్యావాచకముపై గసడవాదేశము వచ్చినది- వసుచరిత్రమున 'ఒకదన్వి' అను ప్రయోగము కలదు.

పై విశేషములన్నియు నేటి వ్యాకరణముల కేక్కుదగియున్నవి.

## పండితారాధ్య ప్రశస్తి

### పాల్కురికి సోమనాథుడు

"శ్రీ శైవ సమయదేశిక చక్రవర్తి
పాశవిమోచన పటుకళామూర్తి
శుంభద్దిగంత విశ్రుత సితకీర్తి
శాంభవ దీక్షాభిజ్ఞానువర్తి
ఉత్తమోత్తముడు సంయుత వీరభక్తి
వృత్తచిత్తుడు చతుర్వేదార్థవేత్త

గహన సంస్కృతిశిరః ఖండన హేతు
మహిత పంచాక్షరీమంత్ర సిద్ధుండు
వేదాగమ పురాణ విహిత శాస్త్రోను
పాదిత రుద్రాక్షభసిత భూషణుఁడు
యమనియమాది వ్రతాచారసార
శమదమోత్కృష్ట నిష్ఠాగరిష్ఠుండు
అంతర్బహిర్ధ్యానయ జనవంతుండ
వాంశరయ్య యసంగ హారగణాధ్యుండు
వారి శిష్యుండు దుర్వార సంసార
దూరవీర వ్రతోద్ధుర వర్తనుఁడు
శైవ ధర్మోత్తమాచార్యుండు సతత
దైవంబు నద్వైత తత్త్వతత్పరుఁడు
న్యాయ వైశేషికోదాత్తశాస్త్రోను
పాయదర్శన పరిపాలన క్షముఁడు
స్వకృతాపలోక నోత్సారిత శిష్య
నికర మలత్రయ నిరసితేంద్రియుఁడు
తంత్రాధిగత వీరతంత్ర స్వతంత్ర
మంత్రాధిగత రాజమంత్ర సిద్ధుండు
వేదవేదాంత వివిధ పురాణోప
పాదిత రుద్రాక్ష భసిత భూషణుఁడు
పండిత నతపాద పద్ముండు సుకవి
మండలి విబుధ సమాజ పూజితుఁడు
ఆరూఢ కీర్తిశుఁడగు కోటిపల్లి
యారాధ్యులనఁగ లోకారాధ్యమూర్తి
అసమతదీయ లోకారాధ్య శిష్య
విసరాగ్ర గణ్యుండు వీరవ్రతుండు
చను, "నరుద్రోశాత్ర సంశయో" యనగ
జనియించినట్టి సాక్షాద్రుద్రమూర్తి
పశుయోగవాదాది పరవాది విసర

విశసన ప్రత్యక్ష వీరభద్రుండు
దండితాఘుఁడు జగత్పావనకార
ణుండు విశ్రుత జగన్నుత సితకీర్తి
అధిక శాపానుగ్రహ సమగ్రబలస
మధిగత దివ్య పంచాక్షరీవేత్త
వానదూకానీక వాగ్బంధన క్రి
యావిశారదుడు లోకారాధ్యమూర్తి
పరగి "శైవేదశ ప్రత్యయోయనఁగ
పరువడిజను దశప్రత్యయాన్వితుఁడు
ధన్యుండు దేశకోత్తముఁడు లోకైక
మాన్యుండు పండిత మల్లికార్జునుఁడు."

—పండితారాధ్య చరిత్రావతారిక

"శ్రీ మద్గౌతమ గోత్రజున్ గురువరున్, శిష్య ప్రశిష్యాన్వితున్
కామాది ప్రబలఘ్ను బుజ్నిగమ శాఖాధ్యక్షునిన్ పండిత
స్వామిం వంశగురుండుగాఁబడసె శైవజ్ఞాన సంసిద్ధిచే
భూమింబావన సంప్రదాయమగుచున్ బొల్పొందె విఖ్యాతితోన్"

—ములుగు మృత్యుంజయారాధ్య కవి

"శ్రీ మచ్ఛైవ రమావరున్ నియమిత శ్రీ చెన్న మల్లేశ్వరున్
ధీమంతున్నిగమాగమ స్మృతిమతోద్గీతార్థవేత్తన్ బుధ
స్తోమస్తుంబ్రభు నూర్ధ్వనేత్రు సుగుణాఢ్యుం బండితారాధ్యులన్
గామింతున్ నుతియింతు భక్తిఁదలఁతున్ గామ్యార్థ సంసిద్ధికై"

—పసవుల నాగయయాని

ద్విపద "వెరసి దాక్షారామ భీమేశ్వరమున
హరుఁడయో నిజరూపమై యున్నవాని
వెలనాటి నృపుఁడాది వివిధ దూషకుల
విలయంబుగా జూచి విలసిల్లువాని

ఆరూఢిఁవగు మల్లికార్జున పండి
తారాధ్య దేవుని నమర సేవించి."

—వీరశైవాచార సంగ్రహము—పర్వతమంత్రి
లింగనామాత్యుడు

శ్రీ గురులింగంబు చిన్మయాంగంబు
యోగాతి తరంగంబు యోగి సంగంబు

.... ... ....

తగబడసిన పండితస్వామి గొలిచి,

—దీక్షాబోధ-పిడుపర్తి బసవన

గీ. పండితారాధ్య దేశికు, పాలకుర్తి
సోమనాథుని పిడుపర్తి సోమనాథు

—కూర్మ పురాణము- రాజలింగకవి

సీ.పా. శివతత్త్వ, శివ సేవ, చిన్మయ పటమూలు
శరభాంకు రాజశేఖరని వేము.

—నాగరఖండము-తురగా రాజకవి అయ్యంకి బాలసరస్వతి

సీ. పరవాది జీమూత పవనోగ్రమూర్తులఁ
బండితారాధ్యులఁ బ్రస్తుతించి
సాత్త్వక బ్రహ్మవిద్యా విలాస నిరసనము

—బుద్ధిరాజు పేరయ

"శివకవి పండితుఁడన నీ
యవనిం బేర్కొందుఁ బండితారాధ్యుని దు
ర్భవఘన క ధరవిదారణ
పలిన్ భవిదూరునెంతు భక్తిమెయి శివా

అవనిన్ శ్రీ శివతత్త్వసారమును బ్రఖ్యాతంబు గావించి సం
స్తవముల్ పెక్కలొనర్చి యాంధ్ర ధరణిన్ సత్కీర్తిగన్నట్టి ప

త్కవినిన్ బండిత మల్లికార్జునిని హృత్పద్మంబునన్నిల్పి. పా
ర్థివ లింగాకృతినొప్పు నిన్గొలిచెదన్ శ్రీ విశ్వనాథప్రభో."

—నిడదవోలు సుందరము

# సాహిత్యము

## మతసంప్రదాయము

మన ప్రాచీన సాహిత్యమంతయు మత సంప్రదాయికమైనదేయని విమర్శకులెల్ల రెఱింగిన విషయమే. అందునను ప్రత్యేకముగా నొక మతమును మత సంప్రదాయమును సిద్ధాంతీకరించి, ఆ మతప్రచారమునకు తోడ్పడిన గ్రంథములలో మతము— సాహిత్యము నవినాభావ సంబంధము గలిగియుండు ననుటలోగూడ నభిప్రాయభేదములేదు. అట్టి సందర్భములో నేడు మన సాహితీ విమర్శకులు మతమును వీడి కేవలము సాహిత్యమునే ప్రధానముగా చేసికొని విమర్శ సాగించుచుండుట సమంజసము కానేరదు.

నవీన సాహిత్యమున మతమునకు ప్రాధాన్యములేదు. ఇక మనకు స్వాతంత్ర్యము వచ్చిన వెనుక నది పూర్తిగ విస్మృతమైనదనియే చెప్పవచ్చును. కాని ప్రాచీన సాహిత్యమంతయు మత ప్రాధాన్యమైనప్పుడా సాహిత్య విమర్శనమున రెండింటికి సమ ప్రాధాన్యత యీయవలెను నేడట్లు జరుగుటలేదు సాహిత్య విమర్శనలో పాశ్చాత్య విమర్శనాపథకము ననుసరించి సాహిత్య దృష్టియేగాని సంప్రదాయిక దృష్టి లేనేలేదు దీనివలన నాంధ్ర విమర్శన పథకముననే దవ్యవస్థితమైయున్నదనుటలో విప్రతిపత్తిలేదు ఒకే దృష్టితో చేసిన విమర్శన పాక్షికముగాని ప్రామాణికము కాదుగదా. నేటి శైవమత వాఙ్మయ విమర్శకులందీ పాక్షిక దృష్టి యవ్యవస్థ స్పష్టముగా గోచరించుచున్నది.

శివకవుల గ్రంథములు— పండితారాధ్య, నన్నెచోడ, పాల్కురికి సోమనాథుని గ్రంథములు. మూడు దశాబ్దాలనుండి వాఙ్మయ ప్రపంచమున విమర్శనకు పాత్రములైనవి సాహితీ ప్రపంచమున స్థిరప్రతిష్ఠ నార్జించినవి. వారిపేర యొక యుగమే వెలసినది. అవి మొదట— వీరశైవమతప్రచారము కొఱకే రచితములైనను— వానియందు లోకోత్తరమైన కావ్య కళావిశిష్టత యుండుటచేత, సాహిత్యమున చిరస్థాయిగ నిల్చినవి— కాని యింతవఱకు వచ్చిన విమర్శనలన్నియు, కేవల సాహిత్య దృష్టితో చేసినవేగాని మత సంప్రదాయ దృష్టితోకూడ పరిశీలించి చేసినవి కావు. సమీచీనము, సప్రమాణికములైన సాహితీ విమర్శనకు, శైవ గ్రంథములపట్టున రెండును నత్యావశ్యకములే—

ఇంతేకాక, యీ గ్రంథములయందంతటను శైలి శైవమత సాంకేతిక సమ్మిశ్రిత మైనది. ఆమత సంప్రదాయములు తెలియకపోయినచో ఆ సాంకేతిక పదము లర్థములుగావు, ఇక పదములే యర్థము కానప్పుడు, భావమెట్లు తెలియగలదు? భావమే తెలియనియెడల కావ్యకవితా తత్త్వమెట్లు తేటపడగలదు? ఈనాడు మనకు మతమక్కఱ లేకపోవచ్చును. అంత మాత్రమున- విమర్శకులు ప్రాచీన సాహిత్యమునకు- గూడ నీసూత్రమువర్తింప జేయుదురా? ఇది సక్రమ విమర్శన పద్ధతి కానేకాదు.

ఇంకొక ముఖ్యవిషయము మన సాహితీ విమర్శకుల దృష్టి నింతవఱకు తాకలేదు- మతము సంఘమునకు సంబంధించినది- మన తెలుగుభాషలో వైదిక మత సంబంధ కావ్యములు భారతాదులున్నను, నవి, ఆర్యమత ధర్మ ప్రతిపాదకములు అనువాదములునగుటచేత, మన తెలుగుదేశ సాంఘికవ్యవస్థ నెంత మాత్రమును తెలపజాలనివైనవి- శైవమత గ్రంథములట్లుగాక, ఆంధ్రతా ముద్రగలిగి, ఆంధ్రుల సాంఘికవ్యవస్థను నామూలాగ్రముగా చిత్రించు స్వతంత్ర రచనలు- ఈ దృష్టితో చూచిన- శైవమత సంప్రదాయములు తెలుసుకొనుట విమర్శకుల కావశ్యకమే యగుచున్నది-

ఇతఃపూర్వము ప్రకటితమైన వానిలో శైవమతమును గూర్చిన ప్రశంస యున్నదిగాని- యది సాహితీ విమర్శకదృష్టితో చేసినదేగాని సంప్రదాయిక దృష్టితో చేసినదిగాదు- పరిష్కర్తలకా సంప్రదాయములు తెలియకపోవుటచేత- నందును, గొన్ని పొరపాటులు దొరలినవి- ఒకప్పుడట్లున్నను, నా గ్రంథములు పునర్ముద్రితములైనప్పుడు, వానిని సరిచేయుట తరువాతివారు చేయదగినపని యగుటచేత, శివతత్త్వసారము తొలిముద్రణమున మత సంప్రదాయములు వాని విమర్శయిట యిచ్చుచున్నాను-

## మత సంప్రదాయములు

ఆంధ్రదేశమందలి బ్రాహ్మణులలో నారాధ్యులన్న యొక తెగ గలదు. వీరు లింగమును ధరించెదరు. ఇట్లు బ్రాహ్మణులలో లింగధారణ చేసికొను నాచారము తెలుగు దేశమునందు దప్ప మఱి యెచటను లేదు* అఱవదేశము నందు బ్రాహ్మణులలో స్మార్తులనే శైవులందురు. అచ్చట బ్రాహ్మణేతరులలో

* కర్ణాట దేశమునందు గూడ నారాధ్యులు గలరు. కాని వారు పూర్వము తెనగు దేశము నుండి పోయినవారుగనే కానవచ్చుచున్నారు.

వీరశైవులు పెక్కురు గలరు. పెక్కు మఠములును, పండారములను, గురువులును గలరు. కాని, వీరు శివాధిక్యతను బోధింతురే కాని, లింగము కట్టుకొనరు. కర్నాటదేశమునందు బ్రాహ్మణేతరులందు మాత్రము లింగధారులు గలరు. వారిని లింగాయతు లనియెదరు. వీరిది బసవ సంప్రదాయము. తెలుగు దేశమందలి యారాధ్యులది పండిత సంప్రదాయ మనిపించుకొనును. ఈ రెండు సంప్రదాయములకును భేదమేమియన నారాధ్యులు శ్రుతిస్మృతులందుఁ బ్రమాణభావము కలవారలై, గృహ్య సంస్కారములను వేదోక్తముగ జరుపుకొనియెదరు. ఒక్క యంత్య సంస్కారమును, బ్రతి సంవత్సరము శ్రాద్ధమును నాగమోక్తముగ జరిపెదరు. జాతిని పాటించెదరు. లింగాయతులు వేదాదికములను మన్నింపరు. భక్తియె వారికిఁ బ్రధానము. తెనుగు దేశమందలి జంగములిట్టివారు.

జందెము తీసి జాతివిడిచి, తనలో వచ్చి కలియవలసినదిగా బసవేశ్వరుడు మల్లికార్జునపండితుని గోరినట్లును, నాతఁడు "భక్తి మీఁదివలపు బ్రాహ్మణ్యంబుతోఁ బొత్తుసేయలేను నేను బసవలింగ". యని ప్రత్యుత్తరము పంపినట్లును జెప్పెదరు. ఈతనిచే నేర్పాటుచేయఁబడిన యాచారములనే యారాధ్యులనుసరించుచున్నారని యీ సంప్రదాయము వారి యభిప్రాయము.

ఈ గ్రంథమునందు శివాధిక్యతను గురించి యెక్కువగ జెప్పబడినను, లింగధారణను గురించి యెంతమాత్రము జెప్పబడియుండకపోవుట యాశ్చర్యము. 224 మొదలు 230 వరకు శివదీక్షను గురించి చెప్పబడియున్నది, గాని యదియె లింగధారణ దీక్షయను కవియొక్క యభిప్రాయమేమో తెలియదు.

21 మొదలు 30 వరకు 'పశుపాశుపతి' వివేకము చెప్పబడినది ఇదియె పాశుపత శైవసంప్రదాయము యొక్క ముఖ్య సిద్ధాంతము.

31 మొదలు 66 వరకు నద్వైతుల మాయావాదము యుక్తులచే ఖండింపబడినది. మాయావాదమును ఖండించుటకై రామానుజకృత శ్రీభాష్యమందును జెప్పబడిన యనిర్వచనీయానుపపత్తి మొదలైన యుక్తులు కొద్దిలో బండితునిచే నీపద్యములందు జూపబడినవి. ఇందువలన నీతఁడు భాష్యాదికములను జక్కగఁ జదివిన పండితుడని స్పష్టపడుచున్నది.

మాయావాద ఖండనమునందు నీతడు విశిష్టాద్వైతులతో నేకీభవించినను, నితర విషయములలో కేవలద్వైతి. ఈతని మతమునఁ బ్రపంచము సత్యము,

నాత్మలంబె భిన్నము. జీవాత్మ పరమాత్మ లొక్కటి కాదు. శివునకు జీవునకు బర్వత పరమాణు భేదము కలదు. భక్తితో నీశ్వరుని సేవించిన గాని ముక్తి లేదు. కేవల జ్ఞానమువలన ముక్తి లేదు

కేవల యుక్తులచే దన మతమును స్థాపించుటకు యత్నించి ను, వేద ప్రమాణమును గూడ విడువలేదు వేదవాక్యములు కేవల ద్వైతమునే బోధించునని ప్రతిపాదించియున్నాడు. (53) ఇది యటు కాదు అద్వైత పరములుగాం గానవచ్చెడు వాక్యములకు ద్వైతపరముగ నర్థము చెప్ప యత్నించెను 'అద్వైత పరముగాం గానవచ్చెడు వాక్యము లీశ్వరుని యైశ్వర్యాద్వైతమును బోధించు గాని, జీవా శివా ద్వైతమును బోధింపవు; అట్లర్థము చేయుట తప్పు. (62) సర్వము శివుండనంగా, సృష్టియందలి యన్నియు నతని యధీనమని యర్థము. (63) అని యీతడు వాదించి యున్నాడు 'తత్త్వమసి' యను వాక్యమునకు మధ్వమతస్థులు 'అస్వాత్త్వమసి' యని యర్థము చేయుట మన మెఱుంగుదుము. పండితుండీ యర్థమునే యీ క్రింది పద్యమునందు జెప్పెను:- *

క. జీవుడు శివుండను వాక్యము, భావింపగ నైక్యమునకు బ్రతిపాదకమే
జీవుండనం బశుభృత్యుడు, గావున నీవాండ వేఱుగ దనుట శివా (40)

కావున, నీలకంఠ శివాచార్యులవారు విశిష్టాద్వైతి యైనను బండితుడు మాత్రము ద్వైతియనియే చెప్పవలయును.

ఈ గ్రంథమునందు శివభక్తి మహిమ యెక్కువగ జెప్పబడియున్నను, నిందుం గొన్ని విశేషములు గలవు. భర్త శివభక్తుడు కానియెడల భార్య వానిని విడిచివేయవలయును; దోషములేదు (231-337) అనసూయ నాలాయని యను మునిపత్నులిట్టు చేసి శివునిచే వరములు వడసిరి (234) శివనింద చేయు గ్రంథముల గాల్పవలయును. తద్గ్రంథ కర్తల జంపవలయును. శివ నిందకుని జంపినను, నా ప్రయత్నమందు జచ్చినను ముక్తి వచ్చును (247-280).

* మల్లికార్జునుడు 12వ శతాబ్దము వాడు. మధ్వరాయుడు 13వ శతాబ్దము వాడు కావున, 'తత్త్వమసి' యను వాక్యమునకు 'అస్వాత్త్వమసి' (వాని వాడవు) అని యర్థము చేయుట మధ్వరాయలే పండితుని యొద్దనుండియో, యీమము వారినుండియో గ్రహించి యుండును. మధ్వరాయలనబడు నానంద తీర్థుని కాలము కొఱకు జూడుడి. Dr Bhandarkar's Vaishnavism. P 50

ఇట్లు శివ నిందకులఁ జంపవచ్చునని యీ గ్రంథమునందు జెప్పినను, బసవ పురాణమునందుఁ గొందఱు భక్తులు భవులను జంపినట్లు కథలున్నను దరువాతి వీరశైవులెట్టి యమానుషకృత్యముల నొప్పినవారు కారు. కర్నాట దేశమందలి యబ్రాహ్మణులగు లింగాయతులేమి తెలుగు దేశమందలి బ్రాహ్మణులగు నారాధ్యులేమి ప్రభుత్వమువారిచే మిక్కిలి శాంతప్రియులయినవారుగ నెంచఁబడుచున్నారు. కావున నీ బోధ నుత్తరకాలీనులైన శైవులంగీకరింప లేదనియే చెప్పవలయును.

శివునిఁ గొలుచుచు మృతినొందువానికి దినవారములు మొదలయిన ప్రేతక్రియలు చేయఁగూడదు; వాని పుత్రాదులకు సూతకము లేదు.* వాని చావు న[illegible] యందఱును బండుగ చేసికొనవలసినది (281 - 283)

215-వ పద్యము మొదలు 222-వ పద్యము వఱకు శివ నిర్మాల్యము భుజింపవచ్చుననియు, దానిని శివ దీక్షితుడు తప్ప నితరులు భుజింపఁగూడదనియు జెప్పబడియున్నది. ఇతర శైవ గ్రంథములలోఁగూడ నిందును గూర్చి విశేషముగఁ జెప్పి యుండును. ఇందుకుఁ గారణమేమనగా శివుని నైవేద్యము నిర్మాల్యమనియు, భుజింపగూడదనియు స్మార్తుల యభిప్రాయము. అందుచే వారు శివాలయములలోని కొబ్బరి మొదలయిన ప్రసాదములఁగూడ భక్షింపరు. ఇట్లు శివునకు నైవేద్యము చేసిన వస్తువు నన్యులు భుజింపగూడదన్న యూహా జనులందు గలదు. దానిని ఖండనచేయుటకును, శివునకు నర్పింపనిది యేవస్తువును భుజింపఁగూడదని స్థాపించుటకును నీ ప్రకరణము వ్రాయబడినది. లింగధారులు లింగమునకు నైవేద్యము పెట్టనిది యేవస్తువును భుజింపరు, తుదకు మందు నైవేద్యము పెట్టి భుజింతురు. కొందఱింకొక నియమము కలదు ఒక్కసారే కావలసిన భోజనపదార్థములు వడ్డించుకొనియెదరు. రెండవసారి వడ్డించుకొనరు. నైవేద్యము పెట్టిన పదార్థమంతయు భుజింపవలయును. శివునకు నైవేద్యమైన పదార్థము లింగధారులు దప్ప యితరులు భుజింపరాదు. ఈ యాచారముల కన్నింటికిని పైనిచూపిన పద్యములలోని బోధయే మూలాధారము.

---

* ఆరాధ్యులలో నిప్పటికి నొక విధముగ సూతకమును బాటింపరనియే చెప్పవచ్చును వారు సూతక దినములలో నితరులనుండి విడిగానున్నను, ఆ దినములలో సంధ్యావందన శివపూజాదికమును మానరు. ఎప్పటివలెనే చేసికొనియెదరు. స్త్రీలును రజస్వలలైన దినములలోను, బురిటిలోను శివపూజను జేసికొనియెదరు. అట్లేలయని యడుగ, యజ్ఞదీక్షితునకు, నాశౌచము వచ్చిన యెడలఁ గర్మ విడువడు. అట్లే చేయవలయునని చెప్పుదురు.

పై శివతత్త్వసార పీఠికలోని యంశములే, బసవపురాణ ప్రథమ ముద్రణమున గైకొనబడినవి- శివతత్త్వసార పీఠికకన్న బసవపురాణ పీఠికయే సాహిత్య విమర్శకులను, మత సంప్రదాయజ్ఞులను హెచ్చుగా నాకర్షించినది- మతమునకు సంబంధించిన సాహిత్య గ్రంథముల నెంత జాగరూకతతో విమర్శింపవలెనో, ఆ విషయము తెలియజేయుటకు నొక్క సందర్భమును విస్తరించుచున్నాను-

పై మత సంప్రదాయములు- అను శీర్షికలో- "లింగధారణమును గూర్చి యీ గ్రంథమునం దెచ్చటను చెప్పబడియుండలేదు" అన్న వాక్యము తన్మతానుయాయుల విమర్శనమునకు పాత్రమైనది- ఆ విమర్శన గావించినవారు సామాన్యులుగారు- శైవాగమ పారదృశ్వులై, ఆరాధ్య సంప్రదాయ ప్రవర్తకులలో నగ్రగణ్యులు, ముఖ్యతములగు శ్రీ మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగ శాస్త్రిలుగారు- వారు తమ పత్రికలో* నీ విషయమై అయిదు ప్రమాణములను జూపుచు. సత్యసమ్మతమగు సిద్ధాంతము నొనర్చిరి-

1) శివతత్త్వసార మసంపూర్ణ గ్రంథము- అట్టి యసంపూర్ణ గ్రంథములో నిది లేదనుట న్యాయపద్ధతి గాదు-

2) పండితారాధ్య చరిత్రమున పండితుడు విభూతి రుద్రాక్షలు ధరించి- లింగార్చనచేయు సమయమున- బసవని యొద్దనుండి భక్తులు వచ్చిరి- లింగధారణ లేనిదే లింగార్చనచేయుట యసంభవము- ఆ లింగధారణ దీక్షయే శివదీక్ష- పండితారాధ్య చరిత్రలో ఈ ప్రకరణమునకు దీక్షాప్రకరణమని యిందువలన కలిగినది.

3) బసవపురాణమున కరస్థలి సోమనాథయ్య పండితారాధ్య కృపాసముద్గతుడు- అని కలదు- గురుహస్త సంజాతుడు అని దీని యర్థము- లింగధారణలేనిదే యిట్లు చెప్పుట దుస్సాధ్యము.

4) ఈ గ్రంథమున నిట్లు గలదు.

"జంగమ లింగంబగు భ
క్తుంగని పూజింపడేని గోటివిధములన్
లింగార్చన చేసిన వృథ
జంగమ ముత్తముగాగ స్థావరమునకున్.

---

* శైవ రహస్యబోధిని- సం. 5. సం. 1. 1-61 పుటలు-

అను పద్యమున మహేశ్వరుని జంగమలింగముగా బూజింపవలెనని యున్నది. ఇచ్చట మహేశ్వరునికి, లింగధారణము లేనిచో వానిని పూజించుట యెట్లు? లింగధారణయున్నందువలననే నాతడు జంగమలింగము మనుష్య రూపమున చరించుచున్న లింగము-శివుడు- అయ్యెను. ఇదియు లింగధారణ కలదని స్పష్టము చేయుచున్నది.

5) వీని యన్నింటికన్న పరమ ప్రమాణమైనది.

"కుసుమ శరారీ ! శివలిం
గ సమేతులు దక్కఁ బొందగా నొగినిర్మా
ల్య సుఖంబని బండారువు
బసవన విసమెత్తిత్రావి బ్రదుకడె రుద్రా.

అను పద్యము- ఇచట లింగసమేతులు అనఁగా లింగధారులనియే కాని-వేఱొక యర్థమురాదు-

ఈ విమర్శన మిప్పటికి రమారమి నలువదేండ్లు క్రిందటిది- ఈ తరువాతి మఱికొన్ని ప్రమాణములను నేను సేకరించితిని.

క్రీ. శ. 1242లో నున్న యథావాక్కుల యన్నమయ్య సర్వేశ్వర శతకము నందిట్లు గలదు.

కమనీయంబగు సర్వ తీర్థములు లింగంబున్నచో మూర్తిమం
తములై యొప్పుచునుండు లింగమును తాత్పర్యంబుగా భక్తిగా
త్రములం దెప్పుడునుండుగాన మదిలోఁ దత్త్వార్థమూహింప తీ
ర్థములం దెల్లను దివ్యతీర్థము భవద్భక్తుండు సర్వేశ్వరా- 25

పండితారాధ్య చరిత్రలోగూడ లింగధారణమునుగూర్చి చెప్పబడలేదు-అట్లుచెప్ప నావశ్యకతలేదు- పండితుడు లింగార్చనసేయు ప్రకరణమునకు "దీక్షా ప్రకరణము" అని నామకరణముచేయుటయందే. యీ యర్థమిమిడియున్నది-లింగధారణ దీక్ష లేనిదే- లింగార్చన సేయుట కర్హతయేలేదు- ఇదిగాక, పండితారాధ్య చరిత్ర కావ్యము- అందులో కేవల మతసాంకేతిక ప్రాధాన్య ములగు విధివిధానములను వర్ణించుట కావ్యాపకర్షహేతువు- ఇందుచేతనే-

సోమనాథుడు లింగధారణ దీక్షాఫలమైన- లింగార్చన వివరించి యా విధానము దెలుపు పేరు ప్రకరణమునకు బెట్టియున్నారు-

తెలుగు సాహిత్యములో లింగధారణ దీక్షావిధానమును తూచా తప్పకుండ తెలిపెడి కృతియొకటి గలదు. అది యుద్భటారాధ్య చరిత్ర- మహాకవి తెనాలి రామలింగనికృతి- ఉద్భటుడు ముంజభోజునికి దీక్ష నొసగు సందర్భమున మూడవ యాశ్వాసమున నీలింగ ధారణా విధానమంతయు వివరింపబడి యున్నది. మత సంప్రదాయిక గ్రంథమైనను ఇందలి కవితాశైలియు రసవంతమైనది-*

తెనాలి రామలింగకవి కృతిశైవ మతసంప్రదాయమునకు సంబంధించిన కథావస్తువుగలదైనను, నది సాహిత్యలోకమున, సాహిత్య కావ్యముగానే ప్రచారము గాంచినది- దీనివలన- మనము, మన సాహిత్య గ్రంథములను విమర్శింప వలసివచ్చినప్పుడు మతసంప్రదాయ పరిజ్ఞానమెంత యావశ్యకమో స్పష్టపడుచున్నది-

తెనాలి రామలింగకవియే తెనాలి రామకృష్ణుడైనాడు. అయినను, నాతని పాండురంగమహాత్మ్యమే విమర్శకులందఱు పాటింతురు. ఉద్భటారాధ్య చరిత్రయూసు తలపెట్టరు- ఒక కవి కవితాతత్త్వము నిరూపించునప్పుడాతని గ్రంథములన్నింటి కూలంకష పరిశీలన మావశ్యకము— మన సాహితీ విమర్శల యందవ్యవస్థ కిదియొక నిదర్శనము,

## కృతజ్ఞత

ఈ శివతత్త్వసారమును పరిష్కరించి, పీఠిక వ్రాయుమని నన్ను నత్యంతము ప్రోత్సహించిన శివయోగి విద్వాన్ భాషాప్రవీణ ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారికిని, శివశ్రీ డాక్టరు శ్రీ ముదిగొండ మల్లికార్జునరావుగారికిని, శివశ్రీ శ్రీ చాగంటి శంకరశాస్త్రిగారికి నామనఃపూర్వక కృతజ్ఞతాంజలుల నర్పించుచున్నాను-

---

* ఈకృతి ముదిగొండ వంశీయులగు వారికెల్ల ముఖ్యమైన గ్రంథము ఆ వంశీయులకు మూలపురుషుడగు ఉద్భటారాధ్యుని చరిత్రమును దెలుపు హృద్యమైన పద్యకావ్యము- నలుబదేండ్లకు పైగా ముద్రితమైన యిది నేడు లభ్యముకాలేదు- తక్షణమే పునర్ముద్రణము చేయదగినది.

అందఱికన్న మిన్నగ నాదినుండియు, నీ గ్రంథ ప్రకటనకై యభిల షించి, దీని నీనాడు వెలుగులోనికి దెచ్చి యాంధ్రసాహితీలోకమున కర్పించిన మహోదారులు— శ్రీకృష్ణాపత్రికాధిపతులు శివశ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారు— వారికి సర్వదా కృతజ్ఞతాబద్ధుడను.

శ్రీ శర్మగారి మూలముగా నాంధ్ర శైవవాఙ్మయమునకు నింకను నెంతయో యభ్యుదయము చేకూరనున్నది.

ఒకప్పుడు ముద్రితములై నేడు లభ్యముగాకయున్న ఉద్భటారాధ్య చరిత్రము, పండితారాధ్య చరిత్రము మున్నగు సద్గ్రంథములను, శ్రీ శర్మ గారిట్లే సుసంస్కృతములుగా బ్రకటించి ఆంధ్ర సాహిత్య ప్రపంచమున శైవ వాఙ్మయజ్యోతి యఖండముగా దీపించునట్లు చేయుదురుగాక !

నా యజ్ఞతచేతనేమి, యితర కారణములచేతనేమి, యిందు పెక్కు దోషము లుండవచ్చును. గుణగ్రహణపారీణులైన విద్వాంసులు వానిని దెలిపి నచో ద్వితీయ ముద్రణమున సవరించెదనని విన్నవించుచున్నాను.

ఇతి శివమ్

—నిడుదవోలు వెంకట...

-: శ్రీ శివ :-

# శివ తత్త్వ సారము

## (కంద పద్యములు)

శ్రీపతి వాక్పతి ముఖ్యమ
హా పురుషులు [1]నెరఁగనోప - రతి వాఙ్మనస
వ్యాపారమైన నీ నిజ
రూపము నే నిట్టిదని ని-రూపింతు శివా! 1

ఒందంగ శివుని తత్త్వం
బందఁగ విజ్ఞానమే క-మజమణు చరమా
నందం బనియెడుఁగాని య
నిందితముగ నిట్టిదనఁగ - నేరవు శ్రుతులున్. 2

ఇది గా దది గాదని యెడి
మొదలఁ బృథివ్యాదులైన - మూర్తుల నెల్లం
జదువుచు శివు నిన్నెఱుఁగక
వెదకుచు నున్నవి సమస్త - వేదాంతములున్. 3

---

1. బ్రహ్మ విష్ణువు మొదలగు మహాపురుషులకు. మనస్సుకు మాటలకు నంద రాని శివస్వరూప మిట్టిదియని చూపెదను.
2. వేదములు శివునితత్త్వ మనేకరీతుల నున్నదనిచెప్పుచున్న వేగాని యాతత్త్వ మిదియని స్పష్టముగా చెప్పజాలవు.
3. వేదాంతములను, నిదమిద్ధమని నిర్ణయింపలేక, శివునిగూర్చి తెలిసికొనుట కింకను మార్గములు వెదకుచున్నవి.

1. నెఱుఁగ. ము. ప్ర. నెరఁగ. వ్రా. ప.

వాదేమి "యనంతావై
వేదా" యను వేదములు [2]వి-విధ వివరములున్
వాదికి వెదకెడి నన్ను మ
హా దేవా ! నిన్నెఱుంగ - నన్యుల తలమే ? 4

నీ మూర్త్యాత్మల నీ వని
ప్రేమముతోఁ గొలుతురెంత - పెద్దలు నీ త
త్త్వా మేయ రూప మెఱుఁగుట
సామాన్యము [3]గాఁగఁజేసి సర్వానందా ! 5

హరి సరసిజభవులాదిగఁ
బరమ మునీంద్రులకు నెఱుఁగ - భరమగు నీ ని
ర్భర భూరి మహిమ వొగడఁగ
నరులెంతటి వారనాథ - నాథ ! మహేశా ! 6

స్తుత నిజ గుణ కథనమునకు
నతిశయ గుణ కథన[4]మంద్రు - రన్నిజ గుణ సం

---

4. అనంతములైన వేదములు, వాని యర్థ వివరణలు, శివు నెఱుంగుటకు తమలో తాము వివాదములు చేయుచునే యున్నవి.

5 తత్త్వాతీతమైన శివస్వరూప మెఱుగుట కలవి కానిది. కావున పెద్దలు శివుని యష్టమూర్తులగు, పృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు సోమయాజి అను వానిని సేవింతురు.

6 బ్రహ్మ మహామునులు మొదలగువారికే శివుని మహామహిమ స్తుతించుట కలవి కానిది - అట్టియెడ మానవులా స్తుతి కెంతమాత్రము సమర్థులు కారు.

2. యువిధ వివరములన్
3. గామిఁజేసి. ము. ప్ర.
4. మందుఁ రన్ని

గతి మున్నెఱుఁగక శివ ! భవ
దతిశయ గుణకీర్తి సేయ — నలవియె రుద్రా ! 7

స్తుతియును నిందయు లోక
త్రితయంబున నీకు లేమి — దెల్లంబగుటన్
మతిఁదమకుఁ గృతార్థత్వ
ప్రతిపత్తికి మిమ్ము జనులు - బ్రణుతింతు రజా ! 8

ఓడక నినుఁ బొగడఁగ నా
యీాడగుఁ గాదని తలంప-కే వేదుఱనై
చూడవె పొగడెద ననియెడు
వేడుక కారణముగాఁగ - వెఱవక రుద్రా ! 9

నే నొక నికృష్ట మనుజుఁడ
మానస వచనాతిదూర — మహనియ్యమహా
త్మ్యానంద ! నిన్నుఁ బొగడఁగ
నే నెంతటివాఁడ సుర ము-నీంద్ర వరేణ్యా ! 10

పన్నుగ లజ్జింపక శివ !
నిన్నే బొగడెదననంగ - నేర్తునే దేవా !

---

7. శివుని నిజస్వరూప గుణములను గ్రహింపకయే, ఆ శివతత్త్వమును గొప్పగా కొనియాడుట యసాధ్యము.

8. స్తుతి నిందలు నీకు లేకపోవుటచే, తమ్ము కృతార్థులునుగా చేసికొనుటకు జనులు మిమ్ము నుతియింతురు.

9. నిన్ను పొగడుటకు నా కలవికాదు. అది వెఱ్ఱితనమే, అయినను నిన్ను పొగడెదనని వేడుకయే నిన్ను స్తుతించుటకు పురికొల్పినది.

10. నేనొక హీనమానవుడను. మనస్సునకు, వాక్కున కందరాని మహాత్మ్యము గల నిన్ను పొగడుటకు నే నెంతవాడను.

ననియెద. ము. ప్ర. నిత్య. ము. ప్ర. నిత్యా. ప్రా. ప్ర.

విన్నపము వినుము సకల జ
గన్నాథ ! యనాథ నాథ - కరుణాంబు నిధీ ! 11

దురిత హారమనియు శుభములు
పొరకొను ననియును దలంచి - దురితారి ! భవ
చ్చరణాబ్జ భక్తిలలనా
పరవశ భావమున నిన్నుఁ బ్రణుతింతు శివా ! 12

గతదేహేంద్రియ నిత్యా
స్వతంత్ర సర్వజ్ఞ విమల - సర్వైగతైకా
ప్రతిమ సదానందాత్మక
మతి సూక్ష్మము నీ స్వరూప - మతిలోక శివా ! 13

సర్వేశ్వర ! షట్త్రింశ
త్త్వోపరిగత జగత్ప్ర-భవ హేతు జగ
న్నిర్వాణ సోమరూప మ
శర్వ మహత్త్వంబుఁ బొగడఁ గడునరిది శివా ! 14

---

11. అట్టి లోకోత్తరుడవైన నిన్ను పొగడుటకు నేను లజ్జింతును. కాని నాది పొగడ్తకాదు- అది విన్నపము మాత్రమే.
12. నిన్ను స్తుతించుటచే శుభములు గలుగును. నీపాదభక్తి భామిని పారవశ్యభావమున నిన్ను పొగడెదను.
13. ఇందు శివుని సూక్ష్మస్వరూపము వివరింపబడినది.
14. శివస్వరూపము షట్త్రింశత్తత్త్వములు- అనగా ముప్పదియాలు తత్త్వములకు పైమెట్టున నున్నది. అవి, పృథివి, ప్రకృతి, బుద్ధి, అహంకారము, మనస్సు, శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వా, ఘ్రాణము, వాక్కు, పాణి, పాదము, పాయువు, గుహ్యము, శబ్దము, స్పర్శము, రసము, గంధము, ఆకాశము, వాయువు, వహ్ని, జలము, మాయ కాలము, నియతి, కల, రాగము, పురుష, సదాశివ, ఈశ్వర, శుద్ధవిద్యా, రూపము.

సరసిజ భవ సరసిరుహో
దరులకు నటమీఁది మూఁడు – దానధికము ము
వ్వురు నియమకారు లవ్వా
రరిది జగత్కర్త లాద్యు-లతి మహిము లజా ! 15

శ్రీమత్సదా శివేశ్వర
నామ భవద్ధామముల మ-నంబునఁ దలఁపం
గా మఱి వాక్కునఁ బొగడం
గా మాకలవియె సమస్త - కామాతీతా ! 16

సర్వేశ్వర : కావున భవ
దర్వాచీన స్వరూపుఁ - డనఁదగు శ్రీ మ
త్పర్వత పుత్రీ పతి మ
ద్గీర్విభవము శక్తికొలఁదిఁ - గీర్తింతు శివా ! 17

## షష్ఠ్యంతములు

జయమగు వేదంబులకును
జయమగుఁ బంచాక్షరికిని - జయమగు నిట లా
క్షయమగు భసితంబునకును
జయమగు మాహేశ్వరులకు - సంతతము శివా ! 18

జయమగు శివ మార్గమునకు
జయమగు శివ సంహితలకు - జయమగు క్రీడా

---

15. బ్రహ్మ విష్ణువు జగత్కర్తలు కారు. రుద్రుడు, మహేశ్వరుడు- సదాశివుడు అను వారు ముగ్వురే జగత్కర్తలు- నియమకారులు.
16. సదాశివేశ్వరాది నామములు- మనస్సులోదలచి, పొగడుట కలవికాదు.
17. పార్వతీ పతి స్వరూపమును మాత్రమే నాశక్తికొలఁది కీర్తింతును.
18. ... ... ...

మయులగు ప్రమథ గణములకు
జయమగు వేదాది ధర్మ - చరితులకు శివా ! 19

శివమగు ధార్మిక నృపులకు
శివమగు గో బ్రాహ్మణులకు - శివమగు మఱియున్
శివ నిందా విరహితులకు
భువనత్రయ జనులకెల్లఁ - బుణ్యంబు హరా ! 20

## పశు పాశ పతి జ్ఞానము

జ్ఞానము పశుపాశపతి
జ్ఞానమయుని యట్లెఱుంగఁ - జాలని జడు ల
జ్ఞానులు వారల తత్త్వ
జ్ఞానము లజ్ఞానములు వి-చారింప శివా ! 21

పతి రుద్రుఁడు పశువుల కని
శ్రుతి చెప్పుచు నునికిఁ జేసి - రుద్రుఁడు పతి త
క్కితరులు పశువులు పొమ్మని
మతిలో నెఱిఁగితి శ్రుతి ప్ర-మాణమున శివా ! 22

క పూని యతద్గుణ సంవి
జ్ఞాన బహువ్రీహి మాన్పఁ - జనుదెంచిన యణ్

---

19. ... ... ...

20. ... ... ...

21. జ్ఞానమనగా పశుపాశుపతి జ్ఞానము — ఇది తెలియనివా రజ్ఞానులు — వారి జ్ఞాన మజ్ఞానము.

22. వేద ప్రమాణమువలన, పతి రుద్రుడు, తక్కినవారెల్ల పశువులని తెలియ దగినది.

మానిత షష్ఠీ తత్పురు
షానూన సమాస మెఱుఁగ - రజ్జులు రుద్రా ! 23

జీవు లనేకులు పశువులు
భావింపఁగఁ బ్రకృతి వికృతి — బంధము పాశం
బావృతములనం బశువులు
నీ వా రెంటికిని బతివి - నిరుప మహేశా ! 24

పశు పతియ పాశములఁ దన
పశువులకును బంధమోక్ష పద్ధతి సేయం
గుశలుఁడుగా కవి యొరులకు
వశవర్తులె ? నేర్పు గలదె వారికి రుద్రా ! 25

పశువులట ! జీవరాసులు
పశు పాశంబులకు నీవ పతివఁట ! శివ ! నీ

---

23. అతద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి మాన్య- మాన్యబడునది పాశము బద్ధపశు అనునది యిట్టి సమాసము— బద్ధాః పశవః ఏనసః అని విగ్రహాము- ఇది పాశమునకు విశేషము.

ఆహ్మానిత షష్ఠీ తత్పురుషామాన సమాసము. పశూనాః పతిః పశు పతిః (షష్ఠీ తత్పురుషము) పశు పతేరిదం పాశు పతం - (పశుపతి + అణ్) పాశు పత వ్రతముచేత బద్ధ పశుత్వ విశిష్టమైన వైహిక పాశము తెగును.

కొందఱు పశుపతి శబ్దము బహువ్రీహి సమాసముగ చెప్పెదరు కాని యది షష్టి తత్పురుష సమాసము. చూడుడు. సోమనాథ భాష్యము. ౧౮౮ ప్ర.

24. జీవులు పశువులు. ప్రకృతి వికృతి సంబంధము। పాశము శివుడా రెండింటికి పతి.

25 పశుపతియే, పాశమువలన తన పశువులకు బంధ మోక్షములను చేయ సమర్థుడు. ఇతరుల కట్టి సామర్థ్యము లేదు.

వ శరణ్యా మనంబగు దు
ర్వశభవ పాశములు తెగక — వచ్చునె యెందున్. 26

బ్రహ్మోక్త సమస్త హరి
బ్రహ్మాది పిపీలికాంత - పశువుల కెల్లన్
బ్రహ్మోపేంద్రయశోహర
బ్రహ్మేశ్వర రుద్రనీవ - పతి పతిలోకా ! 27

వేదోక్త మార్గమున న
త్యాదరమున నిన్నుఁ గొలిచి — యప్పశువులు నీ
చే దేహ పాశ బంధ
చ్ఛేదంబున ముక్తులగుట - సిద్ధము రుద్రా ! 28

గోపతి కృతమున భవ పా
శాపేతములైన పశువు-లట్ల భవత్ పా
శాపేతులైన పశువులు
ప్రాపింతురు మోక్ష సుఖము — పశుపతి నీచేన్ 29

త్రిమలకృత దుఃఖ సంసా
ర మహాబ్ధి నిమగ్న జీవ—రాసులు నీ యు

---

26. జీవరాసులు పశువులు — పశు పాశములకు నీవే పతివి. నిన్ను శరణం చొచ్చిన గాని యాపాశములు తెగవు

27 వేదోక్తమైన — బ్రహ్మ మొదలు పిపీలి కాంత పర్యంతముగల జీవములకు శివుడే పతి.

28. వేదములలో చెప్పబడిన రీతిని శివుని గొల్చిన పశువులకు దేహ పాశ బంధములు వీడి ముక్తి పదము లభించును.

29 గోపతివలన పాశము వీడిన పశువులవలె నీ పాశము వీడిన పశువులు, మోక్ష పదవి నందెదరు.

త్తమ కారుణ్య వశంబున
విముక్తులై నీవపోలె - వెలుఁగుదురు శివా ! 30

## అద్వైత మత ఖండనము

జ్ఞాన జ్ఞేయ జ్ఞాతృని
దానత్రయమునబాధి — తప్రత్యయమై
నానాగతి నవగతమగుఁ
గాన జగద్భేద మెన్నఁగా సిద్ధ మజా ! 31

భేదము దృష్టా దృష్ట ని
పాదకమై వైదికోక్త - పథ దర్శన సం
పాదన సమర్థ మగుటను
భేద మదర్శనము ప్రమితి - పిండితము శివా ? 32

భేదము సిద్ధంబగుడు వి
భేదక సిద్ధియగుఁ దద్వి - భేదక సిద్ధిన్
వేదోక్త కర్మ దశలం
దాదరమగుఁ దత్ఫలప్ర - దారాధ్య గతిన్. 33

ఆరాధ్యుఁడైన యీశ్వరు
నారాధించుటయ స్వర్గ - మపవర్గము ధా
త్రీరాజ్యాది సుఖంబులు
బోరన గర్మాను రూప - ముల జనుల కగున్. 34

---

30. సంసార దుఃఖములలో మునిగి యున్న జీవరాసులు. నీ దయవలన నీవలెనే యొప్పుచున్నారు.

31

32. ప్రమితి — యథార్థ జ్ఞానము

ప్రత్యక్ష జగద్భేదము
సత్యంబై తోచుచుండ - శబ్దంబునఁ ద
త్ప్రత్యక్ష బాధ యగునని
యత్యనుచితవృత్తి నడుతు - రద్వైతు లజా ! 35

అమరఁగఁ బ్రపంచ మిథ్యా
త్వమ సెప్పెదు వాది మున్ను - దానికి సద్భా
వము దానెఱుఁగక మిథ్యా
త్వ మనాశ్రయ మెట్లు జెప్పఁ - దలపోయు శివా ! 36

మానము చేత గృహీతము
గాని ప్రపంచమ్మెఱుంగఁ - గడు దుర్ఘటమౌ
మాన గృహీతము తథ్యమ
తా నెన్నఁడు మిథ్యగాదు - తలపోయ శివా ! 37

ఉత్తర శుక్తి జ్ఞాన ని
వృత్తంబగు శుక్తి రజిత - వేదనము క్రియన్
వృత్తజగద్భేదము చెడు
నత్తఱి నద్వైతు లెన్న - రండ్రు మహేశా ! 38

నిర్వచనీయము లేక య
నిర్వచనీయంబు గలదె ? నిర్వచనీయా
నిర్వచనీ యోత్పత్తిన
సర్వాద్వైతంబు చెడదె - సర్వానందా ! 39

జీవుఁడు శివుఁడను వాక్యము
భావింపఁగ నైక్యమునకుఁ - బ్రతిపాదకమే

---

౩౫. శబ్దంబున - ఉపనిషద్వాక్యము వలన

జీవుఁడు నీ పశుభృత్యుఁడు
గావున నీ వాఁడవేఁటు-గాదనుట శివా ! 40

జీవునకు బంధ మోక్ష ద
శావస్థలు గలవు నీకు - నవిలే వగుటన్
జీవునకు నీకు నైక్యము
భావించుట ముఖ్యవృత్తి - బాధకము శివా ! 41

పరమేశ్వర! నీకును మఱి
పరమక్లేశాత్ములైన - పశు జీవుల కం
తరము మహాధాత్రీధర
పరమాణుల యంతరంబు - భావింప శివా ! 42

ఆత్మ నిరాకారుం డని
యాత్మన మది వెండి జగ దు - పాదానముగా
నాత్మీయ బుద్ధిఁ జెప్పెడి
యాత్మాద్వైతులు విమోహి – తాత్ములు రుద్రా ! 43

మాతయు మానము మేయము
బ్రాతిగ మిథ్యయని పల్కు - పాతి కులాత్మా
ద్వైతులు ప్రమాణ శూన్యులు
నీతి యెఱుంగుదురె తత్త్వ - నిర్ణయము శివా ! 44

తనకంటె వేఱ యీశ్వరుఁ
డన లేఁడని పలుకు నట్టి - యద్వైత విమూ
ఢునకును లోకాయతునకు
వినఁగా భేదంబు గలదె – విష్ణువరేణ్యా ! 45

పన పరమేశ్వరుఁడ న
జ్ఞానంబున నిన్ను నెఱుఁగఁ - జాలన యను వి

జ్ఞాన విహీనాత్ముల (చెడు)
పానలు వో విడిచి నిన్నె - భజియింతు శివా! 46

జ్ఞాన స్వరూపుఁ డీశ్వరుఁ
డని వితర్కింప నట్టి - యీశ్వరునకు న
జ్ఞానము దొరకొనఁ దని తా
త్ప్రాణం బది యేల సేయ - రద్వైతు లజా! 47

తా రద్వైతులు సచ్చి
త్కారణ సర్వజ్ఞ సర్వ - గత నిత్య నిరా
కారుఁడని చెప్పి వెండియు
కారణము యవిద్య నీకుఁ - గల్పింతు రజా! 48

కలనన నోపక లేదని
పలుకఁగ నేరకయు మూక - బధిరుల క్రియ ని
మ్ముల నద్వైతులు తమలో
పల వగతురు భువనభిన్న — భావమున శివా! 49

ఆరాధ్యుం డారాధకుఁ
డారాధక మనఁగ లేని — యద్వైత దురా
చార కృత సర్వ శూన్యా
కార స్థితి నేమి సేయఁ - గావచ్చు శివా! 50

పాతకము సకల నాస్తిక
జాల నివాసంబు సర్వ - సంకర మాత్మా
ద్వైతంబనఁగా జగదు
త్పాతము దొరకొను నె యిట్లు - పరమానందా! 51

46. పానలు - సందేహములు.

నిత్య మహాజన దూష్యము
ప్రత్యక్షాది ప్రమాణ - బాధా బాహ్యం
బత్యనుచిత మద్వైతము
కృత్యాకృత్యాది శూన్య - కీటకము శివా ! 52

అద్వైతమ్ము పురాతన
విద్వన్మునివరుల కెల్ల - విద్విష్టము సా
క్షాద్వేదోక్తము గామిని
సద్విద్వద్ద్వైతులకు న - సహ్యంబు శివా ! 53

ప్రాజ్ఞులు వేదజ్ఞులు లో
కజ్ఞులు చేకొంద్రె గత శిఖా గాయత్రీ
యజ్ఞోపవీత నాస్తికు
లజ్ఞులు చేకొంద్రుగాక - యద్వైత మజా ! 54

స్వేచ్ఛాచారులు మిథ్యా
విచ్ఛేదన వేద శాస్త్ర - విప్లవ వాదుల్
ప్రచ్ఛన్న దోషు లజ్ఞా
నాచ్ఛాదిత దుష్ట చిత్తు -ల ద్వైతులజా ! 55

కమలాక్ష కమల గర్భ
ప్రముఖాఖిల సురలు మునులుఁ - బాశుపతులు భ
స్మమయాంగ జటారుద్రా
క్షమాలికా ధరులు కాని - కారద్వైతుల్ 56

---

54. గతశిఖా గాయత్రీ యజ్ఞోపవీత నాస్తికులు - జుట్టును గాయత్రీ మంత్రమును, జంధెమును వదలి నాస్తికులైన వారు - లింగధారులలో సన్యాసులు లేరు - ఇందద్వైత సన్యాసులు నిరసింపబడిరి.

పాతక యథేష్ట దుష్ట
వ్రాత జగద్విప్రలంభ - వాదము కాక
ద్వైతము శిష్టవాశ్రిత గృ
హీతమె కలికాల కలుష - హేతువ కాదే! 57

మున్నద్వైత వ్యామో
హోన్నతిని సనత్కుమారుఁ -డుష్టరింబయ్యెన్
మన్నింపక దూర్జటి నని
యెన్న న్వినరయ్య నంది — కేశ్వరు చేతన్! 58

ప్రీతిం దన కూఁతున క
ద్వైత మహా మోహాయుక్తి - వనజజుఁ డతికా
మాతురుఁడై ఁ ద్రెళ్ళఁడె వి
ఖ్యాత మృగవ్యాధ రుద్ర - కరశర నిహతిన్. 59

వెండియు నభేదమతిఁ గన
కాండజుఁ డీశ్వరుఁడనేన - యనవుఁడు సద్యః
ఖండిత పంచమ శిరమును
రుండలబుగఁ జేసెఁ గాల - రుద్రుండతనిన్ 60

ముందటి జలజాసన త
న్నందనులన చెప్పనేల - నాస్తిక్యము మై
నెందఱు సెడ రద్వైతులు
కొందలమున దుష్ప్రబోధ - కుత్సిత వృత్తిన్. 61

నీ యైశ్వర్యాద్వైత మ
నీయద్వైతమని దుర్వి - నీతులు కొందఱ్

పాయక వేదాంతాఖి
ప్రాయముఁ గడుఁ దప్పఁ జెప్పె - పఠియింతు రజా ! 62

సర్వము నీ యాధీనమ
సర్వేశ్వర ! కాన గుణ వి - చారిత వృత్తిన్
సర్వంబు నీవ యను శ్రుతి
నిర్వాహము బొందనేర్చు - నిత్యానందా ! 63

అద్వైతైక స్థితి నీ
యద్వైతము గాన యీశ్వరా-ద్వైతము స
ర్వాద్వైత మనఁగ వేఱు జ
గద్విపరీతమగు తత్త్వ - గతి గలదె శివా ! 64

ఇది గాదని శ్రుతి చెప్పిన
నది బ్రహ్మమన నీ స్వరూప-మని చెప్పెడి దు
ర్మదులగు మాయావాదుల
చదువులు వోవిడిచి నిన్నె - వదలెద రుద్రా ! 65

మాయావాదుల ముందఱ
మాయావాదు లనె వారి - మార్గముఁ గీడి

---

62 ఐశ్వర్యాద్వైతము - ఈశ్వరత్వమునకు సంబంధించిన యద్వైతము తనకు సాటివాడు లేనందున గలిగిన యనన్య భావము, అందఱకు దామే యీశ్వరుడగుట వలనను తనకు సమానుడు కాని అధికుడు గాని లేనందు వలనను 'ఒక్కడు' అని చెప్పబడెను గాని జీవుడు ఈశ్వరుడు ఒక్కడు అను నర్థమందు గాదు.

స్వీ యని యెల్లక రోసి ' శి
వాయ నమో' యనుచు నిన్నె వలగొంద్రు శివా ! 66

## జగత్కర్తృ విచారము

ఏ నిశ్చయపరుఁడను నీ
దానుఁడు నా స్వామి యనుచు - సంతతమును సం
త్రాణగతి స్వామి భృత్య
జ్ఞానంబున నిన్నె గొల్తు - సర్వానందా ! 67

తుణిక మచేతన మది ని
ర్గుణము జగత్కార్య కరణ - కుశలంబగునే
గణనాతీత మహా గుణ
గణ కృత్య విహీనమైన - కర్మము గలదే! 68

పరికింప నచేతనములు
పరమేశ్వర మది ప్రధాన - పరమాణ్వాదుల్
పురుషుఁడు చేతనుఁ డయ్యును
కర మజ్ఞుఁడు గాన కర్త - కాఁ జాలఁడజా ! 69

అవయవయుతములు గావున
నవీన ప్రముఖంబులగు మ- హాభూతంబుల్
వివిధ వితర్క విచారణ
నవశ్యమును గార్యములు మ - హామహిమ శివా ! 70

---

౬౬. ౩౩ - ౬౬ వఱకును అద్వైత వాదము ఖండింపబడినది.

౬౮. ( మా శైవులైన) ఆ (ప్రఖ్యాతులైన ) వాదుల యెదుట = మాయా వాదుల ముందఱ.

2. మాయావాదులు - అద్వైతులు.

శ్రీనాథవంద్య! కర్తృవి
హీనంబై యున్న కార్య - మెందును గలదే
కాన జగత్కార్యమునకు
గాన ప్రియ! నీవ యాది – కర్తవు రుద్రా! 71

కర్మ మచిత్తని కర్తయుఁ
గర్మాధీనుఁ డని విడిచి – కర్మల మొదలం
గర్మ ఫలదాయి నిన్న న
కర్మాధీన స్వతంత్రుఁ – గని కొలుతు శివా! 72

శ్రుతి బాహ్యంబులు గావున
సతతంబును జైన బౌద్ధ – చార్వాకుల దు
ర్మతములు వట్టక పట్టితి
శ్రుతి సార భవన్మతంబు - సుమతి మహేశా! 73

కమలజ కమలోదర రు
ద్ర మహేశ్వర శాంత్య తీత - తత్త్వాధి పతి
ప్రముఖోర్ధ్వ బిందు నాద
క్రమతత్త్వా! నిన్ను [నెట్లు] – గని కొల్తు శివా! 74

నె (ఱ) సిన గురు ప్రసాదము –
వ (ఱ) లఁగ జగదేక సకల - వల్లభు డాదిం
గ (ఱ) కంఠుఁడ వేల్పని ని
న్నెఁ(ఱి) గితి నీ మహిమ యెఱుఁగ – నేమియు రుద్రా! 75

అండంబులు గావింపను
వెండిఁ బ్రతిష్ఠింపఁ–జె (ఱు) ప - విష్ణ్వాదులు ను

ద్దండిత శక్తి సమేతులు
చండీశ్వర వరద! నీ ప్ర-సాదమున శివా! 76

కీర్తింపఁగ లోకములకుఁ
గర్తలు విష్ణ్వాదులయ్యు - గా రాది మహా
కర్త భవత్ప్రేరితులై
వర్తిల్లుట గారణముగ - వారలు రుద్రా! 77

నారాయణాదులకు సం
సారిత్వము దెల్ల మెల్ల - శాస్త్రంబులఁ ద
త్కారణమునఁ దత్కృతము వి
చారింప భవత్కృతంబు - సర్వానందా! 78

ఆర్యేశ్వర! ఈమ చేసెడి
కార్యము లందెల్ల వారు - కర్తలు గారే
కార్య కరణత్వ మాత్రన
వార్యు జగత్కర్తలనఁగ - వచ్చునె వారిన్ 79

తన తెగిన తలయు మడిసిన
తనయుని బుట్టింపఁ గావఁ - దారోపని యా
వనజాసన కేశవులకు
జనన స్థితి కర్తృ తాది-శక్తులు గలవే! 80

## భవాది శబ్ద వివృతి

ప్రవితత షట్త్రింశత్త
త్త్వ వితానంబులకు నుధ్భ - వస్థానం బై

1 వెండియు బ్రతికింప. ము. పా.

80. ఇందు వివరించిన పంచమ శిరఃఖండనము — మన్మథ దహనము సూచిత మైనవి.

నివుడు రజోగుణ సంగతి
భవుఁడను నామంబునీకుఁ బరగు మహేశా! 81

మడి-యిల్లు తత్త్వముల వెనుఁ
బడక నిజాజ్ఞా ప్రశస్తి-భావింపఁగఁ జో
ప్పడు సాత్త్విక గుణ సంగతి
మృడుఁడను నామంబు నీకు — మేలిల్లు శివా! 82

పరపగు తత్త్వములు ఁజరా
చర వితతులు సంహరింపఁ- జాలిన యతి భీ
కర తామసగుణ సంగతి
హరుఁడను నామంబు నీకు-నమరు మహేశా! 83

పరమ స్వతంత్ర నిర్మల
పరమానందాత్మ పరమ - భట్టారక ని
స్తర నిస్సైరి గుణ్యా మహా
త్తర రూపంబున శివాభి - ధానం బయ్యెన్ 84

## జగత్కర్తృ లక్షణము

పరమ స్వతంత్రుఁడై, య
ఘరుఁడై, సర్వజ్ఞుఁడై వి-కార రహితుఁడై
కరుణా కరుఁడై, స్థిరుఁడై
వరద! జగత్కర్త యుండ-వలదె మహేశా! 85

పరి విశ్రుత సచరా చర
భరితానేకాండమగు ఁబ్ర — పంచంబులకున్

---

81. షట్త్రింశత్తత్త్వ వితానములు 14 వ పద్యమున వివరింప బడినవి.

బరమ స్వతంత్ర శంకర
కరుణా కర నీవ యాది - కర్తవు రుద్రా! 86

భువనోత్పత్తి స్థితి లయ
వివిధ వ్యాపార ముఖ్య - విభుఁడవు పశుబం
ధవిమోక్ష దక్షుఁడవును వ
ర వర ప్రదుఁడవును నీవె-రాజా శరణా! 87

పరమాత్మ పర బ్రహ్మము
పరమేశ్వరుఁ డనఁగనామ-పర్యాయంబుల్
హరునికి మ(జీ)యుఁ దత్త్వాం
తర వాచకములని పలుకఁ-దగదు మహేశా! 88

పరమాత్మ పరబ్రహ్మము
పరమేశ్వరుఁ డనఁగ హరియుఁ బ్రహ్మయును బరా
పర విభులుగారు శాస్త్రము
లరయఁగ జీవాత్మ లగుట - నందఱు రుద్రా! 89

పర శబ్దంబున కర్థం
బరయఁగ నుత్కర్ష మంద్రు - ర య్యుత్కర్షం
బొరులకు గలుగునె శివ! నీ
కరణి మహాదేవుఁ డొరుఁడు - గలఁడే జగతిన్ 90

శరకర పద్మజ రుద్రాం
బురుహోదర ముఖ్య దివిజ - పుంగవ సచరా
చర భూత నికర పంచా
వరణంబులు గొల్వ నుండు-వాఁడవు రుద్రా! 91

87. సర్వవరప్రదుఁడవు (ను) నీవు రాజా శరణా! ము. పా.

ఏమని చెప్పుదు శంకర !
నీ మహిమా డంబరంబు-నిఖిలాజాండ
స్తోమములు బ్రకృతి నీ యి
చ్ఛా మాత్రనె పుట్టునటె య-సంఖ్యాతములై 92

త్రిమలములును రాగ ద్వే
షములును [జన్మంబు] గర్మ - సంస్కారంబుల్
గమనా గమనాదులు నను
సమస్తమును లేవునీకుఁ - జంద్రాభరణా ! 93

పతి సదృశాదిక తాప
త్రితయ గుణత్రితయ జన్మ - మృతి సుఖదుఃఖ
క్షుతవృత బంధ [న] మోక్ష
స్తుతి నిందాదులును లేవు - ధూర్జటి ! నీకున్ 94

ఓలిన దేవ ! యవిద్యా
కాల కళా నియతి వికృతి - కార్యా కార్యాం
ఖీలా బాంధవ బాంధవ
మాలా బంధములు లేవు – మఱి నీకు శివా ! 95

అంచితమతి నెవ్వరు ని
ర్మించిరె గుంచిత సురలు ని- వృత్త్యాది కళా
పంచక సంచితమైన ప్ర
పంచమునీ యట్ల రుద్ర ! - పరమానందా ? 96

96. నివృత్త్యాది కళా పంచకము–నివృత్తి, ప్రతిష్ఠ విద్య, శాంతి శాంత్యతీతము, అనునవి శైవుల కళా పంచకము.

వేదాద్యష్టాదశ వి
ద్యాది మహాకర్త నీ మ - హత్త్వము వొగడన్
శ్రీదయితా వల్లభ వా
ణీదయితా వల్లభులును - నేరరు రుద్రా ! 97

స్వర్గాపవర్గ సుఖము ని
రర్గళ సామ్రాజ్య సుఖము - నాత్మజవిద్యా
వర్గాది లోక సుఖములు
భర్గ ! భవత్పాద భక్తి - ఫలములు రుద్రా ! 98

## శివభక్తి వివరణము

ఒక్కండీశ్వరుఁ డని మది
నిక్కముగా నెఱిఁగి భక్తి - నిష్ఠావృత్తిన్
ముక్కంటి ! నిన్నుఁ గొలిచినఁ
దిక్కక దొరకొనె సమస్త - దివ్య సుఖంబుల్ 99

భక్తి నినుఁ గొలువ వలయును
భక్తియు ధర్మమునఁగాని-ప్రభవింప దతి
వ్యక్తముగ ధర్మమును వే
దోక్తముగ నెఱుంగ వలయుఁ - దుదిని మహేశా 100

వేదోక్త సదాచారా
పాదనమున నెగడు నట్టి పశువులకుఁ బురా
పాదిత దురిత క్షయమై
యాదరమున ధర్మమధిక - మగు నీశానా ! 101

---

దొరకవె. ము.

ధర్మాధిక్యంబున నతి
నిర్మల బోధయు విరక్తి-నిష్ఠయుఁ గలయ
క్కర్ములకు నీప్రసాదము
పేర్మిని శివభక్తిపుట్టు - పృథుభావమునన్ 102

శివభక్తి సకలధర్మ
ప్రవర మహోధర్మమగుటఁ బరికింపఁగ భా
గ్యవిహీనులగు దురాత్ముల
కవశ్యమును సంభవింప - దఖిలోకశివా ! 103

మానిత శివభక్తి శివ
జ్ఞానధ్యానముల నీ ప్ర - సాదాతిశయా
నూనిత గర్మక్షయమై
యానంద ప్రాప్తిముక్తుఁడౌ మనిషి శివా ! 104

నరసురతిర్యక్స చరా
చరజీవులకెల్ల భక్తి - సంభావననీ
కరుణప్రధానముముక్తికి
వరుసన యనలేదు భావ - వశ్యుఁడవగుటన్ 105

---

102 ధర్మము, బోధ, నిష్ఠగలవారికే శివప్రసాదమువలన శివభక్తికలుగును.

103 సకల ధర్మములలో నత్యుత్తమైనది శివభక్తి- అది అభాగ్యహీనులకు నలవడదు.

104 శివభక్తి జ్ఞానధ్యానములచే శివప్రసాదము లభించును. దానివలన కర్మము నశించి యానందము చేకూరును.

105. శివుడు భావవశ్యుడుగాన సచరాచనములలో నందఱును నొక క్రమమునగాక నొకేసారి ముక్తిబొందవచ్చును.

నరకస్థులు స్వర్గస్థులు
నరతిర్యగ్గర్భ యేవ-స్థాదిపశూ
త్కరములు భవత్ప్రసాద
స్ఫురణము - దొరకొనుడు ముక్తిఁ - బొందుదురు శివా ! 106

అరుదుగ భవత్ప్రసాదము
దొరకొను శివభక్తిగాన - దుస్తరభవ ని
ష్ఠుర దుఃఖ సముద్ర సము
త్తరణ వహిత్రంబు భక్తి - దానయ్యె శివా ! 107

నియతమగు సకలపుణ్య
క్రియ లెల్లను భావశుద్ధి - కిని హేతువు ల
తయభాతి భావశుద్ధియు
గ్రియఁగొన నీ పాదభక్తి - కిని హేతువజా ! 108

అతి గుహ్యంబుల కంటెను
నతి గుహ్యతరంబు శివుని - యందుల భక్తి
స్థితియని మోక్షార్థులు దృఢ
మతిఁ గొలుతురు దేవ ! నిన్ను - మనుజులు ప్రీతిన్ 109

జలజాసనాచ్యుతాద్యమ
రులకును [నిది యిట్టిదని] ని - రూపింపఁగ న
గ్గలమగు నీ నిజరూపముఁ
దెలఁగఁక నీ భక్తు లెఱుఁగుదురు సర్వజ్ఞా ! 110

---

106. భూలోక, నరక, స్వర్గ వాసులందరును శివునివలననే ముక్తినందుదురు.
107. తరింపరాని సంసారసముద్రమును దాటుటకు శివభక్తియొక్కటే నావ యగును.
108. పుణ్యకార్యములు భావశుద్ధికి హేతువు— భావశుద్ధి శివపాదభక్తికి కారణమగును.

వసుమతిఁ జిత్రమ జితచి
త్త సంభవా "నకర్మణాన - తపసా నజపై!
ర్న సమాధి భి" రవ్యయ నీ
యసదృశ భక్తికినిఁ బ్రియుఁడ - వగు దీశానా! 111

1 వేయేమి తోడఁ బలుకుదు
పాయక నినుఁగొలుచునచల — భక్తులఁగని "య
య్యా" యని పిలిచిన నంబి కి
"నో" యని యెలుఁగిచె తొల్లి — యురగాభరణా! 112

శివభక్తి లేక చేసిన
వివిధాధ్వర ముఖ్యసకల — వేద పురాణా
ది విహిత కర్మ వితానము
లవి యెల్లను నిష్ఫలంబు — లగు నీశానా! 113

భక్తియ ముక్తి తెరువు వి
ధ్యుక్తముగ నమేయ ప్రియచ-తుర్వేదా 'మ
ద్భక్తశ్చ శుచీ' యను నా
సూక్తిఁ బ్రధానంబుగాఁ బ — శూత్తముల కజా! 114

## భక్తుల మహిమ

కొనునది భక్తుని చేతనె
ధన మతనిక యిచ్చునదియు "తస్మైదేయం"
బనియును "తస్మాద్గ్రాహ్యం"
బనియును గలదనిరి వేద—భక్తి విధిజ్ఞుల్. 115

కథలేటికి "నచపూజ్యో
యథాహ్యే హా"మ్మనిన విధియ-థార్థముగా మ

---

1 నంబి (సుందరమూర్తి నయనారుకథ. పండితారాధ్య చరిత్ర. మహిమప్రకరణమునగలదు.)

న్మథ మర్దన ! నీ భక్తులఁ
బ్రథితంబుగ నీవ కాఁగ—భావింతు శివా ! 116

అతి మూఢుం డతిపతితుఁడు
నతిదుర్జను డనఁగ వలవ—దతిశయ భక్తి
స్థితి నెగడునేని సాతం
డతిపండితు డతిపవిత్రుఁ—డతిసుజనుఁ డజా ! 117

అనయము రుద్రాక్ష విభూ
తినియుక్తుల యిండ్లదిక్కు-దెసఁ బోవకుఁడో
యని చాటించునుఁ గాలుఁడు
తనపురి శివశాసనుండు-ధన్యుం డగుటన్. 118

ఒండేమి భక్తి సంగతిఁ
జండాలుండైన భూతి-శాసనధరుఁడై
యుండినఁ బూజ్యుఁడె యతనిన్.
ఒండనఁగాఁ జనదు భక్తి-యోగమున శివా ! 119

విను పరుసవేది సోకిన
యినుముక్రియ న్నిన్ను గొలిచి-యెవ్వండైనన్
త్రినయన ! యుత్తముఁ డనఁబడు
ఘనరఁగ శివభక్తుఁ డగ్ర-పూజ్యుండగుటన్. 120

అవిచారంబున నెప్పుడు
శివశాసన పూజనంబుఁ - సేయఁగ వలయున్
శివ భక్తులఁ గని జాత్యా
ది విచారము విడువవలయు-దృఢ భక్తిమెయిన్. 121

తెవులును లేమియు భయమును
శివభక్తులకైన నెడలఁ-జేకొని రక్షిం

ప వలయు క్రియములు సేయఁగ
నవశ్యమును వెలయువారి-కాత్మ విధమునన్. 122

శివశాసన పూజనమున
శివుఁడెంతయుఁ బ్రీతుఁ డగుటఁ—జేసి శివ ప్రీ
తి విధానము గారణముగ
శివశాసన పూజనంబు-సేయఁగ వలయున్. 123

శివలాంఛనుఁడగు మా
నవుఁ గనుఁగొని మునిఁగిలేచి - న విధమునం జి
త్త వికాస మడర సత్క్రియ
లవశ్యమును జేయవలయు - నతిలోక శివా! 124

శివశాసనుఁడగు రుద్రా
క్ష విభూతి ధృఢాంగుఁజూచి - సన్మతి సాక్షా
చ్ఛివుఁడను నదియ విచారము
శివునాజ్ఞయు నగుట శాస్త్ర - సిద్ధం బగుటన్. 125

కుల విద్యాచారాదులు
దలఁపక నీవలని భక్తి - తాత్పర్యమెడం
గల మానవుఁడు సమస్తముఁ
గలవాఁడని పూజసేయఁగా వలయు శివా! 126

ధరణిఁ గుల రూప విద్యలఁ
బరఁగి భవద్భక్తిలేని - పొలసుఁడు గడుం
బరిమళము లేని కుసుమము
గర మొప్పునిభంగిఁ గొఱయుఁ - గాఁడు మహేశా! 127

ధర నెట్టివానికనిమొన
బిరుదునకజయంబుగాక - పిఱిఁదికిఁ గలదే!
హర! నీ భక్తిని దుస్తర
దురితంబులు దొలఁగుఁగాక తొలఁగునె యొంటన్. 128

జాత్యాది సూతకంబులు
హత్యాది సమస్త పాత - కాదులు శివ! నీ
భృత్యులఁ బొందునె జలములు
నిత్యస్థితిఁ బొంద నేర్చునే జలజములన్ 129

ఎట్టి కడుఁగీడు కులమునఁ
బుట్టియు శివ! నిన్నుఁ గొలిచి - పూజ్యుఁడ మనుజుం
డట్టిద ధర్మువు రొంపిం
బుట్టియుఁ బద్మంబు సాలఁ - బూజ్యము కాదే! 130

నీ నిజభక్తుం డంత్యజుఁ
డైనఁ బవిత్రుండు పూజ - కర్హుఁడు జగతిన్
"తేనసహ సంవసే" త్తని
గానప్రియ! శ్రుతులు మ్రోయుఁ - గాన కపర్ది! 131

మసి కప్పడమునఁ బొదివిన
యసదృశ మాణిక్య మెట్టు - లట్టుల దుర్జా
తి సమావృతుఁ డయ్యును నీ
కు సదాభక్తుఁడగు మనుజ - కుంజరుఁడు శివా। 132

కుల విద్యాచారాదులు
గలవాఁడే శివుని భక్తి - గలవాఁడైనన్
వెలగలదె పసిఁడి గమ్మఁగ
వలచిన విధమున సమస్త - వరదాత శివా! 133

కులజ కులహీను లిద్దఱు
నెలకొని భవదచల భక్తి - నిష్ఠావృత్తిన్
వెలసినమీఁద సమానుల
కులజులుఁ గులహీనులనఁగఁ - గూడదు వారిన్. 134

ముందటి పసిఁడిన పోలును
సుందరముగఁ బరుసవేది — సోఁకిన యను మా
నంద స్వరూప! శివ! నినుఁ
జెందిన దుర్జాతిఁదొంటి - శ్రేష్ఠమ పోలున్. 135

జనపతి శాసనధరులం
గని భయమునఁ గులము రోయ - కయు సత్క్రియలం
దనుపక్రియ నిర్విచారం
బున నీ శాసనము వలయుఁ - బూజింప శివా! 136

గుణవత్పాత్రులఁ బూజిం
చిన శాసనపూజఫలము - సేకుఱదని శా
సనపూజ నిర్విచారం
బునఁ గావింతురు భవత్ప్రి - భూతాజ్ఞ శివా! 137

శివభక్తుల నావారే
శివభక్తులవాఁడ ననుచుఁ — జిత్తానందో
త్సవగతి నెగడెడు మనుజుఁడు
శివ! నీ వొండొరుఁడు గాఁడు — జిత సంసారా! 138

భక్తుల ప్రసాద మెప్పుడు
భక్తుల నాకేడుగడయు - భక్తుల గతి యే
భక్తుల వరవుఁడనని శివ
భక్తులఁ గొనియాడ వలయు - భక్తులకు శివా: 139

భక్తుల దవ్వులఁగని శివ
భక్తులు వచ్చిరని పొంగి - బ్రతికితిఁ ని పో
భక్తుల కెదురేగి యథా
శక్తిస్థితిఁ జేయవలయు — సత్క్రియలు శివా! 140

భక్తుఁడు లోకహితార్థుఁడు
భక్త హితార్థుండు శివుఁడు — భావింపఁగ నీ
యుక్తి యథార్థమ్మని నీ
భక్తులఁ బూజింపవలయు — భక్తులకు శివా! 141

లోకాను సారికిని శివ
లోకము దొరకొనదుగాన — లోకము నెమ్మిం
జేకొనక విడిచి శివ! నీ
లోకము గావలయు భక్తి — లోలుఁడు రుద్రా! 142

లోకము విడువని వానిని
లోకము విడువదని విశ్వ — లోకేశ్వర! నీ
లోకముఁ గోరెడు మనుజుఁడు
లోకము వోవిడుచు నీవ — లోకముగ శివా! 143

గురుఁడాదిఁ దనకుఁ గఱపిన
వెరవునఁ జని మీఁద భక్తి - వేదించిన న
గ్గురువుతము గడచి చేసిన
పరవశుఁడై మఱవవలయు - భక్తుం దన్నున్. 144

హర! నీ భక్తి నిషేధక
చరితలు వోవిడిచి నిన్నె - చనఁ గొలిచి నిరం
తర భక్తుఁడై శివైక్యుఁడు
నిరాణ(శ) యగు పసిఁడివోలె - నిలువఁగ వలయున్ 145

కలనైన నొండు దైవము
గలదనియెడు పలుకుదక్కి - కలఁడొక్కఁడ కే
వల శివుఁడె దైవమని ని
శ్చలభక్తి శివైక్యుఁ డుండు - సంతతము శివా! 146

పరువడిన "యోన్యదైవ
స్మరణ సకృ" త్తనఁగ నన్య - సంస్మరణము నం
దిరువదియెనిమిది గోటులు
నరకంబులఁ బొందనా థ - నాథ! మహేశా! 147

కర్తయని నిన్ను నెఱిఁగినఁ
గర్తింపఁడు వెండి తన్నుఁ - గార్యా కార్యా
వర్తనలఁ గర్త నేనని
కర్త ప్రధానుండు గాన - ఘనభక్తుఁ డజా! 148

వ్యక్తముగ లింగతనుఁడను
యుక్తి యెఱుంగుటకుఁ జాల - నుత్కృష్ట మగున్
భక్తైకతనుఁడు శివుఁ డను
యుక్తి యెఱుంగుట సమస్త - యోగానందా! 149

భక్తి కనుదేహ భావ
వ్యక్తుఁడవని నిన్నునమ్మి - వదలక భక్తిన్
భక్తులు నీవని కొలిచిన
భుక్తియు ముక్తియును బడయఁ - బోలు మహేశా! 150

శివుఁడు పరిపూర్ణుఁడను మది
శివభక్తులఁ జూచి యతివి - శేష ప్రీతిన్
వివిధ సపర్యలఁ దనిపిన
నవశ్యమును దానఁ బ్రీతి - యగు నీకు శివా! 151

నిన్నుఁ గని తన్ను జగమును
దన్నుగ మఱవంగవలయు - భక్తునిఁ గని యా
నిన్నును మఱవఁగ వలయు జ
గన్నుత భక్తుండు నీవ - కాఁ దెలిసి శివా ! 152

జంగమ లింగంబగు భ
క్తుంగని పూజింపఁడేని - గోటి విధములన్
లింగార్చన చేసిన వృథ
జంగమ ముత్తమము గాఁగ - స్థావరమునకున్. 153

చూడఁగ శివభక్తునిఁ గని
వేడుకఁ గొనియాడఁ డేని - వృథ యాతని మి
థ్యాడంబర దేవార్చన
యోడునఁ బోసిన జలంబు - యుక్తి మహేశా ! 154

శివభక్తులఁ బూజింపక
శివపూజలు గోటివిధులఁ - జేసిన వృథ యా
శివభక్తులఁ బూజింపుట
శివపూజలు గోటివిధులఁ - జేయుట రుద్రా ! 155

క్రియగొన జంగమలింగము
నియతిం బూజింపఁ డేని - నిష్ఫలములు స
త్క్రియలును బూజలు "లింగ
ద్వయం సమాఖ్యాత" మనిన - వాక్యము మ్రోయున్ 156

ఇంటికి భక్తులు వచ్చినఁ
గంటిమి మంటిమని వారి - కాళ్ళులు గడుగన్
మంటఁగని సీతువాసిన
కంటెను దురితములు వాయుఁ - గఱకంఠ ! శివా ! 157

రుద్రాక్ష భూతిభూషణ
ముద్రాంకితు నెదురుగన్న - ముదమున సాక్షా
ద్రుద్రుఁడని తలఁపఁడేని శి
వా ద్రోహుఁడు నరకగామి - యగును మహేశా ! 158

హరి పద్మజ వాసవ వి
స్తర విభవములనుఁ దృణీకృ - తములసిన మహే
శ్వర ! నీ దృఢ భక్తులకును
సురనర విభవంబు లెంత - చోద్యములు శివా ! 159

అసమాణిమాది గుణరస
రసాయనమ్ములును నిఖిల - రాజిత రాజ్యా
ది సుఖంబులు శివసుఖమున
కసమానము లంద్రు నీ శి - వైక్యులు రుద్రా ! 160

ఆకాశము వొడగెగసిన
భూకంపంబైనఁ బంచ - భూత ప్రళయ
వ్యాకుల మైనను మఱచి శి
వైక్యుఁడు నినువిడిచి యొండు - లాలింపఁడజా ! 161

కులగిరులు జిఱ్ఱఁదిరిగిన
జలరాసులు మేరదప్పి - చనుదెంచిన నీ
వల నెఱిఁగిన దృఢభక్తుఁడు
చలియింపఁ డపార ఘోర - సంసారమునన్. 162

దిక్కులు వీడ్వడి కలసిన
దిక్కరులు మదంబు డిగ్గి - తిరిగిన మఱి నీ

158 "శివద్రోహుఁడు నరకమందుఁ బడును మహేశా !" అనికవి
ప్రయుక్త మగునేమో ! (పూ.ము.)

దిక్కెఱిఁగిన దృఢ భక్తుఁడు
వక్కండెవ్వరికిఁ గార్య - భారమున శివా ! 163

భూతలము తల్లడిల్లినఁ
బాతాళము బయలువడ్డ - బ్రహ్మప్రళయం
బేతెంచిన నీ భక్తుఁడు
చేతులు ద్రిప్పకయ పూజ - సేయును రుద్రా ! 164

వేయేటికిఁ బ్రాణంబులు
వోయినఁ దమతలలు దెగిన – భువిభక్తులు ని
న్నాయతమతి నర్చన
సెయక కుడువరు త్రిలోక - సేవిత చరణా ! 165

ఆయుధములుఁ గుసుమములగు
నాయబ్దులు మెట్టలగు మ – హామదగజముల్
వేయేల గండశిలలగుఁ
బాయక నినుఁగొలుచు సచల - భక్తులకు శివా ! 166

అధమము నత్యుత్తమ మగు
నధర్మమును ధర్మమగును - నాగమవిధి స
ద్విధియగు నిషేధమునుఁ జం
ద్రధరా ! భవదీయ భక్తి - తాత్పర్యులకున్. 167

క్షుత్తృష్ణాది విపత్తులు
బత్తళి జల తపన శీత - [2]వాతాదులు నునే
ద్వృత్తగతిఁ బొంద వెఱచు ను
దాత్త భవద్భక్తి యుక్తు - లగువారి శివా! 168

---

168. బత్తళి = నగ్నత్వము.

పరపరివారిత్వము ని
ష్కరుణత్వము నిత్యయాచ – కత్వము నతిని
ష్ఠుర కర్మత్వము నెన్న(డు(
బొరయవు నీ భక్తవరుల( – బురసంహారా! 169

మరణ పునర్భవతా దు
శ్చరిత్రతా దుర్ముఖతా.......
పరతంత్రతాదు లెన్న(డు(
బొరయవు నీ భక్త వరుల( – బురసంహారా! 170

కోరరు మఱచియు స్వర్గ
స్వారాజ్య ప్రముఖ నిఖిల – సంభూతభవా
పార సుఖంబులు శివరస
భూరి సుఖానుభవ భక్త – పుంగవులు శివా! 171

నీవని యెఱిగిన పిమ్మట
నీవ యెఱుంగుదని యుండు – నీ నిజభక్తుం
డావంతయు నే నని యెడు
భావన( గైకొన(డు( గార్య – భారమున శివా! 172

నీవని యెఱి(గిన పిమ్మట
సేవలనికి బ్రాల డొందు – లెఱు(గ(డు దనకున్
జీవనమెట్లని తల(ప(డు
భావన( గేవల శివైక్య–భక్తు(డు రుద్రా! 173

మును రుద్రు(డు గాని యతం
డనుకీర్తింపండు రుద్రు – నర్చన భావ
మ్మున( దల(ప(డు సూడ(డు గా
వున శివభక్తు(డగు మాన – వు(డు రుద్రు(డు గాన్ 174

జగదుపకారార్థముగా
మొగి రుద్రులు రుద్రలోక – మున నుండి భువిన్
నెగడి శివభక్తులనఁగా
నగణితముగ నవతరింతు - రంద్రాదిమునుల్ 175

మతిఁ జూడఁగ నివ్విధ మీ
క్షితి నిస్సందిగ్ధ మదియు - శివభక్తులు వి
శ్రుతముగ మనుష్య చర్మా
వృత రుద్రుల యగుటఁ దత్త్వ - వేదుల దృష్టిన్. 176

కావున భక్తులు ద్రిజగ
త్పావనులు భవాంధ తమస – పటల విఘటనో
ద్భావిత నిజమహిమార్క వి
భావసుల వినాశు లతిక్ర-పావరు లెందున్. 177

మానిసిపై తోలగప్పిన
యీ వేషమున నున్నరుద్రు - లీశ్వరభక్తుల్
మానుసులె వారు లోకహి
తానేకాచారు లీశ్వ-రాజ్ఞాధారుల్. 178

మానుగ నెప్పుడు "మద్భ
క్తానవినశ్యన్తి" యనఁగ - దగియుండఁగ నీ
శాన ! భవత్కారుణ్యాం
భోనిధి ననుఁదేల్చి ముక్తిఁ - బొందింపు శివా ! 179

దేవా ! నాదుర్గుణములు
భావింపకుమయ్య నీకు–భక్తుఁడ "మద్భ
క్తావిగత కల్మషా" యను
నీవచనము నమ్మినాఁడ – నిరుపమమహిమా ! 180

ప్రణుతింప "నమేభక్తః
ప్రణశ్యతి" యనంగఁదగిన - పలుకునకుఁ దగన్
గణనాథ ! భక్తచింతా
మణి ! రక్షింపవె యపార - మహిమాధారా ! 181

హరిసరసిజాసనాదులు
సరిగారని చెప్పు వివిధ - శాస్త్రములెల్లన్
నరు లీశ్వర భక్తులకును
సరియగుదురె జాతిరూప - సామాన్యములన్ 182

మండెడు మహాగ్నినుండెడు
పిండాయస్థి స్థితిఁ బినాకి - పృథుసన్నిధిమై
నుండెడి శివభక్తులతో
నొండొక దుర్మనుజు లెనయె - యూహింపంగాన్ 183

మ్రొక్కుదురు లింగమూర్తికిఁ
దక్కటిమూర్తులకు మఱియుఁ - దమకలనైనన్
మ్రొక్కెదమని తలఁపరు నర
దిక్కుంజరులనఁగ నెగడు - త్రినయనభక్తుల్ 184

మడఁతి గొడుకర్థమిది యని
యెడసేయరు భక్తినిత్తు - రేలినపతికిన్
బడయుదురు మగుడ వానిన
మృడుభక్తులు వలచిరేని — మెచ్చించి శివున్ 185

మలహారుఁడు జలకమాడిన
జలములు విషములకు మందు — శస్త్రవ్రణ సం
కులమునకు దీపతైలము
త్రిలోచనుని భక్తులకు న - తివిచిత్రమిలన్. 186

తఱిగిన తలలును నదుకును
మఱికోసిన నాలుకలును - మసలక వచ్చుం
గఱకంఠుని భక్తుల కని
యెఱుఁగరె సద్యః ప్రతాపు - లీశ్వర భక్తుల్ 187

పుచ్చిన కన్నులుక్రమ్మఱ
వచ్చును దేహంబు తొడిసి - ప్రస్సిన పుండుం
జెచ్చెరఁ దేరును భక్తుల
కచ్చెరువుగ శివుని మహిమ - నతి శీఘ్రమునన్. 188

చేసిన సుకృతము గుడుతురు
భాసురముగఁ గర్మలెల్లఁ - బరలోకము నం
జేసి తగఁ గుడుతు రిందుల
నా సకలము నెఱుఁగఁ ద్రిభువ — నాధిపు భక్తుల్ 189

కలఁడీశ్వరుఁ డను నమ్మిక
కలవాఁడే శివుని భక్తిఁ గల వాఁడైనన్
మలహరు భక్తులఁ బెద్దలు
కులజులు కులహీనులనఁగ - గూడదు వారిన్ 190

నీచుల నీచులు పరిమిత
వాచులు వాచాలురాత్మ - వశులవశులు స్వే
ష్టాచారు లనాచారు ల [1]
గోచర చరితులు పినాకి - కూరిమి భక్తుల్. 191

నియతాత్ము లనియతాత్ములు
నయ వినయాన్వితులు నయవి - నయ వర్జితు ల
న్వయజు లనన్వయజులు ని
ర్ణయ విరహితమహిము లఖిల - నాయక భక్తుల్ 192

---

1 ల జ్ఞాను (పూ. ము.)

ఆరయఁ బువ్వులకతమున
నారలు దలకెక్కునట్లు - నానావిధ సం
సారులు శివభక్తి మెయిన్
వారక యెప్పుడుఁ ద్రిలోక - వంద్యుల కారే ! 193

శ్వపచుండైనను శివభ
క్తి పరుండగునేని నతఁడ - ద్విజవర్యుం డా
శ్వపచునకుఁ గీడు శివభ
క్తి పరాఙ్ముఖుఁడైనయట్టి - ద్విజుఁడు మహేశా ! 194

పలమెఱు ప్రత్తికినైనను
గుల మమ్మోదు వోవునట్లు - గులమును బలముం
గలిమియు విద్యయు సర్వము
మలహరుఁడగు శివునిభక్తి - మహిమయు కాదే ! 195

ఇవ్వసుమతిఁ గడుఁగమ్మని
పువ్వులలోఁ బుట్టినట్టి - ప్రువ్వులు కొఱయే
సర్వజ్ఞభక్తి విరహితుఁ
డెవ్వఁడు నుత్కృష్టజాతుఁ - డేటికిఁ గొఱయే ! 196

కఱ కంఠుభక్తి వెలిగాఁ
గొఱగా వెవ్వియును నవియు - గొన్నిటి నాళ్లల్
మఱి పిండకూడు పెట్టిన
మెఱయలక్రియ మెఱచు మీస - మెదుకుల మెఱపుల్. 197

భవభావరజో దూషిత
లవు మనుజుల బుద్ధి వనిత — లగణిత దినముల్
శివభావపుణ్యజలముల
నవగాహన సేయకున్న - నశుచుల కారే ! 198

పుట్టనని చచ్చి చావని
పుట్టెడు ప్రుష్వలు విధమునఁ - బురహారు భక్తిన్
ముట్టని మనుజులు సచ్చుచుఁ
బుట్టుచు నుండుదురు ముక్తి - పురి కెడదవులన్. 199

పూజింపుఁడు పూజింపుఁడు
పూజింపుఁడు శివుని భక్తిఁ - బూజింపుఁడు మీ
రోజసెడి నడవకుండుఁడు
రాజులు రట్టళ్లు నగుట - రావెల్లిటికిన్. 200

అవిరల నిష్ఠావృత్తిని
భవదీయ్యార్చనలు సేసి-పడయు సుఖంబుల్
సవిశేష భక్తి భక్తుల
దవులంగని మ్రొక్కు నతఁడు—దానును బడయున్. 201

కని మ్రొక్కుఁడు శివభక్తులఁ
గొనియాడుఁడు మీఁద సుగతిఁ-గొనవలసిన నో
ల్లనినాఁ డూరక యుండుఁడు
మనుజులు దెగడకుఁడు వారి-మంద్రేయేనిన్ 202

అనఘులఁ గేవల భక్తుల
నసుపక్తింగని " సుదూర-మపిగన్తవ్య "
మ్మన దర్శించినఁ జాలదె
గొనకొని శివుఁ జూడవేఱ-కోరఁగనేలా. 203

శ్రీ లింగదేవు భక్తుల
శీలంబుబు మనములోనఁ—జింతింపుచుఁ దా
నాలుక కసివోఁ బొగడని
యాలరి జన్మంబు జన్మ—మనఁగాఁ దగునే ? 204

తెగడిన దుర్గతులగుఁ గడుఁ
బొగడిన సుగతులగు వారిఁ-బురుషోత్తములన్
జగదేక విభుని భక్తులఁ
బొగడరె కృతమతు లగణ్య-పుణ్యోదయులన్. 205

శ్రీయును గులమును శీలము
నాయువు నష్టమగు నతిర-యంబున ముక్తి
శ్రీయుక్తుల శివభక్తులఁ
బాయక నిందించునట్టి-పాపాత్ములకున్, 206

ఏ దేశంబున నేపురి
నేదెస వసియించియుండు-నిల శివభక్తుం
డా దేశంబున నా పురి,
నా దెస వసియించియుండు-హరతీర్థంబుల్. 207

శివభక్తుల యుండెడి చో
ట విముక్త క్షేత్రమండ్రు-రధికప్రీతిన్
శివుఁ డెప్పుడు నుండు జగ
త్పవిత్రమగు నదియ సర్వ-పాపహరంబున్. 208

కడుఁ గడిఁది పాపము నరుం
దొడరిన యెడఁ దలఁచికొనఁగ-దుర్బలుఁడైనన్
మృడుభక్తుల యిండ్లకుఁ జని
తడయక కుడిచినను నీళ్లు-ద్రావినఁ బాయున్. 209

స్ఫుట శివతాంత్రికుఁ డపగత
కుటిలాత్మకుఁ డుద్ధరించు-గోత్రము నెల్లం
బటుమతి "రజ్జుః కూపా
ద్ఘటం యథా" యనిన సూక్తి-గారణమగుటన్. 210

ఓజసెడి నడచు భక్తుల
నోజకు రాఁజేయ శివుఁడ-యొడయఁడు నిక్కం
బోజసెడి నడచు భక్తుల
నోజకు రాఁజేయ శివుఁడ-యొడయఁడు జగతిన్. 211

అధికాపరాధకృతమున
నధమాంత్యుం డెవ్వఁడేని—నగు శివభక్తుం
డధిక బ్రాహ్మణ విధమున
వధకు ననర్హుండు వేద—వాదుల దృష్టిన్. 212

భువిఁ బ్రాణ దండమునకును
శివభక్తుఁ డనర్హుఁ డెన్ని-చేసినఁ దప్పుల్
శివసన్నిధి కారణమున
శివశాస్త్ర పురాణ వచన-సిద్ధాంతగతిన్. 213

తారోదక శివశాసన
కారణమున నెట్టిదైనఁ-గడు మాన్యులు ని
స్తారార్థము దమకు శివా
చార స్థితి నడవవలయు-శశిధరు భక్తుల్. 214

మాకేమీ భక్తులకని
చేకోక శివాజ్ఞ మీఱి-చెడనడచిన నీ
లోకమున మాన్యులగుదురు
గాకెక్కుదురయ్య శివుని-కవిలియ నతగుల్. 215

## శివ నిర్మాల్యము

చవికొరఁగి లోభమున సం
భవింపకయు నన్నమొండు-భంగినయొండెం

దవిలి మలదేహులకు భువి
శివనిర్మాల్యంబు గడు ని-షిద్ధము గుడువన్. 216

ధరణి నభక్తులకు మహే
శ్వరు నిర్మాల్యోపభోగ-సంస్పర్శన త
ద్ధరణ సమాలోకనపద
పరిలంఘన విధులనంత-పాపముఁ జేయున్. 217

క్షితి నాత్మ దేహమన దూ
షిత ప్రదేశంబు రోయుఁ-జెందఁగ నరుఁడె
ట్లతని గతి రోయు శివుఁడును
మతి నిర్మాల్యంబుఁ గుడుచు-మలయుతుఁ జెందన్. 218

నిర్మలపదార్థ మగుటను
నిర్మాల్యం బనఁగ నెగడు-నీ నిర్మాల్యం
బర్మిలిఁ గుడుతురు భక్తులు
కర్మక్షయమగుట మోక్ష-కాంక్షులు రుద్రా! 219

గురుకృతశివదీక్ష మెయిన్
విరహిత మలదేహులగు ప-విత్రులు భక్తుల్
హరనిర్మాల్యము గుడుతురు
పరమేశ్వరునందు దాస-భావముతోడన్. 220

నిరతిశయ భావనిష్ఠా
పరులగు భక్తులకు దాస-భావమున మహే
శ్వర నిర్మాల్యము గుడుచుట
పరమశివాచార ధర్మ-పథము ధరిత్రిన్. 221

భవదోష విఘాతార్థము
శివభక్తుల నియతి నిష్ఠఁ-జేకొను భక్తిన్

శివనిర్మాల్యము గుడుతురు
శివశాస్త్ర పురాణ వచన-సిద్ధాంతగతిన్. 222

ఆకునుఁ బువ్వును గాయయుఁ
బ్రాకటముగ నన్నపాన-భక్ష్యౌషధముల్
శ్రీకంఠున కర్పించక
చేకొనుటలు మద్యమాంస-సేవనగాదే! 223

## శి వ దీ క్షి తుఁ డు

విను వేదశాస్త్రములు చది
విన మఱియు నదీక్షితునకు-విహితముగాదం
ట నదీక్షితున కభక్తుని
కిని శివలింగంబు ముట్టఁ-గ్రియగాదు విధిన్. 224

స్వార్థ పరార్థ శివార్చన
మర్థిని శివదీక్షితునకు-నగుఁ జేయఁగ న
త్యర్థము నిరర్థకంబుభ
యార్థంబు నదీక్షితునకు-నర్చన మెందున్. 225

వెలగొని యదీక్షితుఁడు దే
వలకుండనఁ బూజచేసి-వర్తించు మెయిన్
మలహరుని దీక్షితుఁడు దే
1 వలకుండును గాఁదెలుంగ-వలయును దీనిన్. 226

భవి జన్మాంతర సంస్కా
ర వశంబున సహజభక్తి-రతిపుట్టి శివున్

---

1 వలకఁ దెలుఁగఁగఁ జేయవలయును దీన్. (పూ. ము.)

ధ్రువముగఁ బూజించు మహో
త్సవునకు నీశ్వరుఁడు గురువు-శాంభవ దీక్షన్. 227

శివుఁడు గురుండుగ భజన
మ్మవిరత దృఢభక్తిఁ జేయు-నట్టిశివజ్ఞా
న విదుఁడు దేవలకుఁడుగాఁ
డవు దీక్షితుఁ డుభయ పూజ-కర్హుఁడు జగతిన్. 228

క్షితి నేకగురునిచే దీ
క్షితులెల్లను భ్రాతలంద్రు-శ్రుతులందును ద
త్సుతు లగుటఁజేసి త ద్దీ
క్షితసుతులకు దీక్షవలయుఁ-గ్రతి యోగ్యతకున్. 229

జనకాదులు చేసిన ధ
ర్మ నియోజితయైన కన్య-మానుగ శివభ
క్తున కీవచ్చు విరోధికిఁ
జన దీయంబడయు భక్తి-సన దెడ నుడుగన్. 230

శివభక్తుఁడు కానిపతి

శివభక్తుఁడ వగుమని పతి
క విరతమును బుద్ధిచెప్ప-నగు శివభక్తిం
దవిలిన సతి కతఁ డొడఁబడఁ
డవునేనియు నతని మీఱ-నగు భక్తిమెయిన్. 231

పురుషునకు భక్తిలేదని
పురుషేచ్ఛకు నడవజనదు-పురహరుభక్తిన్
బరగు సతి పురుషు మీఱియుఁ
బురహరుఁ గొలుచునది సిత్త-మున విడిచి పతిన్. 232

పురుష ప్రతికూలత్వ
స్థిరదోషము సతికి దుర్గ-తింజేయదు త
త్పురుషుఁ డభక్తుఁడయేనిం
బురుషుని మీఱియును శివునిఁ-బూజించునెడన్.

అనసూయయు నాలాయని
యను మునిభార్యయు నిజాధి-పాతిక్రమ వృ
త్తిని శివునిచే నభీష్టము
లనూనముగఁ దొల్లి పడసి-రచలిత భక్తిన్. 234

స్వాభావికములు దుర్బో
ధాభావము నీదు కరుణ-నగునంతకము
న్నే భంగులఁ బొగడిన శివ!
నీ భక్తుల మహిమ యెఱుఁగ-నేర్తురె మూఢుల్. 235

వినువక యిది కారణముగ
ననమేఱుఁడు నచలభక్తి-నర్చించుటతో
ససదృశము లన్యధర్మము
లసారములు నీనిఁబోల-వంద్రాదిమునుల్. 236

సరజ్ఞ! రాజశేఖర!
సర్వేశ్వర! యనుచు నొక పిశాచముఁ బొగడన్
సర్వజ్ఞ! రాజుశేఖర!
సర్వేశ్వర! యనఁడు నిన్ను-జడబుద్ధి శివా! 237
జడమతు లల్పము యెఱిఁగెడు
నెడ వారలు శివునిమహిమ-యెఱుఁగుదురె మహిన్
జడనిధి వెడల్పు లోతును
కడు నెఱుఁగునె నూతిలోని-కప్పలుబుద్ధిన్. 238

నెఱిఁ జదువు లెన్ని చదివియు
నెఱుఁగరు జడమతులు శివుని-నిట్టిదకాదే
యెఱుఁగునె వంటకముల చవి
యొఱపుగ మఱియంద మెన్నఁగు-చుండెడి దర్వుల్. 239

వేద పురాణము లెఱిఁగి స
ద్బోదితుఁ డగు శివుని నెఱుఁగ-నోపరు పాపుల్
మేదినిఁ జూచియుఁ బూర్వ ది
శాదిత్యునిఁ గౌశికంబు-లనునవి గనునే. 240

మానక చదువులు చదువుచు
వానికిఁ బ్రతికూలుఁడైన-వానిని శివు ని
త్యానందు నిన్నుఁ గొల్వని
మానిసి గాడ్దియలు భువి న-మాన్యుల కారే! 241

ఒక వైష్ణవుఁ డొక మీమాం
సకుఁ డొక బౌద్ధుండు నొక్క-జైనుఁడుఁ ద్రిపురాం
తకు భక్తునట్ల నిజ సా
త్త్విక దృష్టాంత ప్రసిద్ధిఁ-గీర్తనఁ గనిరే! 242

## భక్తిలేక ముక్తిలేదు

జ్ఞాని యగువాఁడు భక్తివి
హీనుండగునేని ముక్తి-కెయిదఁడు నృపతి
జ్ఞానము గలిగినఁ బ్రోచునె
మానవపతిఁ గొలువకున్న-మానవుని శివా! 243

గజశాస్త్ర మెఱిఁగినంతనె
గజాధిరోహణము సేయఁ-గావచ్చునె? ని

న్నజు సర్వేశ్వరు నెఱిఁగియు
భజియింపక ముక్తివడయ-భారముగాదే!

ఎడవడని శివజ్ఞానము
దొడరి సమస్తమును విడిచి-దురహంకారం
బుడిగి తను మఱచునంతకు
మృడుఁ గొల్వఁగవలయుఁ గ్రియల-మెయి నిన్ను శివా! 245

వేసరక క్రియాఫల స
న్యాసము గావించి క్రియల-నానావిషయ
వ్యాసంగ ముడుగు నంతకు
వాసనమై నిన్నుఁ గొలువ-వలయు మహేశా! 246

క్రియలుడిగి యోగినని యా
రయ విషయము లుడుగకున్న-రాగాంధుఁడు ప్ర
త్యయ విరహితాత్ముఁ డతి పా
పయుతాత్ముం డాతఁ-డుభయ భ్రష్టుఁడు రుద్రా! 247

క్రియ ఒజిఁగి యెఱిఁగి యుడిగిన
యయుక్తి యుక్తుండు పతితుఁ – డగుఁబడు క్రియకా
శ్రయమైన యహంకారము
క్రియగొనఁగానుడుగక నె-క్రియలుడుగ శివా! 248

పనని యెడు నభిమానము
జానుగ బిరు దుడుగుటయు ని-జక్రియలు నుదా
సీనములై పిరుదుడుగును
దానై యుడిగెద ననంగఁ-దగదు మహేశా! 249

ఉన్నత సముదిత నిజసం
పన్నాభ్యంతర శివైక్య-భావానుగతిం
దన్నెఱుఁగ మఱచు నంతకు
బన్నుగఁ బూజింపవలయు-బాహ్యమున శివున్. 250

పొరిఁ దనకుఁ దానక్రియలవి
నిరంతరాభ్యాసప క్వ—నిర్ణింతాతః
కరణ విశుద్ధ శివైక్య
స్ఫురణత జ్ఞాన ప్రలీన-బుద్ధికి నుడుగున్. 251

ఏనని యెఱుఁగుట మఱచి శి
వానందానుభవమగ్నుఁ-డగునంతకు ము
న్నెనుడిగెదనని బాహ్య వి
తాన శివారాధనంబు-దగ దెడ నుడుగన్. 252

అంగంబగు నాభ్యంతర
మంగజహారునకుఁ బ్రధాన-మగుబాహ్యం బా
యంగప్రధానములలో
నంగము సేకొని ప్రధాన-మగునే! విడువన్. 253

అంగాభ్యంతర విధమున
నంగజహారుఁ గొలిచి ముఖ్య-మగుబాహ్యవిధిన్
లింగాకృతి శివుఁ గొలువని
వెంగలి మానవులకంటె-వెడఁగులు కలరే! 254

సాంగముగా వేదములకు
భంగిన వేదాంతములకు-బ్రహ్మాదులకున్
లింగస్వరూప విరహిత
గంగాధర రూప మెఱుఁగఁ-గాఁ దలమగునే ! 255

వనజాసన వనజోదర
సనకాదులు ముఖ్య బాహ్య- సంత్యాగము సే
సినవారు గారు తక్కటి
పినుఁగులు బాహ్యంబు విడిచి-పెద్దయుఁ జెడరే ! 256

స్థిర ముఖ్య బాహ్య పూజా
కరణము లేదయ్యెనేని—గౌణకృతాభ్యం
తర విధినైనను భక్తిం
బరమేశ్వరుఁ గొలువకునికి—పాపముగాదే ! 257

పరమహిత యథోక్తాభ్యం
తరపూజను విడిచి యేన—దైవము నని దె
ప్పరమగు నాస్తిక్యమతిన్
హరుఁ గొలువని నరుఁడు పతితుఁ-డనఁబడు జగతిన్. 258

అవికల దేవాసుర నర
నివహా సదాపూజనీయ—నిత్యోత్సవ స
చ్ఛివలింగ పరాఙ్ముఖ మా
నవ సంభాషణము లెల్ల-నరకార్థమగున్. 259

## బాహ్యపూజ సేయవలయును

ఒడలు గుడి యంతరాత్మయు
బడరుండను పలుకు లుడిగి-భక్తిని గుడియే
గుడియనియు లింగమూర్తియ
బడరుండని కొలువకునికి-పాతకము శివా ! 260

వేదోక్త విహిత కర్మ మ
హా దేవార్చన విహీనుఁ-డగు పాపండిం

గా చెదురుఁ జూడఁ జూచిన
యా దోషమువోవఁ జూచు-నదిభక్తులకున్. 261

శివసమయంబున కెడ రెడు
నవినీతుల రెంత పెద్ద-లైనను మ్రొక్కన్
శివభక్తులకును దగ ద
క్కు విచారుల మ్రొక్కు లెపుడు-గొనఁ గాదు శివా! 262

కాదప్పుఁ గొనఁగ నప్పుఁ
గాదీఁ గొనఁ గాదు గాదు—కనఁ దమలో నా
హ్లాదమునఁ బలుకఁగాదు మ
హాదేవ పరాఙ్ముఖాత్ము-లగు పతితులతోన్. 263

కాదు సమశయ్యఁ బొందం
గాదు సమాసనముపందుఁ-గదియఁ జరింపం
గాదు సహవాసమును మ
హాదేవ పరాఙ్ముఖాత్ము-లగు పతితులతోన్. 264

కా దతని వేఁడి కుడువం
గా దతనికిఁ గుడువఁబెట్టఁ-గాదు భుజింపం
గా దీఁ గొన దానమును మ
హాదేవ పరాఙ్ముఖాత్మ-లగు చరితులతోన్. 265

చేతోజాత విమర్దన!
భాతిగ నినుఁ గొలువనట్టి-పాలసునకు సం
ప్రీతిని గుడువంబెట్టిన
దాతకు యమదండనంబుఁ-దప్పదు రుద్రా! 266

(జ్ఞానము వైరాగ్యము ననఁ
గా) నించుకలేని నాస్తి-కస్థితి విషయా

ధీన దురాచారికి యో
గానందము గలుగ నేర్పు-నయ్యా మహేశా? 267

అవిరత నిరతిశయంబుగ
శివయోగ రసానుభవ వి-శిష్టసుఖంబుల్
దవిలిన యోగులు విషయో
ద్భవసుఖ లేశంబు మఱచి-తలఁతురు రుద్రా! 268

నిన్నెఱుఁగుచుఁ దన్నెఱుఁగని
యన్నఁడు శివయోగమగ్నుఁ డనఁబడఁ (డెపుడున్)
నిన్నునుఁ దన్ను నెఱింగెడి
యన్నఁడు శివయోగమగ్నుఁ-డనఁబడును శివా! 269

ఎడపక యష్టాంగంబై
షడంగమై యొండెఁ బరఁగు-శంకరయోగం
బెడ యుడుగ కభ్యసించిన
గడుకొని సంసారవార్ధిఁ-గడువఁగవచ్చున్. 270

అష్టాంగయోగ భక్తి న
భీష్ట ఫలప్రదుఁడవైన యీశ్వర! నిన్నుం
దుష్టిసనఁ గొలిచి ముక్తి వి
శిష్ట సుఖాఢ్యు లగు టరుదె-శివయోగాఖ్యుల్. 271

శివయోగి దర్శనంబున
నవు గంగాస్నాన సమ మ—హాపుణ్యఫలో
త్సవగతి తత్సంభాషణ
సవినయవిధి సకలతీర్థ-సత్ఫల మడరున్. 272

వేదవిదులైన కోటి మ
హీ దేవోత్తములు గుడిచి-యిచ్చు ఫలం బా

హ్లాదంబున శివయోగికి
నాదట భిక్షంబు వెట్టి-నంతన పొందున్. 273

శివయోగి శిరంబుననే
శివుఁ డెప్పుడు నుండునని వి-శేషప్రీతిన్
శివయోగిఁ జూచి సాక్షా
చ్ఛివుఁడని కడు భక్తిఁ బూజ-సేయఁగవలయున్. 274

ధ్రువముగ సర్వప్రాణుల
నవశ్యమునుఁ జేయకుండు-నది హింస మదిన్
శివనిందకులగు పాపుల
నవిచారితవృత్తిఁ...నీశానా! 275

సంహృత శివ! నీ భక్తికి
నంహోమతివక్రులైన-నప్పుడ....
............యనుటను
......... ...పథము-జనకులనైనన్. 276

శివనిందా విషయంబగు
నవమానము సెప్పునట్టి-యప్పుస్తకముల్
అవిచారంబునఁ...
నవుఁ జెప్పెడివానిఁ ... నీశానా! 277

శివనిందారతుఁ ...
జవ మఱి తత్కారణమునఁ-.... నీరెం
డువిధంబుల నీ కారు
ణ్యావశంబున ముక్తిఁబొందు-నరుఁ డీశానా! 278

## జీవత్యాగము

శివ ! నీ తదర్థమొండెను
శివభక్తార్థంబ యొండె-శివవిద్యాచా
ర్య విషయమొండెను జీవ
మ్ము విసర్జించిన నరుండు-ముక్తుఁడు రుద్రా ! 279

పావనమైన శివక్షే
త్రావాసమునందు నొండె-ననశనవిధిమై
జీవత్యాగము చేసిన
భూవినుతుఁడు మోక్షపదవిఁ-బొందు మహేశా ! 280

శివతీర్థములో నొండెను
శివాజ్ఞలో నొండెఁ దాను-జీవత్యాగం
బు విధించిన మానవుఁడును
భవత్ప్రసాదమున ముక్తిఁ-బడయు మహేశా ! 281

ఎందును శివార్థముగఁ మృతిఁ
బొందిన పుణ్యాత్ము బంధు-పుత్రాదులకున్
బొందదు సూతక మతనికి
వందురి పరలోక విధులు-వలదు మహేశా ! 282

వెండియు శివార్థమృతునికి
నొండొక పరలోకవిధులు-నొడఁబడిరే వా
రొండుడిగి యథాశక్తిం
బండుగ సేయుదురు రుద్ర-భక్తులకు శివా ! 283

పితృలోక విష్ణులోకము
లతిక్రమించి శివపురికి-నరిగెడు భక్త
ప్రతతికిఁ బితృమేధక్రియ
లతిశయముగఁ జేయునాతఁ-డజ్ఞుఁడు రుద్రా ! 284

అంతకరిపుభక్తుని దే
హాంతంబున నతని యర్థ-మాగమ యుక్తిన్
సంతతి గలిగినఁ దత్పుశు
సంతతి కీఁదగదు శైవ-సంతతి దక్కన్.	285

శివాపచారులకు శిక్ష

సకలామర దైతేయ
ప్రకర సదారాధ్యమాన-పాదాబ్జ భవాం
తక ! నీ భక్తుల దుర్గుణ
శకలంబుల వెదకువాఁడు-చండాలుఁ డజా !	286

శివ ! నిన్నును వేదములను
శివభక్తుల బ్రాహ్మణులనుఁ-జెడనాడెడు పు
ణ్యవిహీనుఁ డధోగతిఁబడి
యవిరళ నరకాగ్ని బాధ-లందు మహేశా !	287

శివభక్తులఁ జెడనాడెడు
నవినీతుఁడు ఘోర రౌర-వాగ్నుల బడి యా
రవితారకముగఁ గాలుచు
ధ్రువముగ వాచఱచుచుండు-దురితారాతీ !	288

వెఱవక నీ గుడిలోపల
గుఱుకొని యాలాపువెట్టు-కొనియుండెడి పా
దఱి జముదూతలు గుక్కలఁ
గఱపింతురు మూఁటకట్లు-గట్టి మహేశా !	289

ప్రమదాసంగతి చేసిన
న్నమిసిన మఱి కాళ్ళు సాచి-యుండిన శివగే

హాములోన జూదమాడిన
నమిత మహానరకబాధ-లందు మహేశా ! 290

పావలుఁ జెప్పులు తొడుకొని
దేవ! శివాలయములోనఁ-ద్రిమ్మఱు పాపుల్
వా విడిచి నిగళబంధము
తో వాచఱచును గాలు-దురు నరకాగ్నిన్. 291

కుడిచిన నీళ్లాడిన మఱి
గుడిలోపల నలుఁగువెట్టు-కొన్న నభీష్టం
బడుగఁగ నవ్విన దుర్గతిఁ
బడుదురు బాధలను నధిక-పాపాత్ము లజా ! 292

గుడిలో ముద్దటలడిచిన
గుడిలో వెంద్రుకలు వాచి-కొనినను నెపుడుం
గడు వెఱవక విహరించిన
గడుసరి నరకాగ్ని శిఖలఁ- గాలు మహేశా ! 293

అతి గర్వోదాసీనత
గతభయుఁడై శివ ! శివోప-కరణ ద్రవ్య
ప్రతతులఁ గాళ్లం దన్నిన
నత కడచిన ద్రోహి రౌర-వాగ్నులఁ గాలున్. 294

మృడ ! నీ తోఁటల పువ్వులు
ముడిచిన మఱిగానిఁ గోసి-మూర్కొన్న నరుల్
కడుఁ గ్రాఁగిన సూదులతో
నడవఁగఁబడి నరకబాధ-లందుదురు శివా ! 295

శివ ! నీ తోఁటల లోపల
శివ గృహములలోన నొండు - సితమున మూత్రా
ద్యవకార్యంబులు చేసిన
యవినీతుఁడు ఘోర రౌర - వాగ్నులఁ గాలున్ 296

ఉత్తమ కుల విద్యా గుణ
విత్తోద్యోగాది సకల - విషయము లెల్లన్
రిత్తయ బుద్ధిఁ దలంప ను
దాత్త భవద్భక్తి లేని - యధములకు శివా ! 297

కులమునుఁ గలిమియుఁ బ్రాయము
గలిగియు మఱిముక్కు లేని - కాంతయపోలెం
గులమును గలిమియుఁ బ్రాయము
గలిగియు శివభక్తి లేని - కష్టుఁడు రుద్రా ! 298

శ్రీరమణార్చిత ! దురితని
వారణ ! నీభక్తి లేని - వారల విద్యా
చారకుల రూపసంపద
లారయఁగా నిష్ఫలంబు - లన్నియు రుద్రా ! 299

## దక్షాధ్వర ధ్వంసము

సుర ముని వైదికమత సు
స్థిరముగ దక్షప్రజాప - తి యొనర్చిన వి
స్తర సత్క్రియ దేవ ! భవ
ద్విరహితముగఁ జేసికాదె ! - విఫలతనొందెన్. 300

వేదములు ప్రమాణములుగ
నాదిన యొడఁబడియు వాని - నతకడచి భవ

1. శితమున (చిత్తమున)

త్పాదనుతి విడిచి చెడియెను
పాదటి దక్షుండు వీర-భద్రునిచేతన్. 301

అలరిదైయె శివుఁ బలికిన
పాలసుఁ డని కినిసి వీర-భద్రుఁడు ఫాలా
భీల విలోచన దహన
జ్వాలల మును దక్షు జన్న-సాలను గాల్చెన్. 302

భూతములు దర్భ(త్రాళ్ళను
హోతల మెడ లంటఁగట్టి-యూపతతులతోఁ
(దేతాగ్నులు యాగాళ్వము
భూతేశ్వర ! గంగలోనఁ-బో వైచె నజా ! 303

ఆమిషముం గని రుద్రుని
రోమజ గణపతులు చరు, పు-రోడాశహుహో
హోమద్రవ్యములెల్లను
నీ మహిమంజేసి దక్షు-నిం జెఱచి రజా ! 304

ధర్మాది సదస్యులు శివ
ధర్మవిహీనుండునై న-దక్షునిసభలోఁ
బేర్మి చెడి భూతములచే
దుర్మదులై కొట్టువడిరి-సురితారాతీ ! 305

ఎలుకల నడచిన విధమున
నలయక దక్షాధ్వరమున-కనివచ్చిన సా
ధుల మునుల నడిచి చంపిరి
గలహంబునఁ బెరిగి ప్రమథ-గణములు రుద్రా ! 306

కలియుగమున [1]జారులచే
బలిమిఁ గులస్త్రీలు వడ్డ-భంగిన హర ! నీ
కలుషమున నమరవనితలు
వెలయంగాఁ జెడిరి భూత-భేతాళురచేన్. 307

గోకులమును గోపాలకుఁ
డాకులమునఁ దోలునట్టు-లమరుల నెల్లం
జేకొనక తోలి చంపె మ
హా కోపుఁడు వీరభద్రుఁ-డతిబలుఁడు శివా ! 308

మారారిద్రోహు లింటికిఁ
భేరంటమువచ్చి తనుచుఁ-బెలుచను గోసెన్
వైరమున నదితి ముక్కును
భారతి నాసికయు వీర-భద్రుఁడు రుద్రా ! 309

అలరి దక్షుని నోమున
కేలా చనుదెంచి తనుచు-నీశాన దిశా
(పాలకులను సురనికరము
శూలముతోఁ బొడిచి చంపఁ-జొచ్చిరి రుద్రా !) 310

దక్షశిరంబును రణజయ
శిక్షావిధి యజ్ఞపురుషు-శిరమును దునిమెన్
దక్షాధ్వరంబులోఁ బ్రతి
పక్ష క్షయకారి వీర-భద్రుఁడు రుద్రా ! 311

నిష్ఠురముగఁ బ్రమథగణ
ప్రష్ఠుండై నెగడు వీర-భద్రుఁడు దారా

---

1 జోరులచే

జ్యేష్ఠుని( జంద్రుని( బాదాం
గుష్ఠంబున( ధరణి( ద్రామె(-గోపమున శివా! 312

వడి మృగరూపము( గైకొని
చెడి పాఱెడు యజ్ఞపురుషు-శిరము దెగన్ ద్రే
ళ్మిడిలోన నేసి చంపెను
గడువీరు(డు వీరభద్ర-గణనాథు( డజా. 313

స్వాహాపతి భామినియగు
స్వాహాంగన ముక్కు నెడమ-చనుమొనయు దగన్
సాహసముతోడ( జిదిమిన
బాహుబలంబొప్పె వీర-భద్రునకు శివా! 314

స్వాహాపతి జిహ్వా శివ
ద్రోహుని జన్నమున నాహు-తులు గొన్నదియన్
ద్రోహమున( గోసివైచెను
బాహుబలుండైన వీర-భద్రు(డు రుద్రా! 315

పోల(గ దక్షు(డు సత్క్రియ
మేలని చేయుటకు నశ్వ-మేధము గీడై
కోలాహలమయ్యె( గ్రియలు
సాల(గ శివభక్తి లేక-సహజములగునే? 316

కర్మఫలదాత త్రిజగ
న్నిర్మాత మహేశ్వరుండు-నిఖిల పశువ్రా
తమ్ముల కధిపతి యని క్రియ
లిమ్ముల( జేయునది మనుజు-లీశ్వరభక్తిన్. 317

ఆ హరి సురేంద్రముఖ్యా సు
ధాహారుల నెల్ల నిట్టు-లత్యుద్ధతిమై
దేహములు గోసివైచిన
బాహుబలం బొప్పె వీర-భద్రునకు శివా! 318

ఆహవమునందుఁ దెగి య
య్యాహవనీయాగ్నిఁ బడియె-నట విష్ణుశిరం
బాహా! నీ కింకరునకు
బాహుబలంబొప్పె వీర-భద్రునకు శివా! 319

## ప్రళయవర్ణనము

కర్మక్షయంబు గామిని
నిర్మలమోక్షంబు లేమి-నిఖిల-పశువ్రా
తమ్ముల దుఃఖంబులుగని
నిర్మింతు లయంబు గొంత-నిర్వృతికి శివా! 320

కరుణాకరుఁడవు గావున
విరచిత బహు జీవరాశి-విశ్రమహేతు
స్థిరమల నిఖిలజగత్సం
హారణము గావింతు కరుణ-నతిమహిమ శివా! 321

## గణాధిపుల యాటలు

ప్రమథులు రుద్రులు మఱి భూ
తము లనఁగాఁ ద్రివిధమూర్త్యదళములతోడన్
సమసు ప్తినాథ! నీ గణ
సమూహములు సంహరించు-జగములు రుద్రా! 322

కుమ్మరి దరిగొల్పిన చి
[1]చ్చుమ్మల నావమ్మ కడవ-[2]ల్లుల్ల దరికొనం
గ్రమ్మగతి నజాండంబునఁ
బ్రమ్మ భవన్నె త్రవహ్ని-ప్రళయమున శివా! 323

భవదుద్భట నిటలేక్షణ
భవజృంభిత [3]విలయవహ్ని-పర్వి జగద్వి
ప్లవహేతువయ్యెఁ బ్రమథుల
కవిరళ సుఖహేతువయ్యె-నదియె మహేశా! 324

లోకంబులు ప్రళయాగ్ని శి
ఖా కలితములై తదగ్నిఁ-గాలఁగఁ బ్రమథా
నీకములు వెరిగి యాడు మ
హా కౌముదిఁ దేలియాడు-నట్లు మహేశా! 325

త్ర్యంబక! నీ ప్రమథగణా
డంబర విభవంబు గడు నొ-డంబడ సంహా
రంబును వర్ణనసేయఁగ
లంబోదర షణ్ముఖాదు-లకు నరిది శివా! 326

ససముద్ర ద్వీపాచల
వసుమతి వడి మీఁది కెగుర-వైచి సనక్ష
త్ర సురావాసాకాశము
వెసఁ గ్రిందికిఁ దివుచుఁ బ్రమథ-విభుఁడొకఁడు శివా! 327

కడు మండెడు బడబాగ్నిం
దడయక వడిఁ గూడఁ దిగిచి-తననుదుటను జో

చ్చిమ్ముల ల్లెల్ల దరికొనం. విటల

ట్టిడికొని యానందంబున
వెడ సోలుచునాఁడుఁ బ్రమథ-విభుఁడొకఁడు శివా ! 328

సకల సముద్రజలంబులు
నొక గణనాయకుఁడు ద్రాగి-హ్రొబ్బని త్రేన్పున్
సకల గ్రహతారకములు
నొక గణనాయకుఁడు వాఱ-నూఁదు మహేశా ! 329

ద్వీపము లేదును జక్ర
వ్యాపారవిధమునఁ ద్రిప్పి-వైతురు వాఱన్
నీ పంపునఁ గొందఱు బహు
రూపులు గణనాయకులు వి-రూపాక్ష ! శివా ! 330

యమ మహిషశృంగములు నిం
ద్ర మహాగజదంతములుఁ బ్ర-తాపముతోడన్
సమసుప్తి దుస్సికొని నీ
ప్రమథులుఁ దాలములు వేసి-పాడుదురు శివా ! 331

పడవేసి మృత్యుదేవర
మెడ మడమలఁ ద్రొక్కి దాని-మెఱసెడి కోఱల్
వడిఁ బెఱికికొని మహోల్కము
లుడుగక త్రిప్పు క్రియఁ ద్రిప్పు-నొకగణము శివా ! 332

వరుణునిమకరము వాయువు
హరిణముఁ గడిచేసి మ్రింగి-యాసురముగ ది
క్కరులం దిని త్రేఁచును శం
కర ! నీ గణనాథుఁడొకఁడు-గడికాఁడు శివా ! 333

కొందఱు గణపతు లత్తఱి
మందర హిమవత్ప్రధాన-మహిత మహీభృ
త్సందోహంబులుఁ గొని కడు
నందముగా సూడుపట్టె-లాడుదురు శివా! 334

సుర పర్వతాది ధరణీ
ధర కందుక కేళి సలిపి-తత్క్షణమున న-
గ్గిరులు వొడిచేసి చల్లుచు
నరుదుగ గణపతులు గొంద-ఱాడుదురు శివా! 335

పూని వడిఁ దిగిచి యష్టమ
హా నాగమ్ములను [1]ముది-యలుగా వ్రేళ్ళన్
మానుగఁ గొందఱు దాల్తురు
వాని ఫణామణుల రుచులు-వఱ్ఱుగబ్రమథుల్. 336

ఆదివరాహము వెరిగిన
యా దంష్ట్రలు వెఱికి తన ని-జాస్యంబున సం
పాదించికొని నటించు మ
హాదర్పముతోడ నొక గ-ణాధిపుఁడు శివా! 337

మఱి యాదికూర్మపృష్ఠము
డొలయఁగ వడిఁ బొడిచి యందుఁ-దూర్చి ఫణీంద్రున్
నెఱిఁ ద్రిప్పటముగఁ ద్రిప్పుచు
వఱలఁగ గణనాథుఁ డొకఁడు-వడినాడు శివా! 338

నరసింహుని కంఠంబును
నరుణ జటాకేసరంబు-లంటిక పాదాం

---

1 మిద్దియలు

బురుహా మణి పీఠమునఁ బొ
ల్పారుదుగ రచియించునొక గ-ణాధిపుఁడు శివా! 339

ప్రమథాధిపతులు గొందఱు
కొమరుగ నొడ్డణము దండ-గుచ్చిన భంగిన్
హిమకరమండలమును సూ
ర్య మండలము దండ గుచ్చి - యాడుదురు శివా! 340

నుఱుమై పఱియలు వాఱఁగ
నఱచేత నజాండ ఖాండ — మవియఁగ వ్రేయన్
మఱి బ్రహ్మ యేఁడి యనుచును
వఱలఁగ గణనాథుఁడొక్కఁడు — వడి వెదకు శివా! 341

వారిజభవుని కపాలము
గోరి త్రివిక్రముని వీపు — కోలెమ్ముతుదిం
జారుగతి నిలిపి ఛత్రా
కారంబుగఁ దాల్చియాడు -- గణనాథుఁడజా! 342

చరణంబులుఁ జరణంబులుఁ
గరములుఁ గరములునుఁ బెనఁచి — కంఠమున గణే
శ్వరుఁడొకఁడు దాల్చి యాడును
విరించి విష్ణుల సబములు — విలయమున శివా! 343

వడి నిడుపుగఁ బెరుఁగుదు ర
ప్పుడ నిడుపుడిగించి గుజ్జుఁ — బొడవగుదురు పి
ద్పడి వలుద తుఱంగు లొల్లక
కడు సన్నము లగుదు రిట్లు — గణములు రుద్రా! 344

వెగడుగ వసు రుద్రాది
త్యాగకేశ సమస్త దేవ - తారాతుగ ప
న్నగ గణము లన్నియును జెడి
గగనంబంతయును బ్రమథ - గణమయ్యె శివా! 345

ఆడుదురు జతలు వెట్టుచుఁ
బాడుదురున్ గతులుచేసి - పరమానంద
క్రీడా సంగతిఁ బ్రమథులు
కూడి వినోదింతు రిట్లుఁ - గొమరుగ రుద్రా! 346

లోకా లోకము సురపతి
లోకముతోఁగూడి బ్రహ్మ-లోకము మఱి యా
వైకుంఠలోకమునుఁ జెడి
లోకత్రయమెల్లఁ బ్రమథ - లోకంబయ్యెన్. 347

శివగణ వర్ణనము

ప్రమథ గణంబు లసంఖ్యా
కము లీశ్వర! యెఱుఁగ వ్రేఁగు - దత్సంఖ్యలు వే
దములు "నసంఖ్యాతా" యని
యమరఁగ ఘోషించుచున్న-యవి గడలేమిన్. 348

సకల కుల పర్వతంబులు
నకుటిలగతి గ్రుచ్చి కంఠ-హారముగా నొ
క్కొకమాటు భవద్గణ నా
యకుండుఁ దాఁ దాల్చుఁ బర్వ - తాభరణుఁ డజా! 349

పరివిలయవేళ మేరువుఁ
బరిమార్పుటఁ జేసి మేరు - పాతనుఁ డ గాఁ

బరఁగిన గణనాయకుఁడొకఁ
డరు దెవ్వరికైనఁ బొగడ - నక్కజుఁడు శివా! 350

ఒండేమి సమస్త బ్ర
హ్మాండంబులుఁ బూసపేరు-లై యుండఁగ ను
ద్దండగతి గ్రుచ్చి యాడఁగ
నండాభరణుఁడన నెగడె - నతిబలుఁడు శివా! 351

వెండి హరి బ్రహ్మదుల
రుండము లాభరణములుగ......
రుండా భరణుఁడు నా నధి
కుండు భవద్గణవిభుండు - గురుభుజుఁడు శివా! 352

వెండియు నానాకారులు
వెండియు నానాప్రతాప - విక్రమ విభవుల్
దండిత దైత్యేంద్రులు వర
[1]గుండప్రియ! నీ గణములు - గొందఱు రుద్రా! 353

లాలాసుర వక్షస్స్థల
కీలాల జలప్రవాహా - కేళీలోలా
ఖీల త్రిశూల హస్తులు
హాల హాలాంకులు భవద్గ-ణాధిపులు శివా! 354

రాజార్ధధరులు నరసుర
రాజామతభయులు రాజ - రాజ సఖులు గో
రాజపతాకులు గేశవ
రాజప్రియ! నీగణములు - రాజాభరణా! 355

1. గొండప్రియ

బ్రహ్మాభివంద్య ముఖ్యులు
బ్రహ్మ కపాలావళీ వి-రాజితులు వర
బ్రహ్మకారులు (ధీరులు)
బ్రహ్మేశ్వర ! నీ గణాధి-పతులు కపర్ది ! 356

శ్రీరమణులు సకల జయ
శ్రీరమణులు వేదశాస్త్ర - శివతత్త్వవిదుల్
సీరాల ప్రియ ! భోజను
హారాజ ప్రియ ! భవద్గ-ణాధిపులు శివా. 357

వివిధాబ్ద మహాజలధర
రవులు, గణేశ్వరులు, మలయ - రాజప్రియ...
......గొందలు
భువనత్రయ సుందరులు త్రి-పురదహన శివా ! 358

శ్రీ శ్రీ దిగంబరులు వాక్
శ్రీశ్రిత మహిములు జగత్ప్ర-సిద్ధులు భక్తి
శ్రీశ్రిత హృదయాంభోజులు
శ్రీశ్రిత ! నీగణములెపుడ - జేయులు రుద్రా ! 359

లంబోష్ఠ లంబనాసిక
లంబోదర లంబనేత్ర లంబశ్రవణుల్
లంబహాను లంబజిహ్వలు
నంబాప్రియ ! నీ గణాధి-నాయకులు శివా ! 360

అజకర్ణ లశ్వకర్ణులు
గజకర్ణ వరాహకర్ణ - ఘంటాకర్ణుల్
త్రిజగద్రమణీయులుఁ దెలుఁ
గు జోమయప్రియ ! నీ గణములు - గొందలు రుద్రా ! 36

అజముఖ వరాహ ముఖులును
గజముఖ మార్జాల ముఖులు - గణ నాయకు లం
డజ ముఖులు వెండియప్పుడు
నజామరుల కధిక తేజు - లాశ్చర్యులజా !    362

గోముఖులు వరాహముఖులు
సామజముఖు లుష్ట్రిముఖులు - సారంగముఖుల్
భీమ వ్యాఘ్రముఖులు నా
నాముఖులు భవద్గణాధి-నాయకులు శివా !    363

నానావర్ణ సమేతులు
నానారూపధరు లర్ధ-నారీశ్వరు ల
శ్వానన మహిషానన సిం
హానన శరభాననులు గ-ణాధిపులు శివా !    364

ముఖపాదులు పాదముఖుల్
ముఖకుక్షులు కుక్షిముఖులు - ముఖహీనులు ష
ణ్ముఖ పంచముఖ చతుర్ముఖు
లఖండ విక్రములు నీగ-ణాధిపులు శివా !    365

ద్విముఖ త్రిముఖ గణాధిపు
లమేయ గుణులురుతరముఖ స-హస్రముఖు ల్స
ప్తముఖాష్ట ముఖ నవముఖ ద
శ ముఖులు నీకింకరులు వి-చారింప శివా !    366

బాహుముఖులు ముఖబాహులు
బాహూదరు లుదరదీర్ఘ-బాహులు గొందఱ్
బాహూరు లూరుబాహుల
బాహులు బహుబాహు లేక - బాహులు ప్రమథుల్    367

బహువక్త్రు లేక వక్త్రులు
బహుదంష్ట్రు లదంష్ట్రు లధిక-బలసంపన్నుల్
బహునేత్రు లేక నేత్రులు
బహుకర్ణు లకర్ణులెన్నఁ – బ్రమథులు రుద్రా! 368

బహు జిహ్వు లేక జిహ్వులు
బహుపాదు లపాదు లేక-పాదులు గొందఱ్
బహు ఘోణులు బహు మేఢ్రులు
బహురూపులు నీగణాధి-పతులు కపర్ది! 369

గణుతింపఁగ మఱికొందఱు
గణపతులుఁ గపాలమాలి-కా విషధర కం
కణ చంద్రకలా భూషణు
లణిమాది గుణాన్వితులు మ-హాత్ములు రుద్రా! 370

పింగళ కపర్ద డమరుక
గంగా భసితాంగరాగ - ఖట్వాంగధరుల్
భృంగిరిటిప్రియ! నీ గణ
పుంగవులు సమస్తలోక - పూజితులు శివా! 371

కంటక నరసింహ శిరో
లుంటాకు లినేందువహ్ని - లోచను లుగ్రుల్
ఘంటాకర్ణప్రియ! ని
ష్కంటకులు భవద్గణాళి - గౌరవ మహిమన్. 372

నీలగ్రీవులు శుంభ
త్ఫాలాభీలాక్షిదహన - భస్మీకృత దు
శ్శీల త్రిపుర మహాసుర
కోలాహలు లెన్నఁ బ్రమథ – కుంజరులు శివా! 373

త్ర్యక్షు ! భవద్గణ నాయకు
లుక్షేంద్రారోహణులు మహోక్ష పతాకుల్
దక్షాధ్వర విధ్వంసులు
సాక్షాత్పరమార్థతత్త్వ — సమ్యగ్జ్ఞానుల్ 374

కరినరసింహ వ్యాఘ్రా
సుర చర్మధరు ల్మహోగ్ర - శూలధరు ల్భీ
కర పన్నగేంద్రకంకణ
ధరులు భవద్గణము లధిక - దర్పితులు శివా ! 375

నారాయణాది సురదను
జోరగ మునిమానవేంద్ర - యూథ సదా లో
కారాధ్య మాన చరణాం
భోరుహులు గదయ్యా ! ప్రమథ — పుంగవులు శివా ! 376

చక్రాసహ విక్రములుం ద్రి
విక్రములుం గపాలధరులు - విధిమస్తకదా
మాక్రాంతోదరు లాజి
ప్రక్రమ పాలనులు ప్రమథ-వర్గము రుద్రా ! 377

మురవైరి పంకజాసన
శిరో విభేదకులు సకల - శివధర్మ విదుల్
భరిత జగదండ రక్షా
పరాయణులు భూరిభూజులు - ప్రమథులు రుద్రా ! 378

ధరిత శిఖండులు ముండులు
గురు లఘువులు స్థూలసూక్ష్మ - కుంజరదీర్ఘుల్
పరికింపం గామరూపులు
ఘోర ! కొందఱు మీగణంబు - లతి శాంతాత్ముల్ 379

నానా నామాంకితులు స
దానందులు [1]సాంబరులు ది-గంబరులు మహా
దాన వినోదులు ప్రమథులు
నానా సురహారులు ప్రమథ - నాయకులు శివా! 380

[2]వీరాచారా చార్యులు
వీర వ్రతవిదు లవార్య - విక్రములు మహా
వీరావతారు లసములు
వీరేశ్వర ! నీగణాళి — విష్ణువరేణ్యా ! 381

## సద్భక్తుల మహిమ

స్వేచ్ఛాచార వినిష్ఠితు
లిచ్ఛా వ్యాపారముక్త - వ్యాదయులు భవ పా
శచ్ఛేదన కారణులు ద
యాచ్ఛాదిత తనులు నీగ-ణాధిపులు శివా ! 382

సర్వజ్ఞులు సర్వగతులు
సర్వ శుభోదయులు సర్వ-సంగత్యాగుల్
సర్వ పరిపూర్ణులెప్పుడు
సర్వేశ్వర ! నీగణములు — శాశ్వతులు శివా ! 383

గత విధి నిషేధ లౌకిక
గతులు మహామతులు పరమ - కారుణ్య లతా
కృతికరులు సకల సుగుణా
న్వితులు శివజ్ఞానరతులు - నీ ప్రమథులజా ! 384

1. సాంబరులు ? 2. వీరాచార్యా చార్యులు.

అరుదుగఁ బురాణములలోఁ
బరువడి మును సెప్పియున్న — భంగి గణాడం
బర విభవము వర్ణించితి
ధరణీధరవంద్య! నా య-థాశక్తి శివా! 385

# కవి ప్రార్థన

## తన్ను గణములోఁ జేర్పుమని కవి ప్రార్థన

దేవా! సంసారాంబుధి
లో వెలువడఁజేసి ప్రమథ-లోకం బెఱుఁగన్
నా వాఁడు వీఁడు సుండీ
నావే నన్నుంపవే! గణంబుల నడుమన్ 386

ఒండేమి మల్లికార్జున
పండితుఁడన నుండుకంటెఁ - బ్రమథులలో నె
న్నండొకో! నీ యాజ్ఞోన్నతి
నుండఁగఁ గాంతునని కోరు-చుండుదు రుద్రా! 387

పరమేశ్వర! నీ ప్రమథుల
చరితలు సతతమును విన్నఁ — జదివినఁ బ్రమథ
స్మరణము చేసిన శుభములు
దొరకొను దురితంబు నెల్ల - దొలఁగు మహేశా! 388

## కొందఱు భక్తుల చరిత్ర

దేవ భవదీయ భక్తులు
మావల్ల భభక్తియోగ — మార్గమ్ములు నా
నా విధము లుండు రవియును
గోవిందాదులకు నెఱుఁగ — గోచరమె శివా! 389

ఏభంగిఁ దలఁచు భక్తు
డా భంగిన నీవు నెగడి – యవిరళభక్తి
స్వాభావికత్వ పరమ
ప్రాభవ విభవమున నతనిఁ – బ్రణుతింతు శివా ! 390

తనుఁగన్న తండ్రి తలఁదెగఁ
దునిమి భవద్భక్తి యుక్తి – ధూర్జటి ! యొకఁ డ
త్యనుపమగుణ ! నీ పదవికిఁ
జనఁడె ప్రసిద్ధంబుగాఁగఁ - జండీశుఁ డజా ! 391

తన కన్ను పుచ్చి యొకఁ డ
త్యనుపమమౌ భక్తి నీ ప-దాంబుజములు నే
ర్పునఁ బూజించి సుదర్శన
మను చక్రము వడసెఁగాదె ! – యచ్యుతుఁడు శివా ! 392

శివ నిందా శ్రవణమునన్
భవాని తన దేహమాత్మ - పావకమునకున్
హవిసేసిగాదె భక్తిని
భవదర్ధాంగమున నుండఁ - బడసె మహేశా ! 393

శివ నింద వింటినని ప్రా
ణ వియోగాగ్నిని యథా రు-ణాధరుఁడై కా
దె విరాజిత గణపదవికి
భువి నెగడెను వ్యాఘ్రపాద - పుత్రుఁడు రుద్రా ! 394

దేవ ! నిను వీర భక్తిని
బోవక తన తలలు దఱిగి - పూజించి వడిన్
రావణుఁడు చంద్రహాసము
దేవేంద్ర జయంబు వడసెఁ – దెల్లముగాదే ! 395

చేతులు రెండును దునిమి మ
హా తాత్పర్యమున మిమ్ము నర్చించి - జగ
త్ఖ్యాతముగ మగుడఁ బడయఁడె
ఘాతిగ నీచేత భట్టు - బాణుఁడు రుద్రా 396

గొఱియల పాల్నిమీఁదను
నెఱయఁగఁ బిదుకు నెడఁదండ్రి - నిష్ఠురుఁడై నన్
మఱి వానిఁ జంపి నీదయ
గొఱలఁడె గణపదవిఁగాటు - కోటఁడు రుద్రా! 397

అరుదుగ శివాగ్నిఁ దనయొడ
లురుతర శివభక్తి వీర - హోమంబుగఁ జె
చ్చెరఁ గోసి వేల్చి నీదయ
సరి ముక్తికిఁ జనఁడె! వీర - శంకరుఁడు శివా! 398

కన్నులు రెండునుఁ బుచ్చుచు
మున్నీశ్వర! సోమవార-మున హులంగరలోఁ
బన్నుగ శివనాగయ ని
న్నున్నతిఁ బూజించి పడయు-చుండఁడె రుద్రా! 399

తన కొడుకుఁ దునిమి వంటక
మొనరఁగఁ గావించి నీకు - నొప్ప నివేదిం
చినదాన హెచ్చిముక్తికిఁ
బొనరఁగఁ జిఱుతొండనంబి - పోవఁడె రుద్రా! 400

కోరి తన శిరము నీ పద
నీరజములఁ బూన్చి భక్తి - నీలావున జం
బూరి మహాకాళయ్యా య
పారైశ్వర్యమును మగుడఁ - బడయఁడె రుద్రా! 401

మొఱటద వంకయ దనతల
లఱి మెల్వడఁ దఱిగి నీ ప-దాంబుజములఁ గ్ర
చ్చఱఁ బూన్చి మగుడఁ బడయఁడె ?
నెఱయఁగ నిను నమ్మి భక్తి - నీచేత శివా! 402

శిరము దెగఁగోసి నీ పద
సరసిజములఁ బూన్చి నీ ప్ర-సాదంబున శం
కర! మూన్నాళ్ళకుఁ గరుణా
కర! గోవిందుండు వడసెఁ — గటకమున శివా! 403

వరగొండ చక్రవర్తికిఁ
గరుణింప జగత్త్రియ ప్ర-కాశిత భక్తి
స్థిరుఁడనఁ బడసెను క్షితి నీ
పురమునకుం బొందితోన - పోవఁగ రుద్రా! 404

తవిలి తన యూరి యా బా
ల వృద్ధమును మున్ను సొనిపి - లాలితముగ నీ
శివ లింగముతోఁ గూడఁడె!
శివ! నీదయ నొడయపిళ్ళ - శీఘ్రమున శివా! 405

ఒక్కఁడ దైవము శివుఁడని
నిక్కము సేయుటకు ముడిచె - నిప్పుల చీరన్
గ్రుక్కక శ్రీపతి పండితుఁ
డక్కజముగ విజయవాడ - నలజమ్మి శివా! 406

కడుఁ జోద్యము భక్తులకును
గడుఁ గూర్చుట నీదు భక్తి - గౌరవమునకుం
గడు మెచ్చి యొడయ నంబికి
నెడవోయితి గాదె! లంజ - యింటికి రుద్రా! 407

త్ర్యంబకుఁడ దైవమని చి
త్తంబునఁ గడునమ్మి నిన్నుఁ దడయక భక్తిన్
నంబియుఁ గిన్నెర బ్రహ్మయ
యుం బిలిచినఁ గరుణ వారి-కో యనవె శివా! 408

అమిత దృఢభక్తి నీ దయఁ
గొమరుగఁ బరిజనులతోడఁ - గూడనె శివ లో
కమునకు దేహము తోడ న
రమణీయముగాఁగ మలయ - రాజరిగె శివా! 409

హర లీలా స్తవ రచనా
స్థిర నిరుపమ భక్తిఁ దనదు - దేహము తోడన్
సురుచిర విమానమున నీ
పురమున కుద్భటుఁడు ప్రీతిఁ - బోవఁడె రుద్రా 410

ఒడఁబడ గుమ్మర గుండయ
వడిఁ గడవలు చేసి చఱచు - వాద్యములకు న
క్కడఁ బ్రీతి నాడెదెప్పుడు
బెడఁగడరఁగ నతని భక్తి - పెంపునకు శివా! 411

నరులెల్లం జూడ నిజో
దరము ప్రవేశింపఁ గాదె - తన కట్టిన యం
బర మొక మూరెఁడు దోఁపఁగ
నరియము రాజరిగె ముక్తుఁ-డై నీ కరుణన్ 412

భయము సెడి నిన్ను నమ్మిన
జయమునఁ దరియఁబడి నడచు - సాహసమున నీ
దయ నిండి పాఱునది దా
రయముడిగెను ముసిఁడి చౌండ-రాయనికి శివా! 413

తనుఁగని ప్రమొక్కిన "దీక్షా"
యని పలికినఁ బిదపఁ జచ్చె - నాఁటది తగునే
యనఁ బ్రాణము వడసెను వా
రని దయతో ముసిఁడి చౌండ - రాయఁడు రుద్రా! 414

తన లంజయునుం జిల్కయుఁ
దన లంజియ బంధుజనులు - దానును జనఁడే!
జనులెల్లఁ జూడ మలహణు
నిను సంస్తుతి చేసి దేవ! నీ పురముకకున్. 415

వెలయఁగ నాఁబోతులుఁ దప
సులు మృతులై యెదురురాఁగఁ - జూచుచుఁ బ్రాణం
బులు వడయఁడె! నీదయ వా
రల కప్పుడె ముసిఁడి చౌండ - రాయఁడు రుద్రా! 416

పెనిమిటి శివభక్తుడు గాఁ
డని యొల్లక రోసి నిన్ను-నడిగిన రాత్రిన్
బనఁబడసె గాదె! శంకర!
గొనకొనఁ బుంస్త్వమ్ము నాఁడు-గూఁతురు నీచేన్ 417

కెంబాగి బోగిదేవని
వెంబడిఁ జని వచ్చి పిడు-పీఠంబుల లిం
గంబులు వడి విప్రులు లీ
లం బొగడఁగ నిట్టి వత్స-లత్వము గలదే! 418

విన్నపము పలిది యంబలి
మున్నని నివేద్యంబు సూపి - మ్రొక్కుచు నీకున్
సన్నుత భక్తిని మాదర
చెన్నయ నీ కరుణ ముక్తి-చేకొనఁడె శివా! 419

కూడి జగమెల్ల నోపక
యోడిన శివభక్తి మహిమ - యుత్కృష్టముగా
నేడర బంకయ చూడఁగ
దేడర దాసయకుఁ దలుపు - దెఱవవె రుద్రా !

శంకర ! నీ కింకరుఁ డ
భ్రంకషముగ నేత్రవహ్నిఁ - బర దైవములన్
బొంకమడఁగింపఁడే ! భువి
శంకరదాసయ్య నీ ప్ర-సాదమున శివా !

కడవఁగ నేరక మ్రొక్కిన
నడుమప్పుడు [1]దుస్సివడ జీ-న ప్రతిమ మహిన్
బడియందు వైజకవ్వకుఁ
బొడసూపవె ! లింగమూర్తిఁ - బురహర ! దయతోఁ.

కడిచేసి పెట్టఁగాఁ గొని
సడిసనఁ గటకమున సురియ - చముఁడయగారిన్
గడుఁ గరుణించి జగమ్ములు
గెడఁగూడి నుతింప నారగింపవె ! రుద్రా !

తాముందరఁ జని సూచిన
యామాంసము నీకుఁబెట్టి యతిశయ భక్తిన్
వ్యామోహంబున నీదయ
గా ముక్తికిఁ జనఁడె ! యెఱుక గన్నప్పఁడజా !

భావనయ భక్తి నీకును
భూవినుతుఁడు మేలు కబ్బ-ములు చెప్పి మహా

---

1. వ్రస్సి

దేవ! తన దృష్టి శివ లో
కా వ్యాప్తింబడసెఁ గాదె! యంబన నీచేన్ 425

ఇమ్ముల విపినమ్ముల ని
త్యమ్మును శివలోకమునకుఁ - దడయక చనవే
నమ్మిన నీ భక్తుండగు
బొమ్మయ చంపిన మృగములు - చోద్యముగ శివా! 426

స్థిరభక్తి యుక్తిఁ దృణమున
నరదుగఁ దానిలిచి భక్తుఁ—డను దయఁ గంచిం
గరి కాలచోడ నృపతికిఁ
గురియింపవె! పసిఁడివాన — గోరిన భంగిన్ 427

అవిరత దృఢభక్తిం గే
శవరాజు శిరంబునందు — సన్నిహితుఁడవై
భువి లింగమూర్తి నేకొని
యవతారము చేయవే! మ-హామహిమ శివా! 428

పూని వడి నేడు నాళుల
పీనుఁగునకు వీరభక్తిఁ - బ్రీతాత్ముఁడవై
ప్రాణంబొసఁగితి గాదెద
యానిరతిం గదిరి రేమ-ణార్యునకు శివా! 429

నీ పురమునకున్ శివ! నీ
ధూపావసరమున ఘంట - తోడనె భక్తి
వ్యాపారంబున నోహిళు
డాపోయెన నంగఁ బోవఁ - డయ్యెనె రుద్రా! 430

అసమేతుఁడ! శివభక్తుం
డసమశ్రేష్ఠుఁడని పలికి — యన్యులతోడన్

బొస పోరై బండారువు
బసవఁడు విసమెత్తి త్రావి - బ్రితుకఁడె రుద్రా ! 481

వసుధ నుమేశుఁడె దైవము
ప్రసాదము పవిత్ర మీశు - భక్తులె కులజుల్
పొనపోరని బండారువు
బసవన విసమెత్తి త్రావి — బ్రిదుకఁడె రుద్రా ! 482

కుసుమ శరారీ! శివ ! లిం
గ సమేతులు దక్కఁ బొందఁ - గాదని పెర్మా
ళ్యా సుఖంబని బండారువు
బసవన విసమెత్తి త్రావి — బ్రితుకఁడె రుద్రా ! 483

అల పూరి వీర భక్తికి
నలి నెంతయు మెచ్చి పాండ్య - నాయకు కడకి
మ్ముల నీవ వచ్చి పీఠము
వెలయఁగఁ చేకొంటి కాదె ! - విష్ణువరేణ్యా ! 484

స్థిరభక్తి నీకుఁ బాడుచుఁ
బురహర ! తన చేతి తాళ-ముల తోడవె చె
చ్చెర మీఁదికి నెగసి భవ
త్పురమునకును శంకరుండు - పోవఁడె రుద్రా ! 485

కొడుకని చేకొని నిన్నును
మడఁది యతిప్రీతి బెజ్జ - మహాదేవి మహిన్
గడకొని యాడిన భక్తికి
నొడఁబడి యాయమకు ముక్తి - యొసఁగవె రుద్రా ! 486

తన గుఱ్ఱము సతులును బరి
జనులును( దనతోడ రా(గ — శాశ్వత భక్తిన్
జనియె భవత్పురమునకును
గొనకొన(గ( గుమారపాల - ఘూర్జరు(డు శివా! 437

గుడి వఱుగు దాఁచి కుంచియ
పొడ సూపక తలుపు వెట్టి - పోయిన నీవ
ప్పుడె తలుపు దెఱచి భక్తికిఁ
బొడసూపవె! కిన్నెరునకు( - బుర సంహారా! 438

చోడని యేను(గు( జంపుచు(
జోడని శివభక్తి మహిమ - చొప్పడ నీ చే
రూడిగ( బ్రగమ్మ(ఱ( బడయ(డె!
యోడక యెఱుదత్తు(డన(గ - నొక భక్తు(డజా! 439

కడు(గడు రౌద్రంబున జత
పడు మదకరి( జంపి యపుడ — పడయడె భువి ను
క్కడ(గియు బిజ్జలు( దడుగుడు
మడివలు మాచయ్య భక్తి - మహిలో( గలదే! 440

రావీది యేచి యెక్కిన
మావంతుని( జంపి వచ్చు - మదకరి దనపై
రా వెఱచి మగుడ( బాఱదె!
బావురి బ్రహ్మా..కు నీ ప్ర-భావమున శివా! 441

భూతలమున నిది యంతయు
నూతనమని పొగడ నేడు - నూఱేండ్లు మనం
డే! తనరు భక్తి( బ్రదిపురా
రాతీ! సకలేశు మాది — రాజయ్య శివా! 442

ఎడపక పూజాంతమునన్
చిడిముడిపడి [1]ఘర్ఘరములు – నెలఁగఁగ నీ వ
ప్పుడు మెచ్చి భక్తి కాడుదు
వడిఁ [2]జేరమ చక్రవర్తి – వాయిఁక శివా !

నమ్మిన భక్తుఁడు గన్నడ
బమ్మయ సద్భక్తి మహిమ - పరికింపఁగ లో
కమ్ములఁ జోద్యము గాదె! య
[3]ధర్మంబును ధర్మమయ్యెఁ - దత్త్వాతీతా!

పరువడి మఱియు ననేకులు
ధర బాణ మయూర కాళి - దాసాది మహా
పురుషులు దృష్ట ప్రత్యయ
వరములు నినుఁ గొలిచి కనిరి పరభక్తి శివా!

వలయునని దేవ ! కొందఱ
నెనకొని పేర్కొంటిఁ గాక - నీచేత నర
మ్ములు వెలయుఁగఁ జదివిన భ
క్తుల కొలఁదెఱుఁగుదు ననంగ – [illegible]

## భక్తి మహిమ

మహిలోఁ గేవల భక్తి వి
రహితమ్మై చేయఁబడిన కర్మంబును మహా
వహామై దక్షుఁడు సేసిన
విహిత క్రియ లెట్టులట్లు – విఫలంబు లగున్

నీ పద భక్తుఁడు సేసిన
పాపంబుం బుణ్యమగు న-భక్తులు సేయన్

1. ఘర్ఘరనాదము ? 2. చేరమ ? [illegible]

శాపముగుఁ బుణ్యమైన ను
మా పతి నీ తలఁపె వేద-మార్గం బయ్యెన్. 448

మొల్లల వైచిన లక్ష్మి
వల్లభసుతుఁ గాల్పవే! య-వారిత వృత్తిన్
[1]మొల్లమిగ జాల వైచిన
యల్ల గణాధిపున కీవె! – యపవర్గ మజా! 449

కావున సకల క్రియలును
కేవల భక్తి ప్రయుక్తి-కిని సరిగామిన్
కేవల భక్తియ మేలని
గోవింద వరేణ్యు వరదుఁ - గొలువవె! శంభున్ 450

వన జాసన వనజోదర
సనకాదుల కెఱుఁగరాని - శాశ్వత మహిమన్
దనరిన భక్తికి శంభుఁడు
నొనరఁగఁ గడు మెచ్చి భక్తు - నొద్దన యుండున్. 451

ఈ నిచ్చలు గొనియాడెదు
నానావిధములగు నిత్య - నైమిత్తిక క
ర్మానుష్ఠానము నొల్లఁడు
దానెప్పుడుఁ గూర్చు శివుఁడు - దన భక్తునకున్ 452

ఫలములు గుఱుతిడి శివ పూ
జలు చెప్పెడి చదువులెల్ల – శాశ్వత పదవిన్
వెలసిన కేవల భక్తి
స్థలముల వర్ణించి చదువఁ – దద్దయుఁ దగునే! 453

---

1 మొల్లముగ?

శ్రీలింగ దేవు భక్తుల
కాలత్కీర్కాజ్ఞ సంభ-వాదుల పదవుల్
తూలాయ మానములు స
ల్లీల శివానంద సుఖ వి-లీనుల యగుటన్ 454

కేవలము శివుఁడు దనకుం
గావలెనని గోరునట్టి - ఘనుఁ డెవ్వండే
సేవల మాతఁడ తనకుం
గావలనని కోరునట్టి — కాంతున శివుఁడున్ 455

మది విధి నిషేధములుగల
చదువులకును స్వామి భృత్య — సంబంధమునం
బొదలిన కేవల భక్తికి
నొదసిన కూటంబు గలదె! - యూహింపంగాన్ 456

ఫలియించు విధి నిషేధం
బులవలనను బుణ్య పాప-ములుఁ దత్కర్మం
బులనగు నయ్యో లోకం
బులు భోగాంతమున మఱియుఁ — బుట్టుగ కలుగన్ 457

కావునను విధి నిషేధ వి
భావనుఁడై యుభయకర్మ - ఫల విరహితుఁడై
కేవల నిష్ఠం గొలుచుట
భావింపఁగ శుద్ధ భక్తి - పథము ధరిత్రిన్ 458

పరమేశ్వరుఁడగు శంభుఁ డ
శరణంబని భక్తి నవిఘ్న — శంకరుఁ గొలువన్
దొరకొను భృత్యాచారము
సరియే! పెఱమంత్ర తంత్ర-జాలము లెల్లన్ 459

విధి వేఱ కలదె! భక్తి యు
విధి విధి సహితముగ భక్తి-విరహితుఁడై తా
విధియించి యశ్వమేధము
విధి పుత్రుఁడు దక్షుఁడైన - విధి యెఱుఁగరొకో ! 460

పృథు విధి నిషేధ లోక
ప్రథితో భ ః కర్మ రాశిఁ - బ్రాపించెన్ నీ
"పథవర్తిని [1]తేషాం మమ
యథా తథా"యనుటఁజేసి - యంబా రమణా ! 461

శివునకుఁ దనువును [2]మనమును
శివ భక్తులకును మనంబుఁ - జిత్త ప్రీతిన్
భువి నిచ్చి యెల్ల వారికి
శివుఁడను నేననక యునికి - శివభక్తి యగున్ 462

వెలుపలఁ గడిగిన లోపలఁ
గల చిత్తమలంబు వోవఁ-గా నేర్చునె! ని
చ్చలు భావ శుద్ధిఁ గడు ని
ర్మల మతి శివుఁ గొలువవలయు - మానుగ భక్తిన్ 463

కత్తిఁగొని కోసి దేహము
జొత్తిల్లఁగఁ గడిగినను వి-శుద్ధం బగునే !
రిత్తలు దక్కిన శుద్ధుల్
చిత్తంబున శుద్ధి వలయు - శివుఁ బూజింపన్ 464

ఒడలఁ గల యవయవంబులు
గడిగిన మఱి వానిలోనఁ—గడు నిండిన చేఁ

1. తేషాంచమమ యథాతథా. 2. మనువును

దుడుగునె! దేహము వెలుపలఁ
గడిగిన నది చిత్తశుద్ధి - కారణమగునే! 465

అంతర్గత చిత్తం బ
త్యంతము దుష్టమగునేని - యది మఱి ఘట ద్
ష్టాంత గతి శుద్ధి యగునె! ని
రంతర బహు పుణ్యతీర్థ - యాత్రాదులచేన్ 466

సకల జగత్పతియగు శివు
నికి భక్తులు వీరు నాఁగ - నెగడిన పుణ్యా
ధికులం దొండొక దుర్గుణ
శకలంబులు వెదకు పాప-జాతులు గలవే! 467

అతఁడు స్వరూప సుందరుఁ
డాతఁడె సౌభాగ్యవంతుఁ — డాతఁడు గుణ వి
ఖ్యాత యశో నిధి నీకు మ
హా తాత్పర్యమున భక్తుఁ-డగువాఁడు శివా! 468

అతఁడ జగత్పవిత్రుం
డాతఁడ సంపత్సమృద్ధుఁ — డాతఁడ యార్యో
గ్యాతిశయార్థుఁడు నీకు మ
హా తాత్పర్యమున భక్తుఁ-డగువాఁడు శివా! 469

శివ సంస్కార విహీనుం
డవు మానవుఁ డంత్యజునకు — నంత్యజుఁడరయన్
శివ సంస్కార సయుక్తుం
డవు మానవుఁ డగ్రజునకు — నగ్రజుఁ డరయన్. 470

మాలలఁ గులజులఁ జేయును
బోలఁగ శివభక్తులైన – భువి నెఱుఁగరె! మా
నీలగ్రీవుఁడు గులజుల
మాలలఁగాఁ జేయు భక్తి–మదిలేకున్నన్. 471

చెన్నయ మాలఁడుకాఁడే!
మున్ను మహాదేవుఁ గొలిచి – ముక్తుండయ్యెన్
జన్నమున శివుని దక్షుఁడు
మన్నింపమిఁ జేసి పచ్చి - మాలండయ్యెన్ 472

వేఁషేమి! దొల్లి ముక్తికిఁ
బోయిరె! విద్యలును వంశ-ములు గలవారల్
బోయయు సాలీఁడును మా
కాయజహరుఁ గొలిచి ముక్తి - గాంచిరె గాదే! 473

వారని యమ నియమములకు
ఘోర వ్రతములకు శివుఁడు - గూర్పఁడు శివనిం
దారతి విని తను విడిచిన
గౌరీ సతి భక్తియుక్తిఁ-గని కూర్చు క్రియన్ 474

జపములకుం దపములకును
నుపవాసంబులకుఁ గూర్పఁ-డుగ్రుఁడు నిందా
కుపిత మతిఁ దన్ను విడిచిన
యుపమన్యుని భక్తియుక్తి–కొడఁబడు పగిదిన్ 475

కన్ను వడిఁ బుచ్చి పూన్చిన
వెన్నుని భక్తికి వరంబు - వెదచల్లు క్రియన్
గన్నులు దెఱవక ముందర
మిన్నక కూర్చున్న శివుఁడు - మెచ్చునె వారిన్ 476

తన తండ్రిం దునిమి భక్తిం
దనరిన చండీశ్వరునకుం — దనయెంగిలి యి
చ్చినక్రియ శివుం డిచ్చెనె పెఱ
జనులకుం గేవల వదాన్య - జడులకు నెందున్. 477

మన్నించుం బ్రీతి మాదర
చెన్నయ భక్తియ మరమునం - జేకొనెం గాదే
మిన్నక యంటని ముట్టని
చెన్నంటి వ్రతములకు నేల - శివుండెడం గూర్చున్. 478

ప్రీతి మెయి వీరచోడన
ఘాతిగం గడియెత్తి నెఱచి - పనుచుడును రజ
స్స్నాతకి యని తొలంగెనె వృష
కేతనుం డాపులగ మార - గించెడి చోటన్. 479

ఉన్నత భక్తి శిరంబులు
పన్నుగ శివుం బూన్చి కరుణ — వడసిన భంగిన్
మున్నే విధులం గొలిచియుం
జన్న దశాననుండు వడయం - జాలెనె చెప్పుమా? 480

తొల్లి శివుం గడవం బలికిన
కల్లరిం దన తండ్రిం దునిమి - కడుభక్తి మెయిన్
దెల్లమిగ ముక్తుం డయ్యెను
గొల్లండు గాండయ్యా! కాట - కోటండు మదారి? 481

మును సవి సూచిన కన్న
ప్పని యెంగిలి యారగించి — భక్తి ప్రధానం
బని కరుణించెను శంకరుం
డని విందుము విధుల లోన - నది యేవిధియో? 482

మఱి శివుండు భక్తిం గొడుకుం
దఱిగిన చిఱుతొండనంబి — దనవాండను గా

కెఱుఁగక యేఁటికిఁ గారులు
మొఱఁగెదు నీ మంత్రి తంత్రి - ములు నేకొనునే ! 483

కడు భక్తి నంబి పిలచిన
నోడఁ బడి 'యో' యనిన భంగి - నొండొక విధులన్
నొడువులు సెప్పిన వేళ్ళులు
మిడిచిన శివుఁడట్టివారి - మెచ్చునె ? చెపుడా ! 484

ఆగమ చర్యల కంత
ర్యాగ బహిర్యాగ విధుల - కర్యాప మహా
యోగమ్ములకుం బోయెనె !
భోగన్నకు శివుఁడు వలచి - పోయిన భంగిన్. 485

అధ్యాత్మజులకుఁ బెఱమూ
ర్తి ధ్యానంబులకు నితర - దేవార్చనకున్
విధ్యుక్త క్రియలకు సా
న్నిధ్యమగునె ! శివుఁడు బాణు - నికిఁ గాక భువిన్. 486

నిష్ఠురభక్తి హలాయుధు
నిష్ఠకు వలచిన విధమున - నీదగు కర్మా
నుష్ఠానములకు బిలబిల
నిష్ఠలకును శివుఁడు దలచు - నే తలపోయన్. 487

మరి విను మొరుల విధులకుం
గురియించెనెఁ మెచ్చి లోక - గురుఁడీశుఁడు మా
కరికాల చోడ నరపతి
గురుభక్తికిఁ బసిఁడి వాన - గురియించు క్రియన్. 488

స్నానములకు దానములకు
మౌనములకు హోమములకు - మదిఁ జే కొనఁడీ
శానుఁడు నమ్మిన భక్తికి
మానక ... ... ... ... 489

# పద్య వివరణ

శివతత్త్వసార మాంధ్ర శైవ వాఙ్మయమున ప్రథమ గ్రంథ మగుటయే కాక తెలుఁగున వీరమాహేశ్వ రాచారమును ఆరాధ్య సాంప్రదాయమును వివరించు గ్రంథములలో ప్రధానమై యున్నది. ఇందు శైవమతమునకు సంబంధించి శ్రుతిస్మృతి పురాణాగమేతిహాసములనుండి విషయములు సంగ్రహింపబడి ఆ యర్థము తెలుగుభాషలో తెలుపబడియున్నది. కందలి పద్యము లన్నియు కందములేయైనను, అవి సులభశైలినే రచింపబడియున్నను, విషయ మతి గంభీరమగుటచే పాఠకులకు నీ గ్రంథము సంపూర్ణముగా నవగాహన చేసికొనుటకు వీలుకాకయున్నది. కేవలము సాహిత్య జిజ్ఞాసగల పాఠకులకే కాక శైవులకు నిత్యజీవితముతో సంబంధించిన మతగ్రంథ మగుటచే ప్రతి పద్యార్థ వివరము అత్యావశ్యకమై యున్నది. ఇంతే కాక కొన్నిపట్టుల మత సాంకేతిక పదనిర్వచన మవసరమైయున్నది.

ఈ యుద్దేశ్యముతోడనే మూలమున 115 వ పద్యమువఱకును పద్యార్థ విశేషములు పుట యడుగున నీయబడినవి. తక్కిన పద్యముల విశేషము లీ క్రింద చూపుచున్నాను.

121. శివభక్తులను చూచి వా రేజాతివారని విచారింపకూడదు. శైవ మతమున జాతి భేదములులేవు.

ఈ విషయమై పాల్కురికి సోమనాథు డిట్లు చెప్పియున్నాడు.

క. భువిలో శివదీక్షితులగు
శివభక్తుల పూర్వజాతిఁ జింతించుట రౌ
రవ నరక భాజనంబా
శివుఁ బాషాణంబుగాఁగఁ జింతించుక్రియన్ —

అనుభవసారము 153 ప.

ఈ కారణము చేతనే సోమనాథుడు, తాను ఈశ్వర కులజుడనని పార్వతీ పరమేశ్వరులు తలిదండ్రులని చెప్పుకొన్నాడు.

129. శివభక్తులకు జాతాశౌచ మృతాశౌచములు లేవు.

133. కమ్మగవలచిన- మంచివాసన వేసినట్లుగా

144. భక్తియే ప్రధానముగ నెంచి, గురువు యొక్క ఆజ్ఞాప్రకారము వర్తింపక, అన్యవిధమున గొప్ప భక్తుడై, తన భక్తిని గనబఱచిన యెడల, గురు వా శిష్యునిపై గోపింపక తనశిష్యు డంతవాడాయెనని సంతోషించి, పరవశుడై, ఆ భక్తశిష్యుని తప్పు మఱుపవలయును.

150. భక్తి కను దేహభావ వ్యక్తుండు- శివుడు భక్తుని యనుదేహము అనగా ప్రతిదేహము అను భావన-

187. వుచ్చినకన్ను అనగా పెఱికిన కన్ను

194 శివభక్తిలేని బ్రాహ్మణుడు శ్వపచునకు గీడు, అనగా. అంత్యజాతి వానికన్న తక్కువవాడు.

197. శివుని కృపలేని వైభవము క్షణభంగురము- దీనికి రెండు దృష్టాంత ములు చెప్పబడినవి.

1. మెఱియలపై *పిండకూడు.

మెఱియ యనగా గుండ్రాయి- దినవారములు చేయునపు డొకరాతి యందు ప్రేత నారోపించి, దానిమీద నీళ్ళుపోసి, తిలలు దర్భలు మొదలైనవి వేసి దానికే పిండములు పెట్టుదురు. ఆ రాతి వైభవమా దినవారములు పదిరోజులే- ఆ వెనుక- ఆ రాయి విసర్జింపబడును.

2. మీస మెదుకుల మెఱపులు, భోజనము చేయునపుడు కొంచెముకాలము మెదుకులు మీసముల పైనుండి, భోజనానంతరము- ముఖము కడుగ గానే అవి జారిపోవును- క్షణకాలమే వాని వైభవము.

---

* దీనినే వ్యవహారములో 'పిండాకూడు' అని యందుము.

199, ప్రువ్వులు అనగా పురుగులకు బ్రదికియున్నప్పుడు తమకొకప్పుడైన చావు కలదు అనుజ్ఞానముండదు. చచ్చినప్పుడు పునర్జన్మ యుండు ననుజ్ఞానము కలుగదు. ఇట్లు జ్ఞానమేమియు లేక మరల మరల పుట్టుచు పురుగులు చచ్చుచుండును– అట్లే మానవులకు శివభక్తి లేనియెడల పుట్టుచు, చచ్చుచు, ముక్తికి దూరమై పురుగులవలె నశింతురు.

225. పరార్థ శివార్చనయనగా ధనము దీసికొని గుళ్ళలో పూజారులు చేయు పూజ.

222. ఈ పద్యమున స్త్రీ పురుషులకు సమానత్వము నిరూపితమైనది. పురుషునకు శివభక్తి లేకపోయినప్పుడు, స్త్రీ ఆతని కనుకూలముగ నడవ నక్కరలేదు– ఆతనివిడిచి యథేచ్ఛగా శివభక్తిపరురాలుగా వచ్చును–

270. అష్టాంగ యోగవిధి ప్రసిద్ధమే. షడంగ యోగము పాశుపతులకు మాత్రమే పాశుపత సూత్రములు చెప్పబడినది–

"హసిత, గీత, నృత్య. హుడుక్కార, నమస్కార, జప్య షడంగోప హారేణ ఉపతిష్ఠేతితి" అని సర్వదర్శన సంగ్రహము. (నకులీశ దర్శనము)

282–284. శైవులకు పరలోక విఘ్నములు లేవు–

285. శైవ గురువులసొత్తు వారి ప్రతులలో శైవులైనవారికి చెందవలె యున్నే కాని శైవులు కాని కుమాళ్ళకు చెందకూడదు.

322. 'సమసుప్తినాథ'– కల్పాంత మందంతయును బోయెడి నిద్ర సమసుప్తి– దానికధిపతి శివుడు.

322–385. ప్రమథగణ వర్ణనము, వారియాటలు, వారి మహిమాదులు– దీనికే "గణాడంబరము" అని పేరు– ఈ గణాడంబరమున– భక్తులు పఠించుచున్నట్లు పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణమున గలదు.

386-388. కవి నామాంకిత పద్యము- ఫలశ్రుతి-

389. శివభక్తుల చరిత్రలు తెలియుటకు బ్రహ్మవిష్ణ్వాదులకు సాధ్యము కాదు.

390-489. ఇందు భక్తుల చరిత్రలు, భక్తమహిమలు- సూక్ష్మముగా నొక్కొక్క పద్యమున సూచింపబడినవి- భక్తమహిమల శీర్షికలో గూడ భక్తచరిత్రలే గలవు- వీని వివరములను పీఠికయందు జూడ నగును-

## మత సాంకేతిక వివరణము

11. దురిత హారమనియు శుభములు
దొరకొనుననియును దలంచి దురితారి! భవ
చ్చరణాబ్జ భక్తిలలనా
పరవశభావమున నిన్నుఁ బ్రణుతింతు శివా.

ఈపద్యమున షట్స్థలములలో నొకటియగు శరణస్థలము నిరూపితమైనది.

సతిపతినివలె యనన్య బుద్ధితో శివుడే శరణమని దృఢనిశ్చయముతో కొల్చు భక్తిభావన చెప్పబడినది- శైవమునందలి యీ భావమే- తరువాత వైష్ణవమున మధురభక్తి భావనగా సంగృహీతమైనది-

21. జ్ఞానము పశుపాశుపతి
జ్ఞానమ్మని యెల్లెఱుంగజాలని జడుల
జ్ఞానము వారల తత్త్వ
జ్ఞానముల జ్ఞానములు విచారింప శివా.

ఇందారాధ్య సంప్రదాయమునకు ముఖ్యమగు పశుపాశుపతి జ్ఞానము వివరింపబడినది-

పశువులు-జీవులు-

పాశము-భవము- ఇది ఆణవిక, కార్మిక, మాయామలరూపముగ జీవుల నంటి యుండునది.

పతి-శివుడు-

30. త్రిమలములు- ఆణవిక, కార్మిక, మాయామలములు అను మూడు

81. భవుడు- రజోగుణమూర్తియైన శివుడు.

82. హరుడు- తమోగుణమూర్తియైన శివుడు.

83. మృడుడు- సత్త్వగుణమూర్తియైన శివుడు.

84. శివుడు- నిస్త్రైగుణ్య మహత్తర రూపము.

88. పరమాత్మ- పరబ్రహ్మ- పరమేశ్వరుడు, ఇవి శివునికి తత్త్వాంతర వాచకములు.

131. నీ నిజ భక్తుం డంత్యజుఁ
డైనఁ బవిత్రుండు పూజకర్హుడు జగతిన్
"తేన సహాసంవసే" త్తని
గాన ప్రియశ్రుతులు మ్రోయుగానకపర్ది.

"మద్భక్తశ్చశుచీ" "శ్వపచోఽపి మునిశ్రేష్ఠయస్తు లింగార్చనేరత" అని శ్రుతులు.

లింగార్చనము నందాసక్తుడైనవాడు చండాలుడైనను మునిశ్రేష్ఠుడే-

132. క. శ్వపచుండైనను శివభ
క్తిపరుండగునేని నతఁడ ద్విజవర్యుండా
శ్వపచునకుఁ గీడు శివభ
క్తిపరాఙ్ముఖుఁడైన యట్టిద్విజుఁడు మహేశా! 194 వ.

* 133. గురుఁడాది తనకుఁ గలిపిన
వెరవున జనిమీద భక్తి వేదించిన య
గురువు తము గడచిచేసిన
పరవశుఁడై మఱవవలయు భక్తులఁ దన్నున్

గురువు దీక్షాగురువు-

ఇచట గురుస్థలము సూచితమైనది-

గురువు-అనగా దీక్షాగురువు-

గురువు హస్తమస్తక సంయోగ మొనరించి చిత్కళాన్యాసమొనరించి నంతనే భౌతికశరీరము లింగశరీరముగ మాఱుటచే మంత్రవిశిష్టమగు మఱి యొక జన్మ శిష్యునకు గలుగును— దీనిననుసరించియే శైవసంప్రదాయమున శిష్యులు— గురుహస్తజాతులమని వ్యవహరింపబడుచున్నారు.

153. జంగమ లింగంబగు భ
క్తుంగనిఁ బూజింపఁడేని గోటివిధమునన్
లింగార్చన చేసిన వృథ
జంగమముత్తమముగాగ స్థావరమునకున్.

జంగమ లింగమనగా చరలింగము; జీవిరూపమునచరించు శివుడు—శివ భక్తుడు.

220. గురుకృత శివదీక్ష మెయిన్
విరహిత మలదేహులగు పవిత్రులు భక్తుల్
హరనిర్మాల్యము గుడుతురు
శివశాస్త్ర పురాణవచన సిద్ధాంతగతిన్.

ఇచట ప్రసాదస్థల వివరణ గలదు.

నాల్గవ పాదమున "శివశాస్త్ర పురాణవచనములివి.

సీ. ఆది "రుద్రేణాత్మ మశ్నంతి రుద్రేణ
పీతఁపిబంతి "ప్రఖ్యాతి శ్రుతుల
నన్నిగమాంతర" మతికిల్బిషంస్యా 'ద
నర్పితం' బనెడు సిద్ధాంతములును
నవికల సిద్ధాంత నివహోక్తి" లోభాన్న
ధారయేత్త'ను శివధర్మములను
శివధర్మశాస్త్ర దృష్టిఁ బ్రసాద మేవ భో
క్తవ్య"మను పురాణ కాండములను

ఆ. వె. సిద్ధమనుచు వేదసిద్ధాంత శాస్త్ర పు
రాణతతుల మలహర ప్రసాద
మహిమఁ దెలిపినట్టి మల్లికార్జున పండి
తయ్యగారిఁ దలఁతు ననుదినంబు,

అనుభవసారము—8 పద్యము.

254. అంగాభ్యంతర విధముగ
సంగజహార గాంచి ముఖ్యముగు బాహ్యావితీకీ
లింగాకృతి శివగా వగు
వెలి మానవులకు బెు వెడంగులుగలరే

శివుడు లింగస్వరూపుడు- లింగార్చనా మహిమ యనేకపురాణము-
నిట్లు వర్ణితమైనది

చ. అనయము బంచవింశతి మహావరమూర్తుల నీశ్వరాదు
దనఘనఘూర్తి మూర్తిఘనతత్త్వ సదాశివా ంచ
జననత నూఱుకోట్ల యుగసంఖ్యల గొల్చిన దు
బనుపమ లింగమూర్తి నిమిషార్థము గొల్చిన

## పదములు – అర్థములు

అపాపమతి - (276) పాపబుద్ధి
అతకడచు - (301) దాటు; నిరాకరించు; నిర్లక్ష్యము చేయు
అతగుడు — (215) దుష్టుడు- ఈ పదమున కిదియే తొలి ప్రయోగము
అనుకీర్తించు - (174) మిక్కిలి పొగడు-
అను దేహము - (150) మాఱుదేహము
అన్నడు - (269) అట్టివాడు- చూ, పీఠిక-
అటిమెలుపడు - (402) మెడమీదినుండి క్రిందపడు- మెడపై నుండు మాంసపు పొర
అవగాహనచేయు-(193) స్నానముచేయు.
ఆదికర్త — (171) మొదటి సృష్టికర్త.
ఆలరి - (264) దుష్కోలుడు.
ఆలాపు — (239) పానపాత్ర;
ఉమ్మెలు — (323) ఊష్మశబ్దభవము—ఉమ్మె- వేడిమి
ఉల్ల - నాతిసమీప నాతిదూరప్రదేశము.
ఎనకొను - (446) సమానమగు.

ఎయిదు — (243) అనుగమించు—ఎయిదు క్రియను డి ఐదువ—పుణ్యస్త్రీ—పతిననుగమించునది యని కొందఱు కాని యది 'అవిధవ' శబ్దభవమని చూ. మించుపల్లి వ్యాఖ్య.

ఎఱఁగు — (1) నమస్కరించు; దీనికి ఎఱఁగు అని శకట రేఫ గూపము గలదు.

ఏడుగడయు — (139) ఏడు విధములైన రక్షకము. గురువు తల్లి, దండ్రి పురుషుడు, విద్య, దైవము, దాత—ఏడుగడయు అనియే ప్రయోగములు ఈ పద మునకు తొలిప్రయోగము— భార. ఆది. 4-65 లో గలదు. తరువాతి ప్రయోగ మిందలిదే.

క. గురుఁడును తల్లియు దండ్రియు
పురుషుడు విద్యయును దైవమును దాతయు నా
బోరి నేడుగడయు దానై
హరినను రక్షించుగాన ననవరతంబున్.

హా. 1 అ

ఒడ్డణము— (340) ఒడ్డాణము—రూపాంతరము— ఈ యర్థమున కిదియే తొలిప్రయోగము:

ఒదయు— (456) అనుకూలమైన

ఓజకువచ్చు— (211) క్రమపద్ధతి ననుసరించు

ఓజసెడు— (216) క్రమముచెడు.

కడిచేయు— (339) ముద్దచేయు.

కర్తించు— (148) పనిచేయు.

కర్మి— (189) కర్మము చేయువాడు.

కవిలియ— (215) లెక్కలు వ్రాసికొనెడు కట్ట.

క్రియగొను— (108) పూనకొను: చేయుటకుద్యమించు

బడపుడు- (260) ఈశ్వరుడు.

బిరుదుడుగు- (249) గొప్పదనము విడుచు

భరమగు- (6) అతిశయమగు.

మడి- (82) పొలము

ముద్దటలడచు (293) పిడుకలు చఱచు.

మూటకట్లు- (289) మూటవలెకట్టు-బంధించు

మెఱియ- (197) గుండ్రాయి

మేవిల్లు- (82) శ్రేష్ఠమగు.

మొల్లమి- (449) నిండు పూర్ణము

రట్టళ్ళు- (200) రాజులు రెడ్లు-రట్టడి పదము శాసనములందు విశేషముగా గానబడును. రాష్ట్రకూట-రట్ట కూట-రట్టడి-రడ్డి-రెడ్డి-అని యీ పద రూపావతార నిష్పత్తి-

రావీథి- (441) రాచవీధి రాజమార్గము

వక్కు- (183) కృశించు.

వరవుడు- (139) దాసి, దాసు

వలగొను- (66) ప్రేమించు

వాచఱచు- (280) మాటలతో ఎగఱచు

వావికొను- (298) వెంట్రుకలు దువ్వుకొను.

వాచులు- (191) మాటలుగలవారు,

వాదిదు- (4) వాదముచేయు

వెలగొను- (226) డబ్బుపుచ్చుకొని పనిచేయు.

వేదించు- (144) నివేదించు.

వేదుఱు- (9) వెఱ్ఱితనము

సడిసను- (423) కీర్తికెక్కు

సూడుపట్టెలాడు-(324) ఎదురెదురుగా పట్టెలు వేసియాడు.

సూతకి- (479) అశుచియగు స్త్రీ.

# పండితారాధ్యుడు

## బౌద్ధులను జయించిన కథ

### చందవోలు కైఫీయతు *

"తదనంతరం తూర్పు దేశముల నుంచి యీశ్వర ప్రసాద లబ్ధితులైన ముప్పట్టింని అఖండిత వీరశైవాచార వ్రతులయినటువంటిని । మానస లో దక్షవులయిన శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల వారు । శ్రీశైల ప్రవతులోద్యో కులై యీ మార్గాన చందవోలు వచ్చి । శ్రీ పాండీశ్వర స్వామి వారియొక్క ముఖమంటపములో వుండి వుంనందున శ్రీ మన్మహామండలీశ్వర కొండపడమటి బుధరాజులుంగారి । గుర్వు । బజ్జధ తాను సిరణశాస్త్ర ప్రవీణుడై । యిక్కడనే వుండినారు గనుక । మల్లికార్జున పండితారాధ్యుల వారి బిరుదు . మొదలయ్యేవి వైభవం చూచి । మతద్వేషం చాతను విరోధించి । పరాజయము పరచవలెనని । ప్రసంగం చేసినందున । యీశ్వరానుగ్రహ భూతుడు గనుక । వారు యిచ్చిన ప్రశ్నలు పూర్వపక్షం చేసి । జయనబవుధాచార్య వాక మతముల ఖండనచేసి పరాజయమును పొందింపచేసిరి. । గనుక తదనంతరం బవుధ గుర్వ పరిచారకులు । తమ గురు పరాజయం విచారించి । పండితారాధ్యుల వారి । శివపూజ నిష్ఠా గరిష్ఠత జూచి తన్నిష్టకు విఘ్నం ** చాయ దలచి పండితారాధ్యుల వారి లింగార్చన కాలమందు । నిత్యా వ్రతంగా నర్పించె । నక్షత్ర హారతి బెజ్జడనే బవుద్ధుడు యామరించి చోరత్వం చాతను తీస్కుపోతూవుండగా । పండితా

---

* లోకల్ రికార్డు సంపుటము. 19 పుట. 433. ఈ కైఫీయతు స్థానిక చరిత్రలు ప్రజోత్పత్తి నామసంవత్సర చైత్ర శు॥ 8 సోమవారము అనగా క్రీ. శ. 1811 లో మెకంజీ దొరవారు వ్రాయించినది.

** నిత్యము తాము చేయవలసినది శివపూజా విధానమందు నెట్టి విఘ్నము సంభవించినను. వీరశైవులలోని శీల వ్రతస్థులు, గండకత్తెర యను దానిని మెడకుం దగిలించుకొని శిరస్సు తామే నఱకికొని శివుని కర్పించుచుండిరట శివపూజాద్రవ్యమగు నక్షత్ర హారతీ లేకపోయినయెడల నా సేవకు విఘ్నము కలుగును, పండితుండు మడియుననని బౌద్ధుల యభిప్రాయము

రాధ్యుల వారి । శిష్యుడికి తెలిసి । చందవోలు పశ్చిమ పార్శ్వంగా వెళ్ళుతూ వున్న । పెజ్జిండ్లి కునురక్కని । అత్యంత కోపం చాతను । గురు ద్రవ్యం అపహరించిన దున । వాణ్ణి వధం చేసి ఆ నక్షత్రహారతి తీసుకొనివచ్చి గురువుకు తెలియకుండా । శివపూజా ద్రవ్యంల్లో తెచ్చివుంచినాడు । అటుపిమ్మట బవుధులు కొందఱు । పండితారాధ్యుల వారి దగ్గరకు వెళ్ళి । అక్రమంగా జీవహింస చేసినవారికి । శాస్త్రోక్త ప్రకారంగా । చర్యయతగ్గ ప్రాయశ్చిత్తమునకు విధి యేమి నిర్ణయించవలసినదో మా గురవు మిమ్మల్నైన అడిగిరమ్మన్నారు అని చెప్పినంతల్లో । యీలాగటి పనిచేయించిన వారి కండ్లు తోడించడం విధి అని చెప్పె గన్క అపుడు బవుధులు యీ క్రమం మీవల్లనే జరిగినదని । యీవత్తు తెలియచేసినంతల్లో ఆయన దివ్యజ్ఞానం చేత విచారించి । యిందుకు ప్రతిహతం విచారిస్తిమా అసత్యం పలికిన వారము అన్నతాము యిది అంతా బవుధులు చేసిన కృత్యముగదా అని తెలిసి స్నాన సంధ్యాద్యనుష్టానములతోను సరణ శాస్త్రోక్త ప్రకారంగాను । శివపూజా క్రియలు జరుపుకుని లింగోద్భవస్వామి వారి యెదట కూర్చుండి సదా శివుని యందె భక్తి వుంచి । యీశ్వరుడికి తన నేత్రములు తీసి లింగోద్భవుని ముందర పెట్టిన తరువాత ॥ అతని భక్తి విశేషంవల్ల । ఆ భక్తునికి తిరిగి కన్నులు ప్రసాదస్తు వచ్చినంతల్లో । తన ప్రభావం ప్రకటన చేసెకొరకు తిరిగి కన్నులు తోడుతూవచ్చినారు యీ ప్రకారంగా మువ్వదు పరియంతరం కన్నులు తోడి అంతట పండితారాధ్యులవారు । భవుడూ * యీ ప్రకారంగా విపరీతం చేసినందున కోపంవచ్చి యింతనుంచి । యీ చందవోలులో లింగదారి కాతైన వారికి శివపూజ చర్యాదానకు హారహాత లేకపో అనివ్వి । యీ పట్నం కొంతమట్టుకు బస్తిగా పుండకపోనన్నీ యీ బవుధులకుయీ స్తలంలో జయంలేక పోవున న్నీ శాపం యిచ్చి అక్కడినుంచిలేచి । ఆ గ్రామాన్కు దక్షిణ భాగాన నవనందవంటి మహా ప్రభావంగ గోకర్ణేశ్వరం వెళ్ళి । శివసన్నిధ్యముందు వున్న సమయమున, గోకర్ణేశ్వరస్వామివారు । యీయనయందు కరుణించి నిల్పి కన్నులు దయచేసినారు । గన్క అక్కడనుంచి శ్రీశైల ప్రదక్షిణం వెళ్ళినారు పండితారాధ్యుల వారి శాపంవల్లను । బవుధులు దినదిన క్షీణమైపోయిరి **"

---

* లింగధారులు లింగము లేనివారినందఱును 'భవులు' అని యందురు.

** ఈ కైఫీయతు ప్రజోత్పత్తి నామ సం॥ర. చైత్ర. శు॥ 8 సోమవారం వి 1 తేది ఏప్రిల్ను ఆన 1811 సంవత్సరం దినమున వ్రాయబడియెనని దాని చివరనున్నది.

సుమహార్ఘణ స్థానసుకర దీపములో
యుదయార్క శకలంబులో మణిద్యుతులో
సదమల జ్ఞానబీజంబులో యనంగ
నొప్పె. వెండియు భక్తి యువతి నేత్రముల
యొప్పులీ కన్నుల యొప్పులనంగ
ధరపీర భక్త చింతామణి రుచులం
బొరిపొరి నీనేత్రముల రుచులనంగ
దృష్ట సద్గురు దయాదీపిత జ్ఞాన
దృష్టులీ కన్నుల దృష్టులనంగ
సొంపారుని జహ్వాదీశుని పదాబ్జముల
కెంపులీకన్నుల కెంపులనంగ
సల్ప్రాణ లింగాంఘ్రినఖదర్పణముల
తెలుపు లీకన్నలు తెలుపులనంగ
సిద్ధంబులై మహనియ్యంబులైల
సద్దయాస్వికములై శాంతిపూరంబు
లై కళాయుక్తంబులై సధామయము
లై కమనియ్యంబులై ఉసత్కాంతి
మంతంబులై యసమానంబులై ని
శాంత బులై వినూతనములై విబుధ
సన్నుతములో నయ్యుంజను నెకనిడుద
కన్నులు లోకవిఖ్యాతమై వెలుంగ".

పండితారాధ్య చరిత్ర మహిమ ప్రకరణము

2-98-100 పుటలు

తెలుగు శివతత్త్వసారమున

లభింపని పద్యములు కన్నడ శివతత్త్వసార పద్యముల

కనువాదములు—

కన్నడ శివతత్త్వసారమున 726 నుండి 740 వఱకుగల కన్నడ పద్యములకు సమానమైన పద్యములు తెలుగున లభింపలేదు. కాబట్టి ఆ కన్నడ పద్యానువాదముల నిందు చేర్చుచున్నాము.

మృడ ! నీదు పాదభక్తిని
వడిగొని భజియించునట్టి వారలకెల్లన్
చెడు ఘోరపాప చయములు
కడుకొని శుభములును మూర్ధ్వగతులగును శివా ! (726)

ఉపమింపగ రుద్రాక్షు
త్రిపుండ్ర ధారణము లేక దివి రెడు విప్రుల్
జపదాన వ్రతతప ధ
ర్మ పురోగమఫలము బ్రహ్మమనజేయడజా ! (727)

కృతమతి వర్ణాశ్రమముల
శ్రుతి విహితంబైన భూతి రుద్రాక్షుల సం
తతము ధరింపని విప్రుడు
ప్రతిదిన కృతకర్మఫలము బడయుడు రుద్రా ! (728)

అడ్డముగ త్రిపుండ్రంబులు
రడ్డి ధరించిననె ఫలకరంబగునా ? నెం
యొడ్డిన భక్తియ లేకను
నడ్డును యమలోకమెపుడు

విస్మయమగు ప్రియమునని
భస్మంబు నలంద సకల పాపచయంబుల్
భస్మీ భూతములగు ద
గ్దస్మర ! మున్నరిది నీపరితాపంబు శివా ! (730)

భూతాది సకల జీవ
వ్రాతంబులు నీదునాజ్ఞ వడయుటగాదే
భూతపతి ! నీ మహోన్నత
భూతి విభూషించునట్టి పుణ్యంబు హరా ! (731)

పురహర నేత్రోద్భవములు
వర రుద్రాక్షలను దాల్చువారికి నెపుడున్
దురితములు పొరయవాపై
పరమ శుభంబులును గలుగు పరమ ! మహేశా ! (732)

రుద్రాక్ష ధారణంబున
భద్రంబగు శివునిభక్తి భాసిల్లెడును
న్నిద్రంబగు తను కాంతియు
నద్రి సుతారమణ, భుజగహారకపర్ది (733)

జల[illegible]స నాచ్యుతాదుల
కలవియు గానట్టి నీమహా మహిమను భ
క్తులు నీదుభక్తిగతి నీ
కలరూపు నెఱుంగఁ గలరు కంఠేకాలా ! (734)

చింతించు కొలది మనసున
కంతకు నంతకును బెద్దయై యొప్పుచు నా
ద్యంతములు లేనిరూపము
చింతించు కొలంది పెరుగు చిత్రంబు శివా ! (735)

విలసద్భక్తి రసామృత
కవితాంగుల దేహమెల్ల కాంత్యుజ్జ్వలమై
చెలువొందుచుండు రజతా
చల శంకర దివ్యమూర్తి సరణిని నభవా ! ([illegible])

విమలతర భక్తిభావన
క్రియయుక్తిని బెరిగి హృదయ కంజాతమునన్
అమరిన యన్నడు నెన్నడు
యమునికి వెఱవండు శేషహారాభరణా. ([illegible])

అవనిం దుర్లభమగు మా
నవ జన్మంబెత్తి భక్తినయగతి సతమున్
శివు ప్రార్థింపని మనుజుని
భవమది వృథయగును భావభవ సంహారా. ([illegible])

విదిత శుభాశుభ బోధా
స్పదుడగు మానవుడు హరుని పరభక్తిమెయిన్
ముదమునఁ జరింపకుండిన
గుదిగట్టిన పశువుసమము గోపతిగమనా. ([illegible])

శిష్టాచారాది మహో
వష్టంభుఁడైన తాను వారకగర్వా
విష్టుడగునేని యాతడు
నిష్టపు శివభక్తి గాననేరడు రుద్రా. ([illegible])

కన్నడ భాషలో ప్రాసనియమమేగాని యతి నియమములేదు. ఆ భాషా సంప్రదాయము ననుసరించి, ఆప్రాస నియమముతో, తెలుగున యతి నియమమును పాటించి పై యనువాదము నాంధ్రలోకమున కందించితిని- ప్రాజ్ఞులు పరిశీలింతురు గాక.

నిడుదవోలు వెంకటరావు

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 16 | ర్తునే | ర్తునె |
| 7 | 4 | నాఃపతి | నాంపతి |
| | (అధోజ్ఞాపిక) | | |
| | ( 8 ) | 188 ప్ర | 18 ప్ర |
| | ( 9 ) | ధము:పాశము | ధముపాశము |
| | ( 10 ) | బ ధ. | బంధ |
| 9 | 4 | మునశాధి | మునశాధి |
| 10 | 19 | నీయో | నీయో |
| 14 | 16 | డలబు | డంబు |
| 15 | 14 | వదలెద | చదివెద |
| 17 | 20 | ఱిగి | ప్రిఁగి |
| 18 | 2 | న్మధ | న్మథ |
| | (అధోజ్ఞాపిక) | | |
| 20 | 9 | కిమ(ఱి) | కివిమ(ఱి) |
| 21 | 14 | కారాం్యం | కార్యా |
| | 1 | నివ్య | నివ్వ |
| | (అధోజ్ఞాపిక) | | |
| | | నివ్వ్య | నివ్వ |
| | | ష్టు | ష్ట |
| 22 | 12 | దిక్కృక | ద్రిక్కృక |
| 24 | 17 | చ్యుదా | చ్యుతా |
| 25 | 22 | హ్యో | హ్యో |
| 26 | 6 | తుడ | తుఁడ |
| 27 | 21 | మము | మము |
| 29 | 2 | నిషా | నిష్ఠా |
| 30 | 2 | తి | తినసి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 32 | 14 | వృధ | వృథ |

34 168 పద్యము తుత్రృష్ణాదివిజితులు
బత్తళి జలతపనశత వాదాదులును — అని పుట చివరనున్నది

ఈ రెండు పాదములైన తరువాత

35 వ పుటలో వీరపరివారిత్వము ని
ష్కారుణత్వము - అన్న పద్యము
మొదటి ముద్రితమైనది - మిగిలిన రెండు పాదములు లేవు.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 36 | 13 | సిపై తో | సిపై తో |
| 42 | 14 | ట్రిదై | టిరై |
| 44 | 12 | దీతి | దీతి |
| 45 | 8 | క్రుతు | కృతు |
| 46 | 4 | మీతి | మీటి |
| 47 | 17 | భక్తి | భక్తి |
| 48 | 15 | ఒటి | వెటి |
| 49 | 6 | క్షిం తాత | క్షితాంత |
| 66 | 5 | జత | జతు |
| 74 | 23 | హోము | హోసము |
| 77 | 10 | బ్రో | బో |

పీ ఠి క

| పుట. | పంక్తి | త త్త | త త్త్వ |
|---|---|---|---|
| 3 | | | |
| (అధోజ్ఞాపిక) | 8 | | |
| | 7 | భాతి | భారతి |
| 4 | 22 | 181 | 191 |
| 5 | ఇందున్న యధోజ్ఞాపిక నాలుగవ పుటకు సంబంధించినదిగా నెఱుగవలెను. | | |
| పుట 5 | 6 | రెడింటి | రెండింటి |
| 6 | 14 | నమా | సమా |
| 7 | 17 | ఆది | అది |
| 8 | 3 | నిఘటు | నిఘం |
| (ఆధోజ్ఞాపిక) | 9 | ఎఱగెడి | ఎఱిగెడి |
| | | తన్న | తన్ను |
| 13 | 14 | మథు | మధు |
| 15 | 24 | 1190 40 | 1140-1190 |
| 17 | 25 | ర్బంబు | ర్భంబు |
| 19(అధోజ్ఞాపిక) | 14 | సురి | సూరి |
| 21 | 2 | నట | నట |
| | 5 | చెమ | చెను |
| 22 | 17 | పిచి | పించి |
| 24 | 6 | శాన | శాస |
| 27 | 10 | శాస్త్ర | శాస్త్రిను |
| | 11 | ఘము | ఘముఁడు |
| 32 | 4 | ఏంతో | ఎంతో |
| | 20 | కచి | ంచి |
| | 25 | దటా | దజా |
| | | దీనియన్ని | వీనినన్నిటిని |
| 33 | 12 | వాడు | సాడు |

| | | | |
|---|---|---|---|
| | 13 | నస్నె | నన్ని |
| 34 | 7 | ష్ఠిచె | ష్ఠించె |
| | 12 | పురుని | పురని |
| | 26 | సాగ | సాంగ |
| 35 | 2 | పీఅ | లీ[illegible] |
| | 17 | తబు | తంబు |
| 39 | 4 | శ్రీధ | శ్రీకధ |
| | 10 | పబ | పం[illegible] |
| | 20 | శుభర | శుభకర |
| 44 | 21 | ఃత | పవ |
| | 22 | రఁక | రంగక |
| 45 | 18 | పడి | పండి |
| | 20 | ముదు | ముందు |
| 46 | 14 | తబ | తంబ |
| | 18 | రంబు | రాంబు |
| | 22 | చెది | చెడి |
| 47 | 9 | అభ | ఆభ |
| | | చేన | చిన |
| 50 | 11 | వని | వు. |
| 52 | 25 | దిది | డిది |
| 61 | 19 | పూర్తో | పూర్వో |
| 63 | 8 | పడి | పండి |
| 65 | 7 | రగు | నగు |
| 69 | 6 | చందో | ఛందో |
| 74 | 12 | వటి | మటి |
| 75 | 11 | పియ | పయ |
| 77 | 1 | కదా | కుదా |
| | 25 | తెమ | తెను |
| 86 | 12 | మద్వ | మధ్వ |

| | | | |
|---|---|---|---|
| 87 | 24 | దార్ఢి | దార్ఢ్య |
| | | లిగ | లింగ |
| 88 | 12 | సిద్దాం | సిద్ధాం |
| 89 | 23 | ఛేయు | చేయు |
| 90 | 5 | ఇదు | ఇందు |
| | 6 | లింగా | లింగ |
| 94 | 14 | వశు | పశు |

ఈ క్రింది సవరణలను గమనింపుడు :—

పంక్తి

3వ పుట 17 ప్రథమ ముద్రణము— ఇది 22వ పంక్తి తరువాత చదువవలెను.

23 ద్వితీయ ముద్రణము— దానికి సంబంధించినదే.

33వ పుట 1, 2 పంక్తులు— ప్రమథాయ రుద్రాయ భక్తిప్రదాయ
విమలాయ నిత్యాయ విశ్వస్తుతాయ—
అనునవి 39వ పుటలో మొదటి రెండు పంక్తులుగా
చదువవలెను.

———